# TAMILA VINDU

**(A Collection of essays) by**

Dr. Challa Radhakrishna Sarma, **M. A., M.litt. Ph. D.,**

**First Edition, 1986**

*For Copies*
**Andhra Pradesh Book Distributors**
**3237. Rashtrapathi Road,**
**Secunderabad 500 003.**

**Dr. C. R. SARMA**
**Prof. of Telugu**
**Madurai Kamaraj University**
**Madurai 625 021**

Price : **Rs. 15-00**

**Printed at :**
WELDUN PRESS
**No. 2, 1st Street,**
**Dr. Radhakrishnan Nagar**
**MADRAS-600 021.**



స్వధర్మ స్వారాజ్య సంఘ సంస్థాపకులు

శ్రీ కౌతా సూర్యనారాయణరావుగారు

స్వధర్మ స్వారాజ్య సంఘ సంస్థాపకులు

# శ్రీ కౌతా సూర్యనారాయణరావుగారు

శ్రీమంతుల యింట ప్రభవించిన శ్రీ కౌతా సూర్యనారాయణరావుగారు నెలకు 7 రూపాయల తక్కువ జీతం మీాద ఉపాధ్యాయునిగా జీవిత రంగంలో ప్రవేశించారు. స్వయం కృషీ క్రమబద్ధమైన జీవితం తోడు కాగా, ఆయన దక్షిణ భారతంలో ప్రముఖ పారిశ్రామిక వేత్తలలో ఒకరై పేరు పెంపులు గడించారు. ఇండియన్ క్యాపర్స్ అండ్ ఇండస్ట్రీస్ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, కౌతా స్టీల్ ప్రాడక్ట్స్, బీ హైవ్ ఫౌండ్రి మొదలైన పెక్కు సంస్థల్ని స్థాపించారు.

విద్య, మతం, దాన ధర్మాలు మొదలైన వాటికి సంబంధించిన తమ కార్యకలాపాలను సమన్వయ పరిచే దృష్టితో శ్రీ కౌతా సూర్యనారాయణరావుగారు 1930 లో స్వధర్మ స్వారాజ్య సంఘం స్థాపించారు. తమ ఆధ్యాత్మిక భౌతిక జీవితాలకు శ్రీ కృష్ణ పరమాత్ముణ్ణి ఆయన మార్గ దర్శకుడుగా గ్రహించారు. ఆ పరమాత్ముడికి కృతజ్ఞతా సూచకంగా తన స్వార్జితం నుంచి ముక్కాలు మువ్వీసం స్వధర్మ స్వారాజ్య సంఘానికి సమర్పించారు. పరిహాస కుశలతకూ క్రమశిక్షణకూ ధర్మబుద్ధికీ ఆయన మారుపేరుగా ప్రతిభాసించారు. అయినా ప్రచార ధోరణికి ఆయన విముఖులు, ఆయన్ని 'పారిశ్రామిక వేదాంతి' అని ఆయన అత్యంత

సన్నిహితులు వ్యవహరించేవారు. స్వధర్మ స్వారాజ్య సంఘం పాఠశాలలూ, సాంఘిక సంస్థలూ స్థాపించింది; ఉపకార వేతనాలు నెలకొల్పింది; పత్రికలూ ముద్రణాలయాలూ నిర్వహిస్తున్నది. భారతీయ సాంస్కృతిక క్షేత్రాన్ని కౌతా వారి ఔదార్య వాహినులు సుసంపన్నం చేస్తున్నాయి.

ప్రతి యేడూ తాము నిర్వహించిన విద్వత్ సదస్సులలో ఖండన ఖండ ఖాద్య వంటి సుప్రసిద్ధ అద్వైత గ్రంథాలను ఆయన వ్యాఖ్యార్థం కోసం ఎన్నుకునే వారు. మైసూరు సంస్థానానికి చెందిన మహా మహోపాధ్యాయ అనంతకృష్ణ శాస్త్రి, శ్రీ వేంకటేశశాస్త్రి గారలు శ్రీ ద్రావిడ రాజేశ్వరశాస్త్రి ప్రభృతులు ఆయనకి గల ఆసక్తిని ఎంతో మెచ్చుకున్నారు. భారతీయ సంస్కృతికి అంతిమ లక్ష్యమైన నిత్య నిరతిశయానందాన్ని సాధించడమే ఆయన లక్ష్యంగా ఉండేది.

శ్రీ కౌతా సూర్యనారాయణరావుగారు తలపెట్టిన మహాకార్యాలను ఆయన దౌహిత్రులు శ్రీ బి. వి. యస్. యస్. మణిగారు శ్రద్ధాసక్తులతో నిర్వహిస్తున్నారు.

# మనవి మాటలు

తెలుగు తమిళములు తోబుట్టు భాషలు. అందువల్ల ఈ భాషా సాహిత్యాల మధ్య దగ్గరి చుట్టరికం నెలకొనడంలో ఆశ్చర్యం లేదు. ఈ అనుబంధం ఇంకా దృఢతరం కావాలని నా అభిలాష. ఈ అభిలాషే ఈ పుస్తక ప్రచురణకు ప్రేరణ.

తమిళ సాహిత్యం బహు ప్రాచీన మైనదని ప్రాచ్య పాశ్చాత్య పండిత లోకం అంగీకరించిన విషయం. గత మూడు దశాబ్దులుగా ఈ సాహిత్యం గురించి యథాశక్తిని వ్రాస్తున్నా, వ్రాయవలసిన విషయాలే ఇంకా ఎక్కువగా ఉన్నాయని నా అభిప్రాయం. తమిళ సాహిత్యం గురించి తెలుగువారూ, తెలుగు సాహిత్యం గురించి తమిళులూ తెలుసుకోవాలి. అప్పుడే తులనాత్మక సాహిత్యాధ్యయనానికి చక్కని దారి యేర్పడుతుంది.

ప్రాచీన, ఆధునిక తమిళ సాహిత్యాలను గురించి అప్పుడప్పుడు నేను వ్రాసిన వ్యాసాలు ఈ సంపుటిలో అందాలు దిద్దుకున్నాయి. వీటిని ప్రకటించిన ఆయా పత్రికా సంపాదకులకు కృతజ్ఞుణ్ణి. కొన్ని వ్యాసాలు సాహిత్య ప్రియులకే కాక పరిశోధకులకు కూడా తోడ్పడగలవని నేను భావిస్తున్నాను. ఉదాహరణకు, తమిళంలో సంస్కృత శబ్దాలు అనే వ్యాసం కొంచెం వివాదాస్పదమైన విషయం, ఏది సంస్కృతమో ఏది కాదో ఖచ్చితంగా చెప్పలేనంతగా కొన్ని మాటలు కనిపిస్తాయి. అయినా వీటిని పరిశోధకులు పరిశీలించాలని నా మనవి. ఈ దృష్టితోనే యీ వ్యాసం చేర్చబడింది. ఈ సంపుటిని తెలుగు సోదరులు ఆదరించగలరని నా నమ్మకం. రచనావసరమున చాలా తమిళ రచనలు సంప్రతించాను. ఆయా గ్రంథకర్తలకు మిక్కిలి కృతజ్ఞుణ్ణి.

ఈ వ్యాస సంకలనం వెలుగు చూడడానికి రసహృదయులూ వదాన్యులూ అయిన శ్రీ బి. వి యస్. యస్. మణిగారి ఔదార్యమే కారణం. శ్రీ మణిగారికి నా కృతజ్ఞతను సవినయంగా తెలుపుకుంటున్నాను. స్వధర్మ స్వారాజ్య సంఘం వారికి నేను బహుధా కృతజ్ఞుణ్ణి.

ఈ సంపుటిని చక్కగా ముద్రించిన వెల్డన్ ప్రెస్సు వారికి కృతజ్ఞుణ్ణి.

చల్లా రాధాకృష్ణశర్మ

# విషయసూచిక

# తమిళ వాఙ్మయ పరిచయం

తమిళభాషా వాఙ్మయాలు చాలా ప్రాచీనమైనవి. క్రీస్తుకు పూర్వమే తమిళ వాఙ్మయం వెలుగులోకి వచ్చినట్లు తద్భాషా పండితుల అభిప్రాయం. తమిళముని అని ప్రసిద్ధి కెక్కిన అగస్త్య మహర్షి ప్రథమ లాక్షణికుడని ప్రతీతి. మహేశ్వరుడు పాణినికి సంస్కృత వ్యాకరణమునూ, అగస్త్యునికి తమిళ వ్యాకరణమునూ ప్రసాదించెననీ, అగస్త్యుని లక్షణ గ్రంథమైన అగత్తియంలో 12,000 సూత్రాలు కలవనీ చెపుతారు. తరువాతి లాక్షణికులకు మార్గదర్శకమైన యీ గ్రంథంలో అక్షరామ్నాయం, కావ్యవస్తువు, ఛందోలంకారములు, రాజనీతి, జ్యోతిషం మొదలైన పెక్కు విషయాలు వివరించబడినట్లు విశ్వసించబడుతున్నది. కాని దురదృష్టం, అగత్తియం పూర్తిగా లభ్యం కాలేదు,

ప్రాచీన తమిళ లాక్షణికులు తమ వాఙ్మయాన్ని ఇయల్, ఇశై, నాటకం అని విభజించారు, ఇయల్ అంటే సాహిత్యం. ఇశై అంటే సంగీతం. సాహిత్యాన్ని ఇలక్కణం (లక్షణం), ఇలక్కియం (లక్ష్యం) అని మళ్ళీ రెండు భాగాలు చేశారు.

కొందరు పండితులు తమిళ వాఙ్మయ చరిత్రను సంగయుగం, జైన బౌద్ధుల యుగం, శైవ వైష్ణవ భక్తుల యుగం, కవిత్రయ యుగం, పురాణేతిహాస యుగం, ఆధునిక యుగం అని విభజించారు.

సంగయుగం చాలా ప్రాచీనమైనదే కాక ప్రధానమైనది కూడా. కవి సమూహాన్ని సంగమని వ్యవహరించినట్లు చెప్పవచ్చు. ఇటువంటి కవి సంఘాలు మూడు వర్ధిల్లినట్లూ, తొలి సంగంలో 549 మంది, మధ్య సంఘంలో 59 మంది, కడ సంగంలో 49 మంది కవులూ ఉండేవారనీ, అగస్త్యుడు తొల్కాప్పియనార్, నక్కీరర్, తిరువళ్ళువర్ మొదలైన ప్రముఖ లాక్షణికులూ కవులూ ఆ సంఘాలకు చెందినట్లూ పండితుల అభిప్రాయం,

అగస్త్యుని శిష్యుడుగా భావించబడుతున్న తొల్కాప్పియనారు కూడా ఒక లక్షణగ్రంథం వెలయించాడు. దానిపేరు తొల్కాప్పియం. ఇది 1,612 సూత్రాల విశిష్ట రచన. సంస్కృతంలోని ఐంద్ర వ్యాకరణం అనుసరించి సంతరించబడినట్లు చెప్పబడుతున్న యీ గ్రంథంలో మూడు ప్రధాన భాగాలు ఉన్నాయి. అవి మళ్ళీ

తొమ్మిది భాగాలు చేయబడ్డాయి. తొల్కాప్పియం ప్రత్యేకతను తెలియజేస్తున్న కావ్యవస్తువు విభాగంలో యుద్ధ విధానం, ప్రేమ దానికి సంబంధించిన వివిధ విషయాలు, ఛందస్సు, లోకోక్తుల్కు మొదలైనవి వివరించబడ్డాయి.

తమిళ వాఙ్మయాన్ని పరిపుష్టం కావించిన ప్రతిభా గరీయస్కుడు తిరువళ్ళువర్. ఆ మహాకవీ, తత్త్వవేత్తా వెలయించిన నీత్యుద్బోధక గ్రంథం తిరుక్కురళ్. దీనికి తమిళవేదమనే ప్రసిద్ధ నామాంతరం ఏర్పడింది. ఇందులో 1,330 కురళులు ఉన్నాయి. వీటిలో అందాలు దిద్దుకున్న సూక్తులు సుధారసోక్తులు. సార్వజనీనములు: సార్వకాలికములు కూడా.

కురళులో ధర్మార్థకామములకు సంబంధించిన అనేక అమూల్య విషయాలు మనోజ్ఞంగా వివరించబడినాయి. వళ్ళువర్ దృక్పథంలో కష్టపడి సేద్యం చేసి యావత్ప్రపంచాన్ని పోషించే కర్షకుడూ, యతులకు మృతులకు అభ్యాగతులకు దీనులకు ఏడుగడగా ఉండే గృహస్థూ పరమపూజ్యులు, పాలకులూ పాలితులూ ధర్మమార్గావలంబకులై ఉండాలనీ. కామక్రోధమోహములే మానవుని కష్టాలకు కారణమనీ కురళ్ వ్యక్తం చేస్తుంది.

సంగకాలంలోనే సంకలన గ్రంథాలు కొన్ని ప్రచారంలోకి రావడం గమనించదగిన అంశం. వాటిలో ఎట్టుత్తొగై, పత్తుప్పాట్టు, పదినెణ్ కీళ్ కణక్కు మొదలైనవి పేర్కొనదగినవి, ఇవి పదరచనలు. కనుక దేశి సాహిత్య సంప్రదాయాలను తెలుసుకునేందుకు ఈ కావ్యకదంబం ఉపకరిస్తుంది. ఈ సంకలన కృతుల్లో అగనానూరు, పురనానూరు అనేవి సుప్రసిద్ధములు.

సంగయుగంలో ప్రచారంలోకి వచ్చిన గ్రంథాలలో నీతికి ప్రకృతి వర్ణనలకూ ప్రాధాన్య మిచ్చినవే ఎక్కువగా కనిపిస్తున్నాయి, సంగకవులలో కొందరు సంస్కృతభాషాభిజ్ఞులుగా కనిపిస్తున్నారు. ఆనాళ్ళలోనే ముప్పయిమంది కవయిత్రులు వర్ధిల్లినట్లు తెలియవస్తున్నది.

తమిళ వాఙ్మయంలో కావ్యరచన ప్రారంభ మయింది జైన బౌద్ధుల యుగంలోనే. తమిళ పంచకావ్యాలని ప్రసిద్ధికెక్కిన సిలప్పదికారం (మంజీర మహిమ), మణిమేకలై, జీవక చింతామణి, వళయాపతి, కుండలకేశి మొదలైన వాటిని జైన బౌద్ధులు వెలయించారు. ఈ కావ్యపంచకంనుంచి ఆనాటి తమిళుల సామాజిక జీవనం, తమిళనాడులో జరిగే దేవోత్సవాలూ ఆ సందర్భంగా జరిగే వింతలు వేడుకలు, వణిక్ప్రముఖుల స్థితిగతులు మొదలైన ఎన్నో విషయాలు తెలుసుకోవచ్చు.

1,652 పద్యాలు గల సిలప్పదికారం క్రీస్తుశకం 6 వ శతాబ్ది మధ్య భాగంలో రచించబడినట్లు పరిశోధకులూ, 2 వ శతాబ్దిలోనే రచించబడినట్లు పండితులూ విశ్వసిస్తున్నారు. సతీదేవి అని ప్రజా సన్నుతిని చూరగొన్న కణ్ణకి కథ ఇందులో మనోహరంగా చెప్పబడింది. ఆమె పవిత్ర జీవనఘట్టాలు కావేరీ నదీ జలాలవలె చేర చోళ పాండ్యములవే ప్రాచీన తమిళ రాజ్యత్రయాన్ని పెనవేసుకున్నాయి.

కణ్ణకి భర్త అయిన కోవలుడికి మాధవి అనే వేశ్యకూ ప్రభవించిన మణిమేఖల అనే ముద్దుగుమ్మ కమ్మని కథ మణిమేకలై కావ్యంలోని ఇతివృత్తం, ఈ కావ్యమూ సిలప్పదికారమూ జంటకావ్యాలుగా వ్యవహృత మవుతున్నాయి.

ధర్మార్థ కామమోక్షములను వివరించే జీవకచింతామణి మధుర మంజులమైన శైలికి పెట్టింది పేరు, తరువాతి కవులకిది మార్గదర్శక మయింది. కుండలకేశి, వళయాపతి నామమాత్రంగా తెలియ వస్తున్నాయి.

కావ్యాలూ నీత్యుద్బోధక రచనలే కాక జైన బౌద్ధులు ఛందోలంకార గ్రంథాలూ రచించి తమిళ సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు, వాటిలో నాలడియార్ (చతుష్పది) అనే నీతి ప్రధాన రచన, నన్నూల్ అనే లక్షణగ్రంథం, గ్రంథకర్తృనామం తెలియని దండి అలంకారం మొదలైనవి ఉన్నాయి,

'ఆలుం వేలు పల్లుక్కురుది
నాలుం ఇరండుం సొల్లుక్కురుది'
(మర్రీ తుమ్మా పళ్లకి గట్టి
నాలుగూ రెండూ పలుకుకి గట్టి)

అని తమిళంలో ఒక నానుడి. మర్రిపుల్లా తుమ్మపుల్లా పళ్లను గట్టి పరిచేటట్లు, నాలుగడుగుల నాలడియారూ, రెండడుగుల తిరుక్కురళూ మాటను గట్టి పరస్తాయని యిందులోని భావం. కాగా, నాలడియార్ కూడా విశిష్ట రచన అనడం అత్యుక్తి కాదు.

జైన బౌద్ధ మతాచార్యుల ప్రాబల్యం తగ్గుముఖం పట్టడంతో, తమిళ నాడులో శైవ వైష్ణవాలు మళ్ళీ విజృంభించాయి. వాటితోపాటు భక్త్యుద్యమం బలం పుంజుకుంది, శివ భక్తులకు నాయన్మారులనీ, విష్ణు భక్తులకు ఆళ్వారులనీ వ్యవహార నామాలు, ఈ భక్త కవులు వెలయించిన గీతాలు భక్తిరసపు ముద్దలు అంతేకాక ఆ గీతాలలోని భాష సులభ సుందర మయింది; వ్యావహారిక భాషకు

సన్నిహితమయింది. అందువల్ల ఆ భక్తి గీతాలు అనాయాసంగా ప్రచుర ప్రచారం పొందాయి. నాయన్మారుల భక్తిగీత సంకలనాన్ని తేవారం అనీ, ఆళ్వారుల గీతికా గుచ్ఛాన్ని నాలాయిర దివ్య ప్రబంధమనీ వ్యవహరిస్తారు. ఈ రెండూ శైవ వైష్ణవులకు పరమ ప్రీతి పాత్రములు. ఈ భక్తకవుల కాలపు తమిళ సాహిత్యం భక్తి రసప్లావిత మనడం చర్విత చర్వణం. కుల భేదాలను నిరసించిన విశాల హృదయులు వారు. భక్త్యావేశం వారి రచనలకు జీవం పోసింది.

తమిళవాఙ్మయచరిత్రలో చోళరాజుల పరిపాలనా కాలం స్వర్ణయుగం. కవిత్రయమని పేరు గడించిన కంబన్, ఒట్టక్కూత్తన్, పుగళేంది మొదలైన మహాకవులు వర్ధిల్లింది ఈ యుగంలోనే. ఉలా, పరణి వంటి నూతన సాహిత్య ప్రక్రియలు వెలుగులోకి వచ్చింది కూడా ఈ యుగంలోనే. మౌలిక రచనలతోపాటు సంస్కృతకావ్యానువాదాలు, అనుసరణలు ప్రచారంలోకి రావడం ఈ యుగంలోనే ప్రారంభ మయింది.

కవిచక్రవర్తి బిరుదాంకితుడైన కంబన్ రామావతారమనే నామాంతరం కల రామాయణం రచించాడు. తమిళంలోనే కాదు ఇతరదేశ భాషలలోనూ వెలిసిన తొలి రామాయణ మిది. వాల్మీకిని అనుసరించి రచన చేసినా, కంబరామాయణంలో మూలానికి భిన్నములైన మార్పులు లేకపోలేదు. తెలుగు రామాయణ కర్తలవలె, కంబకవి కూడా రామచంద్రుణ్ణి దైవంగా సంభావించాడు. ఆ మహాకవి అభివర్ణించిన రావణుడు శివభక్తుడు, వీరయోధుడు, వైణికుడు. ఇరవైనాలుగువేల శ్లోకాల రామకథను కంబన్ పన్నెండువేల వృత్తాలలో రచించాడు. తిరువళ్ళువరూ కంబకవీ తమిళకవి పండితలోకానికి ఆరాధ్యులు.

చోళుల ప్రాబల్యం తగ్గిపోవడంతో, విజయనగర సామ్రాట్టుల సామంతులనదగిన నాయకరాజులు కొంతకాలం తమిళవాఙ్మయాన్ని పోషించారు. ఆ తర్వాత మరాఠాధిపతులు పోషించారు. వారి సమాదరణంలో పురాణాలు, వ్యాఖ్యాన గ్రంథాలు, సిద్ధుల రచనలు, తాత్త్విక రచనలు ఎన్నో వెలుగులోకి వచ్చాయి. సృజనాత్మక సాహిత్యం అంతగా రాకపోవడంవల్ల, ఈ యుగాన్ని క్షీణయుగంగా పేర్కొనడం జరుగుతున్నది. అంతమాత్రాన ఈ యుగంలో మహాకవులు వర్ధిల్లలేదనీ, కావ్యనిర్మాణం జరగలేదనీ భావించరాదు. విల్లిపుత్తూరార్ సంతరించిన మహాభారతం, భక్తకవి అరుణగిరినాథర్ వెలయించిన తిరుప్పుగళ్, అరుణాచలకవి వ్రాసిన గేయరూపకం రామనాటకం మొదలైనవి పేర్కొనదగినవి. తాయుమానవర్ వంటి భక్తులు కవితలో మార్మికతను ప్రవేశపెట్టారు. సంస్కృత

శబ్దాలు వాడినా, ఆయన రచనలో సారళ్యమూ గాంభీర్యమూ చోటు చేసుకు న్నాయి. ఈ యుగంలో పిళ్ళైత్తమిళ్, కురవంజి, విల్లుప్పాట్టు వంటి కొత్త ప్రక్రియలు వాడుకలోకి వచ్చాయి. దైవాన్నిగాని మహాపురుషుణ్ణిగాని శిశువుగా భావించి, శైశవావస్థల్ని అభివర్ణించే విశిష్టప్రక్రియ పిళ్ళైత్తమిళ్. బుర్రకథలాంటిది విల్లుప్పాట్టు.

వ్యాపారం కోసమనీ, మతప్రచారం కోసమనీ, మనదేశానికి వచ్చిన పాశ్చాత్యులు కొందరు తమిళభాషాధ్యయనం చేశారు. ఆకోవకు చెందినవారిలో వీరమా మునివర్ అని ప్రసిద్ధి వహించిన ఫాదర్ బెస్చీ సంభావ్యుడు. ఆయన యేసుక్రీస్తు జీవితాన్ని తేంబావణి అనే కమనీయ కావ్యంగా వెలయించాడు. ఇది 30 అధ్యాయాలు కల గ్రంథం. నిఘంటు రచనలోనూ, ఆయన అందెవేసిన చెయ్యి.

క్రైస్తవమత ప్రచారంకోసం బెస్చీ తమిళనాడులో అడుగుపెట్టినా, ఆయన సాహిత్యక్షేత్రంలో కృషిచేసి బంగారుపంటలు పండించాడనవచ్చు. తమిళంలో ప్రప్రథమంగా వెలువడిన వచనరచన ఆయన లేఖినినుంచి వెలువడిందే. అకారద్యక్షర క్రమంగా నిఘంటు నిర్మాణం కావించి తరువాతి వారికి మార్గదర్శకుడైనట్లుగా, ఆయన వ్యావహారిక గ్రాంథిక తమిళభాషలకు వ్యాకరణాలు వెలయించాడు.

డూప్లేవద్ద ద్విభాషిగా ఉండిన అనందరంగంపిళ్ళై తమిళంలో డైరీ ఒకటి వ్రాశాడు. ఆనాటి చారిత్రక పరిస్థితుల్నీ, తమిళభాషా స్వరూపాన్నీ తెలుసుకు నేందుకు ఈ డైరీ బహుథా ఉపకరిస్తుంది. ఆధునిక తమిళవచన రచనకు ఆనందరంగం పిళ్ళై పథప్రదర్శకు డనవచ్చు.

19 వ శతాబ్దిలో వర్ధిల్లిన కవులలో జ్యోతి రామలింగస్వామి చాలా ప్రసిద్ధుడు. ఆయనే కడపటి భక్తకవి అన్నా సాహసం కాదు. జటిలంగా ఉన్న తమిళ కవిత్వానికి ఆయన సారళ్యం సమకూర్చాడు. అందువల్ల ఆయన గీతాలు భక్తిరసప్లావితాలే కాక పండితపామర రంజకాలు కూడా. అరుణాచలకవీ, గోపాలకృష్ణ భారతీ తమిళకవితలో జానపదగేయ రీతుల్ని ప్రవేశపెట్టారు. గానానుకూలములైన వారి రచనలు పామరులకు సైతం సన్నిహితము లైనాయి. ఒకానొకప్పుడు విద్యాధికుల కోసమే ఉద్దేశించబడిన కవిత వీరి పుణ్యమా అని విద్యావిహీనులకు కూడా ఉపయోగపడింది. ముఖ్యంగా గోపాలకృష్ణ భారతి రచించిన నందనార్ చరిత్ర ప్రచుర ప్రచారం గడించుకుంది.

పండిత ప్రభాకరులూ, పరిశోధక విద్వాంసులూ అయిన మహోమహోపాధ్యాయ డాక్టర్ ఉ.వే. సామినాథయ్యరు అవిరళకృషివల్ల అంతవరకూ అజ్ఞాతంగా పడివున్న సంగకాలపు రచనలు వెలుగులోకి రాగలిగాయి. ప్రాచీన కావ్యాలు ఎన్నిటినో చక్కగా పరిష్కరించి ప్రకటించిన చిరయశస్సు ఆయనదే. మాయూరం వేదనాయకం పిళ్లై అనే ప్రముఖుడు ప్రతాపముదలియార్ చరిత్రం అనే సాంఘిక నవల వ్రాశాడు. ఇది 1876లో అచ్చయింది. కాని ప్రముఖ రచయిత రాజం అయ్యరు రచించిన కమలాంబాళ్ చరిత్రం నిజమైన తొలినవల అని కొందరు విమర్శకుల అభిప్రాయం.

తమళవాఙ్మయంలో నవయుగం సుబ్రహ్మణ్యభారతితో ప్రారంభమయింది. గేయకవిగా, జాతీయకవిగా, అభ్యుదయ రచయితగా, మానవతావాదిగా పేరు పెంపులు గడించిన భారతి సామాన్య పౌరకుడికి సైతం అర్థమయ్యే శైలిలో రచనలు చేసి సంప్రదాయబద్ధమైన తమిళసాహిత్యంలో కొత్తపుంతలు వేశాడు. భారతి ఎంత నవీనుడో అంత ప్రాచీనుడు. ప్రాచీనుడంటే సంప్రదాయ విధేయుడని నా భావం. పాతకొత్తల కలయికను సాధించి తన కవితకు ఒక ప్రత్యేకత సంతరించుకున్నాడు. ఆధునికయుగం వచనయుగమనీ, అందులోనూ వ్యావహారిక భాషకు అత్యంత ప్రాధాన్యం కలదనీ గ్రహించిన తమిళ రచయితలలో ఆయన ఆద్యుడు. కవితలో కూడా వ్యావహారిక భాషాప్రయోగాలను యథోచితంగా ఉపయోగించాడు. వచనకవితలు వెలయించాడు. సులభసుందరమైన భాష, దైనందిన జీవితానికి సంబంధించిన ఇతివృత్తం, డొంకతిరుగుడు లేని శైలి ఆయన రచనలకు పెట్టని భూషణాలు. భాషలోనూ భావంలోనూ నవ్యత ప్రవేశపెట్టాడు. ఆయన ప్రభావం తరువాతి రచయితల మీద స్పష్టంగా గోచరిస్తుంది. ఎన్నో కవితలు, గీతాలు, వ్యాసాలు, కథలు రచించి తమిళసాహిత్య సదనంలో మణిదీపిక వెలిగించిన భారతి 39 సంవత్సరాలే జీవించినా, చరిత్రలో ఆయన చిరంజీవి !

భారతికి పిమ్మట పేర్కొనదగిన కవి భారతిదాసన్. తొలుత భారతిని అనుసరించి ఆయన కవిత చెప్పినా, ఆతర్వాత ఆయన దృక్పథంలో మార్పు వచ్చింది. విప్లవకవిగా సుప్రసిద్ధుడైన ఆయన సమాజంలో పాతుకు పోయిన మూఢాచారాలను తూర్పారపడుతూను, నవసమాజ నిర్మాణం జరగాలని కోరుతూను ఎన్నో కవితలు వెలయించాడు

పెద్దలకే కాక పిల్లలకు కూడా కవితలు సంతరించిన దేశిక వినాయక

పిళ్లై, ప్రముఖ విమర్శకులు టి. కె. సి. (టి.కె. చిదంబరనాథ ముదలియారు), తిరు. వి. క, (కల్యాణసుందరం ముదలియారు), బహుగ్రంథకర్త మరైమలై అడిగళ్, తమిళకథానికా రచనకు మార్గదర్శకుడైన వి. వి. యస్. అయ్యరు, తమిళనాటక పితామహుడైన పి. సంబంధం మొదలియారు, సుప్రసిద్ధ పరిశోధక విద్వాంసులైన ము. రాఘవయ్యంగారు, నవలా రచయితా, పత్రికా సంపాదకుడూ అయిన 'కల్కి' రా. కృష్ణమూర్తి ప్రభృతులు తమ అమూల్య రచనల ద్వారా తమిళవాఙ్మయాన్ని సుసంపన్నం చేశారు. చారిత్రక నవలలు ప్రశస్తమైనవి రచించి కల్కి తరువాతి వారికి మార్గం చూపాడు. కాని మొట్టమొదట అవి పత్రికలలో ధారావాహికంగా వెలువడడంవల్ల పత్రికా పాఠకుల్ని అలరించేందుకు గాను అనవసర సంఘటనలతో కథను పొడిగించటం జరిగింది. ఇటీవలికాలంలో పత్రికలలోనైతేనేమి, పుస్తకరూపంగానైతేనేమి నవలలు చాలా వచ్చాయి. శ్రీయుతులు అఖిలన్, జయకాంతన్, శ్రీమతి రాజంకృష్ణన్ ప్రభృతులు చక్కని నవలలు ఎన్నో వెలయించారు. శ్రీ అఖిలన్ వ్రాసిన చిత్తిరప్పావై నవలకు జ్ఞానపీఠ్ వారి బహుమతి లభించింది.

ఇతర రంగాలలోవలె, విమర్శరంగంలో కూడా పెక్కురచనలు వెలువడ్డాయి. ఆధునిక సాహిత్యాన్ని గురించి విమర్శ అంతగా రాకపోయినప్పటికీ, ప్రాచీన సాహిత్యం గురించి విమర్శగ్రంథాలు ప్రశస్తమైనవి చాలా వచ్చాయి. ముఖ్యంగా తిరుక్కురళ్ గురించి ఎన్నో రచనలు వెలుగు చూశాయి. శ్రీయుతులు టి.పి. మీనాక్షిసుందరం, ము. వరదరాజన్ మొదలైన ప్రసిద్ధ రచయితలు వెలయించిన రచనలు పేర్కొనదగినవి.

ఇతర సాహిత్య ప్రక్రియలలోనూ రచనలెన్నో వెలువడుతున్నాయి. పత్రికలు వాటిని ప్రోత్సహిస్తున్నాయి కూడా. ఆధునిక విజ్ఞానశాస్త్రం, భాషాశాస్త్రం మొదలైనవాటిని గురించి కూడా రచనలు వెలువడ్డాయి. తమిళ విజ్ఞాన సర్వస్వం పది సంపుటాలలో వెలువడింది. అలాగే బాలల విజ్ఞాన సర్వస్వం కూడా పది సంపుటాలలో వెలువడింది. ఈ సందర్భంగా మదరాసు విశ్వవిద్యాలయం వారు ప్రచురించిన టమిల్ లెక్సికన్ (తమిళ బృహన్నిఘంటువు) సంభావించదగింది. ఈ ప్రశస్త పదకోశాన్ని తయారు చేసేందుకు 23 సంవత్సరాలు పట్టింది.

మొత్తంమీద తమిళవాఙ్మయం బహుప్రాచీనమయిందనీ సుసంపన్నమయిందనీ నిస్సంశయంగా పేర్కొనవచ్చు. ముఖ్యంగా సంగకాలపు రచనలవల్ల తమిళవాఙ్మయానికి ఒక విశిష్టత కలిగింది.

# తమిళ సామెతలు

సామెతలేని మాటా, ఆమెత లేని యిల్లూ నిజానికి వాసనలేని పువ్వులు. సామెత ఎరవు సొమ్ము కాదు కాబట్టి, అది భాషకు పెట్టని భూషణం. సామెతలు వాడడంవల్ల అందచందాలతోపాటు అర్థగాంభీర్యమూ సమకూరుతుంది భాషకు. అయిదారు వాక్యాలు తెలియజేసే భావాన్ని ఒక్క వాక్యం సామెత మనస్సుకి హత్తుకునేలా వివరిస్తుంది. అల్పాక్షరాల సహాయంతో అనల్పార్థాన్ని సూచించేది ఉత్తమ కవిత అయితే, కొద్ది మాటల్లో కొండంత భావాన్ని తెలియజేస్తుంది సామెత, ఇదే దీని విశిష్టత!

సామెతలు సాధారణంగా సంగ్రహంగా హృదయ రంజకంగా ఉంటాయి. కొన్ని హితోక్తులుగా వినిపిస్తే, మరికొన్ని మందలించేవిగా కనిపిస్తాయి. ఎలా ఉన్నా మాటి మాటికి మనస్సులో మెలిగే స్వభావం కలవి సామెతలు.

అనుభవసారాన్ని చమత్కార పూర్వకంగా తెలియజేసే సామెతను నిర్వచించడం అంత తేలిక పనికాదు. ఎలా చెప్పినా, ఏదో వెలితి కనిపించడం సహజం. అయినా, ఇలా చెప్పవచ్చునేమో! సంగ్రహంగా జనరంజకంగా ఉండే సరసోక్తికి నామాంతరం సామెత.

సామెత శబ్దవ్యుత్పత్తిని గురించి పండిత లోకంలో అభిప్రాయభేదాలు లేకపోలేదు. సామ్యత అనేది తెలుగులో సామెతగా మారి వాడుకలోకి వచ్చిందని చిలుకూరి నారాయణరావుగారు విశ్వసించారు. పోల్చి చెప్పడమే సామెతలోని ప్రధానాంశం కనక సాటువ, చాటవ అనే పేర్లు వ్యాప్తిలోకి వచ్చి వుండవచ్చునని కొందరి అభిప్రాయం. సామిత, సాటువ, సాటవ, చాటువ, చాటవ, శాస్త్రం మొదలైనవి సామెతకు పర్యాయ పదాలుగా ప్రచారంలో ఉన్నాయి.

తెలుగు తోబుట్టు భాషలు కూడా సామెతల పుట్టలు. తమిళంలో సామెతను పళమొళి, మూదురై, ముదుసొల్ అంటారు. పురాణోక్తి అని వీటి అర్థం. నాణ్ణుడి (నాడునుడి), గాదె (గాథ) అని కన్నడిగుల వ్యవహారం. నాణ్ణుడిని లోకోక్తి అనవచ్చు. ఇక మలయాళంలో పళంచొల్లు, పళమొళి అంటారు; పురా

ణోక్తి అని అర్థం. ప్రాచీనోక్తి లేక లోకోక్తి అనే అర్థాలలో ఈ భాషలలో సామెత వ్యవహృతం కావడంవల్ల, తెలుగు సామెతకు కూడా ఈ అర్థాలు చెప్పుకోవచ్చు.

ఈషద్భేదాలు కానవచ్చినా, మన సంస్కృతి మొత్తంమీద ఒకటి కావడం వల్ల, తెలుగు తమిళం మొదలైన భాషలలోని సామెతలలో సామ్యత కనిపించడంలో ఆశ్చర్యం లేదు. కనక ఏ భాషలో ఉన్నా, కొన్ని సామెతలు ఒకే విధంగా వినిపిస్తాయి. నిండుకుండ తొణకదు అనే తెలుగు సామెత కన్నడంలో తుంబిదకుడ తుళుకువదిల్ల అనీ తమిళంలో నిరైకుడం తళుంబాదు అనీ వ్యవహృతమవుతున్నది. వాక్య నిర్మాణంలోనే కాక భావంలోనూ ఇవి దగ్గరి చుట్టాలుగా ఉన్నాయి.

ఇక కొన్ని తమిళ సామెతల్ని పరిశీలిద్దాము.

కొన్ని సామెతలలో రుచిరార్థ సూక్తిమత్వం అందాలు దిద్దుకుంది. అబద్ధం చెప్పిన నోటికి అన్నం పుట్టదు అనేది యిందుకు చక్కని ఉదాహరణ కొన్ని స్వభావోక్తులుగా వినిపిస్తాయి. మరికొన్ని హాస్యరస ప్రధానములు. ఆమె పేరు కేశసుందరి, తల చూడబోతే బోడి—కడుపుబ్బ నవ్వించే కమ్మని సామెత. దైనందిన జీవితంలో ఇటువంటి వారిని మనం చూస్తూనే వుంటాము. అందు వల్లనే సామెతలు వడబోసిన జీవిత సత్యాలుగా వెలుగొందుతున్నాయి.

నిత్యజీవితంలోని వెలుగు నీడల్ని మనం సామెతలలోనూ చూడవచ్చు. వివిధ వృత్తుల వాళ్ళమీద విసుర్లు, పేదల కష్టాలు, అధికారుల దౌష్ట్యం, అత్తా కోడళ్ల ప్రసక్తి, ప్రకృతి విశేషాలు, జ్యోతిష వాస్తుశాస్త్రాలకు సంబంధించిన అంశాలు, వ్యావసాయిక విషయాలు మొదలైనవి సామెతలలో ప్రముఖంగా కనిపిస్తాయి.

తమిళజన జీవనాన్ని తమిళుల ఆచారవ్యవహారాలను విశ్వాసాలను అభివ్యక్తం చేసే సామెతలు చాలా ఉన్నాయి తై పిఱన్దాల్ వళి పిఱక్కుం (తైనెల పుట్టితే దోవ పుడుతుంది-ఏర్పడుతుంది) అనేది ఒక ప్రసిద్ధమైన తమిళ సామెత. తై నెల (పుష్యమాసం) తమిళుల దృష్టిలో చాలా శుభప్రదమయింది. ఎప్పుడెప్పుడు తైనెల పుడుతుందా అని తమిళులు ఎదురుతెన్నులు చూస్తూవుంటారు. అంతవరకూ

వాయిదా వేసిన శుభకార్యాలు తైనెలనుంచీ నిర్వర్తించబడతాయి. చివరికి ఇల్లు మార్చాలన్నా, అందుకు తై నెలే శుభప్రదమయింది. తమిళుల సాంఘిక జీవితంలో అంత ప్రాధాన్యం వహించిన తై నెల తెలుగువారికి శూన్యమాసం; అప్పుడు తెలుగువారు శుభకార్యాలు తలపెట్టరు. వారి దృష్టిలో ఆ తరువాతి నెల అయిన మాఘమాసం మంచిది.

శ్రీరంగంలో పుట్టినవాడికి తిరువాయ్ మొళి నేర్పాలా? అని యింకో సామెత. శ్రీరంగం సుప్రసిద్ధ విష్ణుక్షేత్రం. తిరువాయ్‌మొళి వైష్ణవులకు పారాయణ గ్రంథం. శ్రీరంగంలాంటి ప్రసిద్ధక్షేత్రంలో పుట్టిపెరిగినవాడికి, అభిరుచి ఉన్నా లేకున్నా, తిరువాయ్‌మొళితో సహజంగానే పరిచయం ఏర్పడుతుందని తమిళుల విశ్వాసం. అలాగే, సోమ శనివారాలలో వెళ్ళాలి దక్షిణానికి—అనేది తమిళుల విశ్వాసాన్ని జీర్ణించుకున్న మరో సామెత. ఈ దృష్టితో పరిశీలిస్తే, సామెతల పరిశీలన ఎంత అవసరమో స్పష్ట మవుతుంది.

ఇక తెలుగు-తమిళములకు దగ్గరి చుట్టరికం ఉండడంవల్ల, ఈ భాషలలోని కొన్ని సామెతలమధ్య కూడా ఆ చుట్టరికం నెలకొన్న దనడం చర్విత చర్వణం.

అత్త బద్దలు కొడితే మట్టికుండ, కోడలు బద్దలుకొడితే బంగారు కుండ-అని తమిళులు వ్యవహారం. అత్తకొట్టిన కుండ ఆడుగొటికుండ, కోడలు కొట్టిన కుండ కొత్త కుండ-అని తెలుగువారి వ్యవహారం. తమిళులు 'అయిదులో వంగనిది యాభైలో వంగుతుందా?' అంటారు. 'మొక్కై అయి వంగనిది మ్రానై వంగునా?' ఇది తెలుగువారి సామెత. అభ్యాసం కూసువిద్య అని తెలుగువారంటే, అభ్యసించిన విద్య అంతరించదు అని తమిళులు చెపుతారు. ఇలా ఎన్నిటినో చూపవచ్చు.

ఢిల్లీకి రాజైనా తల్లికి కొడుకే-అనే తెలుగు సామెత తమిళంలోనూ చోటు చేసుకుంది. ఢిలీకి పాదుషా అయినా తల్లికి బిడ్డేగదా అని తమిళుల వ్యవహారం. యారాల కెట్టాన్, నోరాల కెట్టాన్ (ఎవరివల్ల చెడ్డాడు, నోటివల్ల చెడ్డాడు) అనే సామెతలో నోరు అనే తెలుగుమాట ప్రయుక్తం కావడం గమనించదగింది. అలాగే కొన్ని తమిళసామెతలు తెలుగులోకి వచ్చివుంటాయి. ఏమిరా కంబరామాయణం మాట్లాడుతున్నావు? అని చిత్తూరుజిల్లావారు అంటారు. దీర్ఘవర్ణనలు చేస్తావేమిట్రా అని పరిహాస పూర్వకంగా చెప్పేసామెత యిది. దీర్ఘవర్ణనలకు పెట్టింది పేరు కంబకవి వెలయించిన రామాయణం. దైర్ఘ్యాన్ని అభివర్ణించేటప్పుడు తమిళులు కంబరామాయణాన్ని పేర్కొంటారు.

తమిళసామెతలు, వాటిలోని అందచందాలను తెలుగువారికి తెలియజేసేందుకు ఈ వ్యాసంలో ప్రయత్నించబడింది. సాధ్యమైనంతవరకూ తమిళసామెతల్ని యథాతథంగా తెలుగు చెయ్యడం జరిగింది, అయినా పఠనయోగ్యతకు ప్రాధాన్యం ఇవ్వబడింది.



అంద ముండి యేం లాభం,
అదృష్టం కావాలి గాని,

అందానికి దాల్చిన ఆభరణం
ఆపదలో తోడవుతుంది.

అతడు లేకుంటే అణువైనా జరగదు (భగవంతుడు లేకుంటే అని అర్థం)

అత్తబద్దలు కొడితే మట్టికుండ
కోడలు బద్దలుకొడితే బంగారుకుండ.

అత్త మెచ్చిన కోడలూ లేదు
కోడలు మెచ్చిన అత్తా లేదు.

అదిలించేవాడు లేకపోతే
అతను చండప్రచండుడు,

అధికారీ తలారీ ఒకటైతే
అనుకున్నట్టు దొంగిలించవచ్చు.

అనుగ్రహం లేనివారికి ఆ లోకం లేదు
అర్థం లేనివారికి ఈ లోకం లేదు. (అర్థం=ధనం)

అబద్ధం చెప్పిన నోటికి అన్నం పుట్టదు.

అభ్యసించిన విద్య అంతరించదు.

అమావాస్య భోజనం ఎప్పుడూ దొరుకుతుందా ?

అయితే బోడి, లేకుంటే పిలక.

అయిదులో వంగనిది యాభైలో వంగుతుందా ?

అరకాసుకి కోల్పోయిన శీలం
అంతులేని ధనమిచ్చినా తిరిగి రాదు.

అరవై అడుగుల గడ నెక్కి ఆడినా
అతను కిందికి దిగే పైసలు తీసుకోవాలి,

అల యెప్పుడు తగ్గేది
తల యెప్పుడు ముంచేది.

అలలున్నప్పుడే స్నానం చెయ్యి
గాలి ఉన్నప్పుడే తూర్పార బట్టు.

అలల సముద్రమైనా దాటి అర్థం ఆర్జించాలి,

అలకాపురికి రాజయినా
అమితంగా ఖర్చు చెయ్యకూడదు.

అలకాపురిని కొల్లగొట్టినా
అదృష్టహీనుడి కేమీ రాదు.

అల్ప పాండిత్యం అనర్థానికి కారణం.

## ఆ

ఆకులున్న చెట్టుకి నీడ ఉంటుంది.
పిల్ల తల్లికి పాలుంటాయి.

ఆడేకాలూ పాడేనోరూ ఊరికే వుండదు.

ఆమె పేరు కేశసుందరి
తల చూడబోతే బోడి,

ఆపదవేళలో పాపం లేదు.

ఆలస్యం దుఃఖ కారణం.

ఆవాలకోసం వెతుకుతారు, గుమ్మడికోసం వెతకరు.

ఆవు ముసలిదైనా పాల రుచి తగ్గుతుందా ?

ఆవు మేత లేక చెడింది
పైరు చూడకుండా చెడింది.

ఆశలు అణుచుకోకపోతే
ఆశే అణిచి వేస్తుంది.

## ఇ

ఇంటి సంపద ఆవులు
తోట సంపద మునగ.

ఇరుసు లేకుంటే జరగదు రథం.

ఇల్లు కట్టు, అడవిని నరుకు.

ఇష్టం లేని భార్య చెయ్యి తగిలినా తప్పే
కాలు తగిలినా తప్పే.

ఈ ఒడ్డుకి ఆ ఒడ్డు పచ్చన.

## ఉ

ఉడకని అన్నానికి ఇద్దరు అతిథులు.

ఉడుము పోతే పోయింది, చెయ్యి వస్తే చాలు.

ఉత్తరం నల్లబడితే వాన కురుస్తుంది. (ఉత్తర దిక్కు)

ఉత్తరం చూసిన మిద్దెయింటికన్నా
దక్షిణం చూసిన మట్టికొంప మిన్న.

ఉత్తరాషాఢలో ఒక పిల్లవాడు
ఊరికి దగ్గర్లో పొలమూను,
ఉన్నంతవరకూ నిడుపాటి గోడ.
విరిగిపడితే మొండి గోడ.

ఉన్నది పోదు, లేనిది రాదు.

ఉన్నవూళ్లో అమ్ముడుపోనియెద్దు
పొరుగూళ్లో అమ్ముడు పోతుందా ?

## ఎ

ఎగతాళికి ధర లేదు
కథకేమో కాళ్ళు లేవు.

ఎలుకబోనైనా విడిగానే ఉండాలి.

ఎలుక ఎంత యేడ్చినా, పిల్లి వదిలిపెడుతుందా ?

ఎలుకలున్నచోట పామూ ఉంటుంది,

ఎవరివల్ల చెడ్డాడు, నోటివల్ల చెడ్డాడు.
ఏడ్చినా ఆమేగా బిడ్డని కనాలి.
ఏడ్చే మగవాణ్ణీ నవ్వే ఆడదాన్నీ నమ్మరాదు.
ఏనుగుకి దెబ్బలు తగులుతాయి
ఏనుగేమో తర్వాత, గంట చప్పుడెమో ముందు
కీడువచ్చేది తర్వాత, బుద్ధి చేడేది ముందు.
ఏనుగుకి కుండకి సరి

## ఓ

ఓర్పుగలవారు భూమి నేలుతారు.

## క

కంచెకు వేసిన ముళ్లు
కాళ్లకు గుచ్చుకున్నాయట.
కంసాలికి భయపడేనా
కాలసర్పం ధరించాడు శివుడు ?
కంసాలీ సెట్టీ ఒకటయితే
కాంచనం యిచ్చినవాడి నోట మట్టే.
కుంటివాడు పుట్టతేనెను కోరినట్లు.
కుండలోకి వస్తే గరిటెలోకి వస్తుంది.
కుంభి కూటికేడుస్తోంది (కుంభి-ఏనుగు)
కొప్పు పూల కేడుస్తోంది.
కదులుతూ తింటుంది గజం
కదలకుండా తింటుంది గృహం.
కనకం మోగదు, కంచు మోగుతుంది,
కన్నతండ్రి గొప్పతనం కన్ను మూస్తే తెలుస్తుంది.
కన్నతల్లి ఆకలితో మాడుతుంటే
బ్రాహ్మణార్థాలు చేస్తున్నాడట.
కత్తిర పుచ్చుకున్నవాడల్లా వేటగాడా!

కలకాలం కష్టాలయితే బతికే దెప్పుడు?

కలగన్న బియ్యం అవుతుందా అన్నం?

కాలుతున్న యింట్లో దక్కినవే లాభం.

కాల్చిన చట్టికేం తెలుస్తుంది
కమ్మని అప్పాల రుచి?

కుక్కను చూచినప్పుడు రాయి లేదు
రాయి చూచినప్పుడు కుక్క లేదు.

కుక్కకి పాటూ లేదు
కూర్చునే తీరికా లేదు.

కుక్కలున్నచోట పోట్లాట లుంటాయి.

కుప్ప పెరుగుతుంది, గోపురం ఒరుగుతుంది.

కుమ్మరికి ఆరు నెలలు
బెత్తమున్నవాడికి అరగడియ.

కురిసీ చెరిచింది, ఎండీ చెరిచింది.

కూటికి మామిడికాయ
కోతికి కొబ్బరికాయ.

కూలి తగ్గించకు, పని చెడగొట్టకు.

కూలిలా శ్రమించాలి, రాజులా భుజించాలి.

కొడుకు చచ్చినా చావనీ
కోడలి అహం తగ్గితే చాలు.

## గ

గంధం చెక్క అరిగినా వాసన తరగదు.

గడకట్టె ఆడేవాడు కింద పడ్డా
అదీ ఒక విద్యే అంటాడు.

గాడిదకేం తెలుసు కర్పూరం వాసన ?

గుడ్డివాడికి కావలసింది కర్ర.

గుడ్డుగా వున్నప్పుడు పామునీ
పిల్లగా వున్నప్పుడు పులినీ చంపాలి.

గురువు మాట మరిచినవాడు
సిరులు పోయి భ్రష్టు డవుతాడు.

గురువు లేకుంటే విద్య లేదు
పెట్టుబడి లేకుంటే సంపాదన లేదు.

గోటితో గిల్లవలసింది
గొడ్డలితో నరుకతున్నాడు.

గోడ వున్నప్పుడే గీయవచ్చు బొమ్మ.

## చ

చచ్చేంతవరకూ వైద్యుడు విడిచిపెట్టడు
చచ్చినా పురోహితుడు విడిచిపెట్టడు.

చావదలచిన వాడికి సముద్రమూ మోకాలి లోతు.

చాలా కర్రలు చూసిన వడ్రంగి ఒక్కటీ చెక్కడు.

చిన్న నీటిబొట్లు పెద్ద వెల్లువ.

చిన్నపామైనా పెద్ద కర్ర కావాలి.

చిన్నపిల్లలు లేని యిల్లు యిల్లు కాదు
జీలకర్ర లేని కూర కూర కాదు.

చిన్నరవ్వ పెద్ద నిప్పు.

చిన్నప్పటి చదువు శిలమీది అక్షరం.

చిల్లర అప్పులు చేటు తెస్తాయి.

చెడుతుంది బుద్ధి మొదట
చేటు వస్తుంది పిదప.

చెడినా సెట్టి సెట్టే
చినిగినా పట్టు పట్టే
చెడితే పట్టణం చేరు.

చెప్పింది మరల చెబుతుంది చిలుక.

చెప్పేడుమాటలు వింటే చేటు కలుగుతుంది.

చెప్పేవాడికి నోటిమాట
చేసేవాడికి మోతబరువు.

చెబితేనే వెళ్ళాలి మంచికి
చెప్పకుండా వెళ్ళాలి చెడుకి.

చెలిమి చేసేముందు ఆలోచించు
ఆ తర్వాత మరేమీ ఆలోచించకు.

చెల్లెలు కొడుకు తనకొడుకైతే
చెయ్యాలా వేరే తపస్సు ?

చేతిపుండుకి అద్దం కావాలా ?

చేతికందింది నోటి కందలేదు.

చేరరాని చోట చేరితే చేటు.

## జ

జన్మవల్లనా కర్మ వల్లనా జాతి?
జన్మతో పుట్టింది చెప్పుతో కొట్టినా పోదు.

జాతి జాతితోనే చేరుతుంది.

జ్యోతి కైనా సరే ఊతకర్ర కావాలి.

## టె

టెంకాయ దొంగిలించి గణపతికి కొట్టినట్టు.

## ఢ

ఢిల్లీకి పాదుషా అయినా
తల్లికి బిడ్డే గదా.

తండ్రి దోవనే తనయుడు.

తిండికి చేటు, భూమికి భారం.

తగిలిన కాలికే తగులుతుంది, చెడిన వంశమే చెడుతుంది.

తన తప్పు తనకు తెలీదు.

తన నోరే కప్పకు వైరి.

తన నోటి వల్లే తాను చెడ్డాడు.

తన కంటూ ఒకటుంటే
తరుణానికి ఆదుకుంటుంది.

తనకు తెలీని అబద్ధం లేదు
తల్లికి తెలీని చూలూ లేదు.

తనవాళ్ళు తన్ను కాపాడతారు
కంచె యేమో పొలం కాపాడుతుంది.

తపస్సుకి ఒక్కడు, చదువుకి ఇద్దరు.

తల ఉంటే తోక ఆడుతుందా ?

తలరాతను తంత్రంతో జయించవచ్చా ?

తలను దాటి పారే వెల్లువ
జానెడైతే యేం. మూరెడైతే యేం.

తల్లి మనస్సు దూది, తండ్రి మనస్సు రాయి.

తల్లిని చూసి పిల్ల నడుగు
పాలను చూసి ఆవు నడుగు.

తల్లీ పిల్లలు ఒక్కరైనా
పొట్టా నోరూ ఒకటేనా ?

తవుడు కోసం వచ్చిన చేతులే
పసిడి కోసమూ వస్తాయి.

తాగను తాగను పాలు పుల్లన
చేరను చేరను స్నేహం పల్చన.

తాటి చెట్టు నీడను పాలు
తాగినా కల్లనుకుంటారు.

తాటి చెట్టు నీడ నీడేనా
తగని వారి చెలిమి చెలిమేనా ?

తాను కదలకపోయినా
తన ఒళ్ళు కదులుతుంది.

తాను దొంగ, ఇతరుల్ని నమ్మడు.

తా నొకటి తలిస్తే, దైవ మొకటి తలిచింది.

తిట్టే వారికి సుఖమూ లేదు
ఓర్చుకునే వారికి దుఃఖమూ లేదు.

తీరని కోపం పోరుగా ముగుస్తుంది.

తొడ గిల్లి, తొట్టి ఊపడమా ?

తెమ్మెర కనక ముదిరితే
దెయ్యపు గాలిగా మారుతుంది.

తేనెకు ఈగల్ని పట్టివ్వాలా ?

తేలుకి కొండెంలో విషం.
వెలయాలికి నిలువునా విషం,

తోటమాలి జీవితం గాలి దెబ్బతో సరి.

తై నేల (పుష్యం) పుడితే, దోవ పుడుతుంది,

## ద

దొంగ కెప్పుడూ దొంగ బుద్ధే.

దొంగను పట్టేందుకు దొంగే కావాలి.

దాక్షిణ్యం ధన నాశనం.

దానంగా పుచ్చుకున్న ఆవుని మరీ పరీక్షించకు.

దిక్కులేని వాడికి దేవుడే తోడు.

దెబ్బమీద దెబ్బ కొడితే
సన్నెకల్లు కూడా జరుగుతుంది.

దేవుడు వరమిచ్చినా
దరికి రానీడు పూజారి.

దుష్టుణ్ని చూస్తే దూరంగా తొలగు.

దూషించి చెడిన వారూ లేరు
భూషించి చెడని వారూ లేరు.
దూరంగా వుంటే బారెడు చుట్టం
దగ్గరకొస్తే భగ్గున మంట.
దుఃఖం మొదట, సుఖం పిదప.

## న

నక్కకి కొండాటం, పీతకి సంకటం,
నడక తెలీని వాడికి నడి వీధి ముళ్ళదోవ.
నడిస్తే ఊరంతా మిత్రులు
పడుకుంటే చాప కూడా శత్రువు.
నత్త కడుపులోనూ ముత్యం పుడుతుంది.
నలభైలో కుక్క గుణం.
నలుగురూ చేరితే సభ.
నాలుక కదిలితే నాడు కదులుతుంది.
నాలుకలో ఉన్నాయి లాభ నష్టాలు
నాలుగు నదులు కలిస్తే పాలారు.
నిప్పంటుకుని గడ్డం కాలుతుంటే
నిప్పిస్తావా నా చుట్టకు అన్నాడట!
నిప్పు పందిట్లో మైనపు బొమ్మ కులుకుతుందా?
నిప్పు లేకుంటే నిడుపాటి పొగ లేస్తుందా?
నిద్రపోతు నక్కకు మాంసం పుట్టదు.
నిద్రపోని వాడికి సుఖం లేదు.
నీటిమీద నిలుస్తాయా అక్షరాలు?
నీటిలో పుట్టిన ఉప్పు నీటిలోనే కరగాలి.
నీళ్ళు వేడిగా ఉన్నా నిప్పుని ఆర్పుతాయి.
నోరున్న వాడు బతుకుతాడు,

## ప

పంచదార అంటే పుడుతుందా తీపి.

పంది వెనకాల వెళ్ళే
పంది పిల్లా అశుద్ధం తింటుంది.

పందికి పెక్కు పిల్లలు
సింహానికి ఒక్క పిల్ల.

పగటిపూట పక్కలు చూసి మాట్లాడు
రాత్రిపూట అవి చూసీ మాట్లాడకు.

పగవారి చెలిమి పొగతోడి నిప్పు.

పడమట వాన కురిస్తే
తూర్పున వరద వస్తుంది.

పని దొంగకు పిల్ల ఒక వంక.

పని చెయ్యని వాణ్ణి చేతిమీద కొట్టు
పని చేసేవాణ్ణి కాలిమీద కొట్టు.

పసిడి నేలమీద, తవుడు కుండలోను.

పలకకపోతే పుట్టదు
కొలవకపోతే తగ్గదు.

ప్రయత్నించే వారికి పరాభవం లేదు.

పాలు చూసి ఆవు కొను.

పిల్ల పుట్టాకనే పేరు పెట్టాలి.

పుట్టినవన్నీ గిట్టక తప్పదు.

పురి విచ్చిన తాడూ, చిల్లుల బొక్కెనా.

పులి దాక్కోవడం పైకి దూకడానికి.

పులికి పుట్టింది పిల్లిగా మారుతుందా?

పువ్వు విరిసి చెడింది, నోరు తెరిచి చెడింది.

పెక్కు రోజుల దొంగ
ఒక్క రోజు పట్టుబడతాడు.

పెరగడంతోపాటు విరుగుడూ ఉంటుంది,
పెరుమాళ్లు ఉన్నంతవరకూ
తిరునాళ్లూ ఉంటాయి.
పేరులేని సన్నిధి పాడు
సంతులేని సంపద పాడు.
పొరుగూరి వాడికి నదిగట్టు భయం
ఉన్న వూరి వాడికి చెట్టుబోదె భయం.
పైకి చూస్తే పిల్లి, మీది కొస్తే పులి.
పైపైకి ఎగిరినా పిచ్చుక గద్దవుతుందా ?

## బ

బఱ్ఱెను కొనేటప్పుడు నెయ్యి ధర అడగకు.
బిడ్డ పుట్టకముందే పేరు పెట్టకు.
బలవంతుడికి గడ్డిపరకా ఆయుధమే.
బుద్ధి చెడిన రాజుకి మతి చెడిన మంత్రి.
బురదలో చిక్కుకున్న యేనుగుని
పొడుస్తుంది కాకి సైతం.

## మ

మంచి నీటినీ కన్న తల్లినీ ఎంచకు నేరం.
మంచి పిల్లకు ఒక మాట
మంచి ఆవుకి ఒక దెబ్బ.
మంచి రోజు చేసేది
మంచి వారు చెయ్యలేరు.
మంచివారు చెడ్డా మంచివారే.
ముంతెడు బియ్యమైనా మూడు కట్టెలు కావాలి.
మనస్సులోని అందం ముఖంలో తెలుస్తుంది.
మన్నన లేని యింట్లో దున్నపోతూ వుండదు.

మా యింటి దీపం గదా అని
ముద్దు పెట్టుకోవచ్చా?
మాట వినని సంతానం వల్ల మచ్చ వస్తుంది కులానికి.
మాటకారిని గెలవడం మహా కష్టం.
మాట తప్పిన వాడు మార్గం తప్పిన వాడు.
మాత తినిపించని బువ్వ మామిడి తినిపిస్తుంది.
మామిడి పండితే చిలకకు
వేప పండితే కాకికి.
మితి తప్పితే అమృతమూ విష మవుతుంది.
ముదలియారు డంబం ఆముదానికి చేటు.
ముప్పొద్దులా స్నానం చేసినా
ఎప్పటికైనా కాకి కొంగవుతుందా?
ముళ్ళమీద చీర ఆరేస్తే మెల్ల మెల్లగా తీసుకోవాలి.
మూర్ఖుడూ మొసలీ పట్టుకుంది విడవరు.
మెరిసేదంతా మెరుగు బంగారం కాదు.
మేక నివ్వని గొల్లవాడు మరి ఆవు నిస్తాడా?
మేరు పర్వతం కాకి బంగారు రంగే.
మొండి చేత్తో మూర వేసినట్టు.
మోహం ముప్పయి రోజులు
ఆశ అరవై రోజులు.

## య

యముడికి తెలియని జీవీ
కొంగకు తెలియని చెరువూ లేదు.

## ర

రాజు అప్పుడే శిక్షిస్తే, దేవుడు ఆ తర్వాత శిక్షిస్తాడు.
రాజులేని ఊరు, ఇరుసులేని తేరు.

రాజుగారి కూతురైనా
చేసుకున్న వాడికి భార్యే.
రాసిన వాడు పత్రం పాడు చేశాడు
చదివిన వాడు కవిత పాడు చేశాడు.
రాహు దశబో బతికిన వాడూ
రాజ దశలో చెడినవాడూ లేడు,
రోగం లేని బతుకే లోటులేని సంపద.
రోట్లో చిక్కుకున్నది
రోకలిని తప్పించుకుంటుందా ?

## ల

లేగ భయ మెరగదు.
లేమి ఒకప్పుడు, కలిమి ఒకప్పుడు.
లో తెరగకుండా కాలు పెట్టకు.

## వ

వంగిన ముల్లు బతుకుతుంది.
వడ్డీ ఆశ అసలుకే నష్టం.
వరి పైరుకి పారే నీరు
గరిక పోచలకూ పారుతుంది.
వాన లేకుంటే ఏమీ లేదు,
వ్యాధికి మందుంది, విధికి మందుందా ?
విధి ఎలాగో, మతి అలాగు.
విన్నదంతా నమ్మకు, నమ్మిన దంతా చెప్పకు.
వినే మాటల్లో సగమే నిజం,
వెడల్పుగా దున్నడం కంటె లోతుగా దున్నాలి.
వెళ్ళకుండా బంధుత్వం చెడింది
అడక్కుండా అప్పు చెడింది.

వెళ్ళిన చోటల్లా పేరు తెచ్చేది విద్య.
వేడి తగిలిన పిల్లి వంటింటి వైపు రాదు.

## శ

శరీర మున్నంత దాకా
సముద్రాన్ని మించిన చీకు చింతలు.
శాస్త్రం అబద్ధ మనుకుంటే
చక్కగా చూడు గ్రహణం.
శాస్త్రం చూడని యిల్లు సముద్రం
చూసిన యిల్లేమో దరిద్రం.
శివుడా అని కూర్చున్నా
చేసిన పాపం పోదు.

## స

సమ్రాట్టూ కూలీ స్వర్గంలో ఒకటే.
సముద్రం కన్నా సహనం పెద్ద.
సర్పమంటే సైనికులూ వణుకుతారు.
సాక్షి కాళ్ళమీద పడేకంటె
వాది కాళ్ళమీద పడడం మేలు.
సుఖమూ దుఃఖమూ తిరిగే చక్రం.
సెట్టిగారి బ్రతుకు గిట్టిన తర్వాత తెలుస్తుంది,
సెట్టి డాబో సరుకు డాబో.
సోదరు డున్నవాడు సైన్యమంటే భయపడడు.
సోదరులు పనికొస్తారా దెబ్బలు పనికొచ్చినట్టు.
సోమ శనివారాలలో వెళ్ళాలి దక్షిణానికి.
శ్రీరంగంలో పుట్టిన వాడికి
తిరువాయ్‌మొళి నేర్పాలా ?

భాషా విషయకంగానే కాక చారిత్రకంగా సాంస్కృతికంగా కూడా తెలుగు వారూ తమిళులూ సన్నిహితులు. ఈ సాన్నిహిత్యం వల్ల, తెలుగు తమిళ సామెతల్ని అలవోకగా పరిశీలించినా సాదృశ్యాలు ఎన్నో తెలియ వస్తాయి కొన్ని ఆచార వ్యవహారాలలో భేదం ఉండడం వల్ల, సాదృశ్యాలతోపాటు భేదాలూ కానవస్తాయి. అయినా మొత్తం మీద, తమిళ తెలుగు సామెతలు ఒకే విధంగా కనిపిస్తాయి, ఈ సామెతల్ని తులనాత్మక దృష్టితో పరిశీలిస్తే, తెలుగు వారికీ తమిళులకీ మధ్యగల సాంస్కృతిక సంబంధం దృఢతర మవుతుంది. ఇది నిస్సందేహం.

'వేద సుళ్ళాదరూ, గాదె సుళ్ళాగదు' అనే రుచికరమైన సామెత ఒకటి కన్నడంలో ఉంది, వేదమైనా ఒకవేళ అబద్ధం కావచ్చు, సామెత మాత్రం అబద్ధం కాదని దీని అర్థం. సామెతకు గల విశిష్టతను ఈ కన్నడ సామెత ప్రవ్యక్తం చేస్తోంది.

# తెలుగు తమిళ సాహిత్యాల సంబంధాలు

'నిన్న మొన్నటి చుట్టరికం కాదిది
ఎన్నో యేండ్లుగ పెనవేసుకున్నదిది. 1

అని తమిళ నవయుగ ప్రవక్త సుబ్రహ్మణ్య భారతి కన్నయ్య గీతంలో ప్రేయసి కన్నమ్మను గురించి చెప్పిన పై పాదం తెలుగు తమిళ సాహిత్యాల మధ్య ఉన్న సంబంధానికి అక్షరాలా వర్తిస్తుంది. ఈ తోబుట్టు భాషల మధ్య సాహిత్యపరంగా నెలకొన్న సంబంధం బహు ప్రశస్తమైనదీ, బహు ప్రాచీనమైనదీను.

తెలుగు సాహిత్యానికి శ్రీకారం చుట్టిన నన్నయ పేరు చెన్నైన దేశ్యం. మంచితవానికి తమిళంలో నామాంతరాలు నన్మై, నన్నర్ మొదలైనవి. మంచి అని అర్థమిచ్చేనల్ నన్మైకి మూలం. తమిళ సాహిత్యంలో అతి ప్రాచీనమైన యుగంగా భావించబడుతున్న సంగయుగంలో నన్నన్ అనే ఒక సామంతరాజు వర్ధిల్లినట్లు తెలియ వస్తున్నది. 2 కాగా, నన్నయ్య అంటే మంచివాడని అర్థం చెప్పుకోవాలి.

ఎంత సంస్కృత విద్వాంసుడైనా, నన్నయ్య భాషలో చక్కని చిక్కనీ దేశ్యాలు చుట్టనచూరలు. ఆయన కవితను అలవోకగా పరిశీలించినా, ఈ సంగతి అవగత మవుతుంది.

బకాసుర వధ సందర్భంగా నన్నయ్య—

'బాలకుం డొక కొండుక కోల చేత
బట్టికొని యేను రక్కసు గిట్టి చంపి
చులుక వత్తుం మీ రేడ్వగా వలవ దనుచు
గలయ నూరార్చె దన తొక్కు బలుకు లొప్ప' 3

అని పేర్కొన్నాడు. ఈ చిన్ని పద్యం దేశ్య శబ్దమయం. వాడుక తెలుగులో చాలావరకు లుప్తమై పోయినా, తమిళంలో సజీవంగా ఉన్న కోల (కఱ్ఱ), కిట్టు (సమీపించు) మొదలైన దేశ్యాలు తెలుగు తమిళ భాషలకు ఉమ్మడి సొత్తు. కోలాటం వంటి కొన్ని మాటలలో కోల శబ్దం విలిచి వుండడం గమనించ దగింది.

ఇలా ఆనాటి మాటలనే కాక, నన్నయ తన రచనలో ఆనాటి సాహిత్య సంప్రదాయాలు కొన్నిటిని భద్రపరిచాడు.

తమిళ రాజత్రయంలో ప్రముఖులైన పాండ్య భూపతుల కాలంలో పండిత పరిషత్తులు మూడు వెలుగులోకి వచ్చాయి వీటిని తలైచ్చంగం, ఇడైచ్చగం, కడైచ్చంగం అని వ్యవహరిస్తారు. పండిత పరిషత్తు అయిన సంగం తమిళ సాహిత్యాభివృద్ధికి రాచబాట వేసింది. ఈ పరిషత్తుల వంటి సభలు చాళుక్య నృపుల కాలంలో, ముఖ్యంగా రాజకులైకభూషణుడు రాజరాజనరేంద్రుని కాలంలో వెలుగులోకి వచ్చి వుండవచ్చు, అటువంటి పండిత సభల్ని సత్సభ లని నన్నయ బహుధా ప్రశంసించాడు. 4

చతుర్విధ కవితల విషయంలో నన్నయ్యకూ తమిళ లాక్షణికులకూ మధ్య ఏకవాక్యత కానవస్తున్నది. ఇది కూడా గమనించదగిన విషయమే.

భారతావతారికలో 'మృదు మధుర రస భావ భాసుర నవార్థ వచన రచనా విశారదులయిన మహాకవులు' అని ఆదికవి పేర్కొన్నాడు. దీనికి 'చిత్ర విస్తర నవరస భావ భాసుర కవితా రచనా విశారదులైన', 'మృదు మధుర రసభావ భాసుర రసార్థ ...' అనే పాఠాంతరా లున్నాయి. 6

'కవి, మగన్, వాది, వాక్కి' అని నాలుగు రకాల కవులను పేర్కొని, తమిళ లాక్షణికులు కవిని ఆశుకవి, మధురకవి, చిత్రకవి, విస్తా (స్తా)ర కవి అని మళ్ళీ కవిని నాలుగు రకాలుగా విభజించారు. తెలుగు కవులు చతుర్విధ కవిత లనగా, తమిళులు చతుర్విధ కవులని పేర్కొన్నారు. ఈ సంప్రదాయం తెలుగులకూ తమిళులకూ సమాన మన భావించడంలో విప్రతిపత్తి లేదు. 7

తెలుగు ద్రావిడ భాషా కుటుంబానికి చెందినా, తెలుగు సాహిత్యం సంస్కృత సాహిత్యపు అడుగుజాడలలో నడిచి పెరిగి పెద్దదయిన విషయం విజ్ఞులకు తెలిసిందే. ఉత్పలమాల, చంపకమాలాది వృత్తాలను ఉపయోగించినా, తరువోజ మధ్యాక్కరాది దేశీయచ్ఛందములను కూడా నన్నయ వాడిన విషయం విజ్ఞులకు కొత్తది కాదు. మహాభారతం వంటి బృహద్రచనకు ఛందో వైవిధ్యం తప్పనిసరి అనే తలంపుతో నన్నయ వృత్తరచన చేసి వుండవచ్చు. తమిళంలో కూడా కంబమహాకవి 8 తన రామాయణంలో వృత్త రచన చేశాడు, అయితే దీనికి సంస్కృత వృత్తానికి భేదం లేకపోలేదు.

సంస్కృతచ్ఛందములను స్వీకరించినా, వాటిలో యతిప్రాసలు ప్రవేశపెట్టి నన్నయ తన భాషాభిమానానికి పెద్ద పీట వేసుకున్నాడు. అందువల్ల వాటికి తెలుగుతనం వచ్చినట్లయింది. చివరికి యతిప్రాసలు తెలుగు పద్యానికి ముఖ్యాంగాలుగా పరిణమించాయి. 9 ఈ యతిప్రాసలు తమిళంలోనూ కనిపిస్తాయి. యతిని మోనై అనీ, ప్రాసను ఎదుగై అనీ తమిళులు వ్యవహరిస్తారు. తమిళ లాక్షణికులలో ప్రథముడైన తొల్కాప్పియర్ పద్యలక్షణాలుగా ఇరవై ఆరు అంశాలు ఉదాహరించాడు. వాటిలో ఒకటి తొడై. ఇందులోని ప్రధానాంశాలు యతిప్రాసలు. అయితే యతి విషయంలో తమిళ కవికి స్వాతంత్ర్యం ఉంది. అది తెలుగు కవికి లేదు. అక్షరమైత్రిని ఉభయ కవులూ పాటించారు. ద్రావిడ భాషా కుటుంబానికి చెందినదే అయినా, కన్నడం సంస్కృతంలోని యతినే గ్రహించింది. 'కన్నడెక్కె యతి యిల్ల, కోణంగిక్కె మతి యిల్ల' అనే సామెతను ఈ సందర్భంలో ఉదాహరించటం అప్రస్తుతం కాదు

మొత్తం మీద, యతిప్రాసల సంప్రదాయాన్ని తెలుగు, తమిళ కవులు పాటించా రనడం నిర్వివాదం, 10 ఈ సంప్రదాయాన్ని అనుసరించడం వల్ల నన్నయ మాతృభాషాభిమానం వ్యక్తమవుతున్నదని నా అభిప్రాయం.

ఏ భాషలోనైనా మౌఖిక సాహిత్యానికి చెందిన పాటలు ప్రాచీనతా ముద్రకలిగి వుంటాయి. సీత సురటి మొదలైన పాత పాటలు తరువోజ ఛందంలో ఉన్నాయనీ, తమిళంలోని అగవల్పా పాదాన్ని కనుక రెట్టింపు చేస్తే అది తరువోజ పాద మవుతుందనీ టేకుమళ్ళ రాజగోపాలరావుగారు పేర్కొన్నారు 11 ఈ అగవల్పా ఛందం నుంచే ద్విపద, సీసం మొదలైనవి రూపొందినట్లు కోరాడ రామకృష్ణయ్యగారి అభిప్రాయం. 12 ఈ విషయాదికాన్ని స్థూలంగా పరిశీలించినా, తెలుగు-తమిళ ఛందస్సంప్రదాయాల నడుమ సన్నిహిత సంబంధం నెల కొన్న అంశం విదిత మవుతుంది.

చరిత్ర ప్రసిద్ధుడైన కరికాల చోళుని వంశీయుడ నని చెప్పుకున్న నన్నె చోడుని కవితలో కొన్ని తమిళ సంప్రదాయాలు కానవస్తున్నాయి.

కావేరి కిరువైపుల కట్టలు పోసి, చోళ దేశంలో వ్యవసాయాభివృద్ధికి ఎంతో కృషిచేసిన కరికాలుణ్ణి గురించి సంగకాలపు కృతులలో కొన్ని విషయాలు ఉదాహృతాలు. కాని కావేరికి కట్టలు పోసిన ఉదంతం మాత్రం ఎందుకో వాటిలో ఉదాహృతం కాలేదు. అందువల్ల ఈ ఉదంతం కల్పితమని చరిత్ర

కారులు కొందరు విశ్వసించారు. 13 కానీ యీ విషయాన్ని మన తెలుగు కవులు సమర్థించడం పేర్కొనదగిన అంశం చివరికి 17 వ శతాబ్ది వాడైన కట్టా వరద రాజు తన రామాయణంలో ఇలా పేర్కొన్నాడు. 14

'ఆ కరికాళ చోళాధీశు కీర్తి
యాకర్ణనీయ మయ్యవ నెయ్యెడల
అతడు కావేరి కల్లన కట్ట గట్టి
నతిశయించెను తదీయాన్వవాయమున
పుట్టిన రవివంశ భూభుజావళికి
కట్టాన్వయు లనంగ....'

అలాగే చోళుల రాజదాని నగరమైన ఉ(ఒ)రయూరికి సంబంధించిన ఐతిహ్యాన్ని కూడా మన తెలుగు కవులు గ్రంథస్థం చేశారు. ఉరయూరుకి ఉరందై, కోళి అనే ప్రసిద్ధ నామాంతరాలున్నాయి. కోళి అనగా కోడి అని అర్థం పూర్వం ఉరయూరులో ఒక కోడి మదగజంతో పోరాడి గెలిచిందట. తన్నాదిగా ఉరయూరుకి కోడి అనే పేరు వాడుకలోకి వచ్చింది. ఒరయూరులో కలుకోడి కూసిందనీ కలుపొన్న పూచిందనీ నన్నెచోడుడు పేర్కొన్నాడు. 35 ఈ విషయాన్ని పాల్కురికి సోమనాథుడు కూడా తెలియజేశాడు. 16

నన్నెచోడుడు అభివర్ణించిన గణపతి వృత్తాంతం తమిళ సాహిత్య సంప్రదాయపు ప్రభావాన్ని తెలియజేస్తున్నది. రజతాద్రిని శివుడూ, సతీదేవి విహరిస్తూ వుండగా, మత్తగజాల జలక్రీడ వారి కంట పడింది. అది చూచి, కామవివశులై, వా రిద్దరూ గజ రూపం ధరించారు. అలా వాళ్ళకు పుట్టినవాడు కావడం మూలాన, గణపతి గజాననుడయ్యాడు. 17 ఇదే విధంగా నిశ్శంక కొమ్మన రచించిన శివ లీలా విలాసములో గజానన వృత్తాంతం అభివర్ణితం.

తెలుగువారు సాధారణంగా చెప్పుకునే గణపతి జనన వృత్తాంతానికి భిన్నంగా ఉన్న పై కథ తేవారంలో చెప్పబడింది తమిళ శైవులకు పారాయణ గ్రంథం తేవారం. 18

ఈ కథను 18 వ శతాబ్ది వాడైన మలయాళ మహాకవి కుంజన్ నంబియార్ కళ్యాణ సౌగంధికం, హనూమదుద్భవం అనే కృతులలో వివరించినట్లు తెలియ వస్తున్నది. అందువల్ల, ఈ గజానన వృత్తాంతం దక్షిణా పథానికి చెందిన కథ కావచ్చునని పేర్కొనవచ్చు.

తేవారంలో ప్రముఖ శైవ క్షేత్రాలైన శ్రీ కాళహస్తినీ, శ్రీ శైలాన్నీ ప్రశంసిస్తూ అప్పర్, సంబందర్, సుందరర్ ఈ ముగ్గురు నాయనార్లు చెప్పిన గీతాలు చేర్చబడ్డాయి మన దేశంలో 274 శైవ క్షేత్రాలున్నాయనీ, వాటిలో 44 మాత్రమే ఈ నాయనారుల సంస్తుతికి నోచుకున్నాయనీ విజ్ఞులు చెపుతారు. 19 ఈ 44 క్షేత్రాలలో ఈ శ్రీకాళహస్తి, శ్రీశైలమూ ఉండడం పేర్కొనదగిన అంశం. రెండు తెలుగు క్షేత్రాలకు తమిళ భక్తులు రాకపోకలు సాగిస్తూ వుండేవారు. ఆ విధంగా ఈ క్షేత్రద్వయానికి తమిళ సాహిత్యంలో సముచితమైన స్థానం లభించింది.

పాల్కురికి సోమనాథుణ్ణి ప్రస్తావించడం జరిగింది కనుక, ఆ మహాకవి తెలుగు- తమిళ సంబంధాలను పటిష్ఠం చేసిన విషయాన్ని ఇక తెలుసుకుందాము

మన ప్రాచీనాంధ్ర మహాకవులు పలువురిలా, సోమనాథుడు కూడా బహు భాషాభిజ్ఞుడు అయనకి తమిళంతో గాఢమైన పరిచయం ఉంది. తమిళ శబ్దాలను వాడడంతోపాటు, అరవై ముగ్గురు నాయనారుల కథల్ని తొలిసారిగా ఆయన తెలుగు వారికి పరిచయం చేశాడు. పైగా సోమనాథుని బసవ పురాణం తమిళం లోకి కూడా పరివర్తిత మయింది. దురదృష్ట వశాత్తూ, తమిళ అనువాదకుని గురించి యేమి తెలియరాలేదు. తమిళానువాదం 1931 లో ముద్రించబడింది.

సుందరమూర్తి నాయనారు వెలయించిన తిరుత్తొండ త్తొగై సోమనాథునికి పరిచితమై వుండవచ్చునని నా అభిప్రాయం. ఈ లఘు రచనలో అరవై ముగ్గురు నాయనారుల పేర్లు ఉదాహరించబడ్డాయి. ఈ రచనా శైలిని అను కరించినా, ఎందుకో నాయనారుల పేర్లు కొన్నిటిని మార్చివేశాడు సోమ నాథుడు.

'తిల్లైవాళ్ అన్దనర్ తం అడియార్కుం అడియేన్
తిరునీల కంటత్తు క్కువయనార్కడి యేన్....'

అని ప్రారంభమయ్యే తిరుత్తొండత్తొగైలో ప్రతి నాయనారు పేరు చివర అడియేన్ (దాసుణ్ణి) అని వుంటుంది. తదనుగుణంగా సోమనాథుడు బసవ పురాణంలో ఇలా అన్నాడు ;

'ధర రాజ్య మొల్లక తిరుముడి దాల్చి
పరము నమ్మిన తిరుపాలుని బంట్ల,

తిరునావక పురీశు కరుణ బ్రాణేశు
నిరవెర్ధి కొల్చిన తిరుకుర్వి బంట,
దర రోహిణియు దాను హర కృప జనిన
తిరుపూరి తిరుమూల దేవుని బంట,
చన్న పురాతన సానుల బంట.
ఉన్న నూతన భక్తయూథంబు బంట,
ఇట మీద శివు గొల్చి యీప్సితార్థములు
పటుతరంబుగ గాంచు భక్తుల బంట,'

12 వ శతాబ్ది పూర్వార్థంలో నివసించిన సేక్కిళార్ రచించిన పెరియ పురాణంలో నాయనారుల జీవిత విశేషాదికం మనోజ్ఞంగా అభివర్ణితం. మరి సోమనాథుడు ఈ గ్రంథాన్ని సంప్రతించాడో లేదో స్పష్టంగా చెప్పలేము. మహా కవి కాబట్టి కథలలోని ప్రధాన భావాన్ని సోమనాథుడు హృదయానికి హత్తుకు నేలా తెలియజేశాడు. కాని ఆయా కథలలోని సొగసుల్ని తెలుసుకోడానికి పెరియ పురాణం శరణ్యం. ఉదాహరణానికి పూసల నాయనారు కథను పరికిద్దాం. బసవ పురాణంలో ఈ కథ 8 పంక్తులలో చెప్పబడగా, పెరియ పురాణంలో 72 పంక్తులలో (18 పద్యాలు) చెప్పబడింది.

విక్రమచోడుడనే ఒక రాజు బంగారం ఉపయోగించి ఆలయ నిర్మాణం కావించి, లింగ ప్రతిష్ఠ కూడా చేశాడు. పూసల నాయనార్ అనే భక్తుడు కూడా రత్న విమానంతో ఆలయం నిర్మించాడు. అయితే ఆ ఆలయ నిర్మాణం అతని హృదయంలో జరిగింది. అయినా అతడు శివుని ఆదరానికి పాత్రుడై, చివరికి శివ సాయుజ్యం పొందాడు. ఇదీ బసవపురాణం చెప్పిన పూసల నాయనారు కథ.

పెరియ పురాణంలోని పూసలార్ నాయనార్ ఒక బ్రాహ్మణుడు. అతడు శివుణ్ణీ, శివభక్తుల్నీ సదా సేవించేవాడు. ఒక శివాలయం నిర్మించాలని అతడు అభిలషించాడు. నిర్ధనుడు కావడంవల్ల, మనస్సులోనే గుడి కట్టాడు. లింగ ప్రతిష్ఠకోసం ముహూర్తం కూడా నిర్ణయించాడు. ఆ రోజుల్లో కాటవుడనే రాజు కంచిని పరిపాలిస్తూ వుండేవాడు, అతడు కూడా శివభక్తుడే. కంచిలోనే ఒక గొప్ప దేవాలయం నిర్మించి, లింగ ప్రతిష్ఠ కోసం ఒక సుదినం నిర్ణయించాడు. ఆ ముందు రోజు రాత్రి శివుడు రాజుకి కలలో కనిపించి, 'నేను రేపు పూసలార్ కట్టిన గుడికి వెడుతున్నాను. కనుక నీవు కట్టిన గుళ్ళో లింగ ప్రతిష్ఠ ఆ మరునాడు

నాడు జరుగుతుంది' అని చెప్పి అదృశ్యుడయ్యాడు. ఆ తర్వాత రాజు పూసలార్ గ్రామానికి బయలుదేరాడు. ఆ పేద బ్రాహ్మణుడు గుడి యేమి కట్టలేదని తెలుసుకొని ఆశ్చర్యచకితుడయ్యాడు- పూసలార్‌ని దర్శించాడు జరిగిన విషయం అతనికి తెలియజేశాడు, అప్పుడు తాను తన హృదయంలోనే ఆలయం నిర్మించానని పూసలార్ చెప్పాడు. ఆయన్ని రాజు బహువిధాల ప్రశంసించి, తన రాజధానికి వెళ్ళిపోయాడు.

భక్త్యావేశంతో సోమనాథుడు చెప్పిన కథలు జనరంజకంగా ఉండడంలో ఆశ్చర్యం లేదు. కాని పెరియ పురాణం కథలతో పోల్చి చూసినప్పుడు, సోమనాదుడు కథా కథనంలో కొంత అశ్రద్ధ వహించినట్లు విదిత మవుతుంది. ఏది ఎలా వున్నా, అరవై ముగ్గురు నాయన్మారుల సంప్రదాయాన్ని వారి కథల్ని తెలుగు వారికి తెలియజేసిన ఘనత పాల్కురికి సోమనాదునికే చెందుతుంది. ఆయన్ని అనుసరించి తరువాతి కవులు శివభక్తుల కథలు అభివర్ణించారు.

శివపారమ్యాన్ని తమిళ సాహిత్య సంప్రదాయాలనూ తెలియజేసే మరో కావ్యం ధూర్జటి రచించిన కాళహస్తి మాహాత్మ్యం. తమిళ శబ్దాలను యథోచితంగా వాడడమే కాక, సంగకాలపు కవి అయిన నక్కీరుని గురించి మొదటిసారిగా తెలుగు వారికి తెలియజేసిన వాడు ధూర్జటియే. మధుర మీనాక్షిని అంగయ కన్య అని పేర్కొన్నాడు. (అంగయర్ కణ్ణి—అందమైన చేప కన్నులు కలది). అలాగే తిరువణ్ణామలైలో నెలకొన్న అపీతకుచాంబను ఉణ్ణాముల అని వ్యవహరించాడు. ఏదో ఒక తమిళ కృతినో లేక తమిళ విద్వాంసుడినో సంప్రతించి ధూర్జటి నక్కీరుని కథను వ్రాసినట్లు నా అభిప్రాయం,

తెలుగు వారి దృష్టిలో దారేషణ, ధనేషణ, పుత్రేషణలు ఈషణత్రయం. ఇవి త్యాజ్యము లని మన అభిప్రాయం. తమిళుల దృష్టిలో మణ్ణాస, పొన్నాస, పెణ్ణాసలు ఈషణత్రయం భూమి, బంగారము, పడతి - వీటి మీద అపేక్ష అవాంఛనీయమని వారి అభిప్రాయం. ధూర్జటి తమిళ సంప్రదాయాన్ని, కథా సందర్భాన్ని అనుసరించినట్లు ఈ క్రింది పద్యం స్పష్టం చేస్తున్నది. 21

'ఉణ్ణాముల జగదంబిక
నణ్ణామల విశ్వనాథు నారాధించెన్

మణ్ణాసయు బొన్నాసయు
బెణ్ణాసయు లేనివారి పెన్నిధు లగుటన్',

ద్రావిడ వేదమని వినుతి కెక్కిన నాలాయిర దివ్య ప్రబంధం వైష్ణవులకు - తెలుగు వారైనా తమిళులైనా-పారాయణ గ్రంథం, వైష్ణవులు, ఏ ప్రాంతీయులైనా, వారి మతభాష తమిళ మనడం అత్యుక్తి కాదు. అందువల్ల తెలుగు వైష్ణవ వాఙ్మయం మీద తమిళ సాహిత్య ప్రభావం కనిపించడం వింత యేమీ కాదు.

13 వ శతాబ్ది వాడైన కృష్ణమాచార్యుడు తెలుగు వైష్ణవ వాఙ్మయ పితామహుడుగా భావించబడుతున్నాడు 22 శఠకోపుని (నమ్మాళ్వారు) వేదాన్ని ఆయన తెలుగు చేసినట్లు తాళ్లపాక తిరువేంగళనాథుడు పేర్కొన్నాడు [23 ఇలా తమిళ రచనలకు తెలుగుసేతలు చేసిన వారిలో కృష్ణమాచార్యుడు ఆద్యు డనవచ్చు.

పద కవితా పితామహుడైన తాళ్లపాక అన్నమాచార్యులు కూడా యథోచితంగా ఆళ్వార్ల దివ్యకవితా వైభవాన్ని తెలుగు వారికి తెలియజేశాడు

అన్నమయ్య మనుమడు చిన్నన్న (తిరువేంగళనాధుడు) ద్రవిడ ప్రబంధం చూసి పరమయోగి విలాసం రచించాడు. ఈ కృతిలో పన్నిద్దరాళ్వారులను గురించే కాక నాథముని, యామునాచార్యులు, రామానుజుడు మొదలైన మహాపురుషుల్ని గురించి కూడా అమూల్య విషయాలు ఎన్నో ఉదాహరించబడ్డాయి ఆ యా సందర్భాలకు అనుగుణంగా, చిన్నన్న మూలంలోని కొన్ని పాశురాలను తెలుగు చేశాడు. ఒకటి రెండు తెలుగు సేతల్ని పరికిద్దాము ;

పన్నిద్దరాళ్వారులలో రెండవ వాడైన భూతత్తాళ్వారు చెప్పిన పాశురాలలో

'అన్పే తగళియా, ఆర్వమే నెయ్యాగ
ఇన్పురుకు చింతై యిడు తిరియా నన్పురికి
జ్ఞానచ్చుడర్ విళక్కేట్రినేన్ నారణర్కు
జ్ఞాన త్తమిళ్ పురిన్దనాన్'

అనేది బహు ప్రసిద్ధ మయింది. దీనికి చిన్నన్న అనువాదం ఇలా సాగింది:

'..... .... ప్రేమ
పంతియు, మితిలేని భక్తియే చమురు,
నానంద భరిత హృదబ్జంబె వత్తి
గా నొనరించి, వికాసమై యాత్మ

దిర మొందు జ్ఞానంబు దీపంబు చేసి
పెరిమె నారాయణార్పితము గావించె....'

ఇటువంటిదే మరొక తెలుగు సేత :

'ధరణి పంతియ, సముద్రంబులు నేయి,
యరుణు దీపము జేసి, యరుణాంశుతతులు
గారాబు చక్రంబుకై పూన్చినట్టి
నీరజాక్షున కిచ్చె నీరాజనంబు'.

అనువాదమనే భావం రానియ్యక, చిన్నన్న చేసిన యీ తెలుగు సేతలు మధుర మోహనము లనడం చర్విత చర్వణం, తొండరడిప్పొడి ఆళ్వారు చెప్పిన తిరుప్పళ్లి ఎళుచ్చిలో (ప్రాబోధకీ స్తుతి) ప్రతి పాశురం చివరా 'అరంగత్తమ్మా ! పళ్లి ఎళుందరుళాయే' అని వుంటుంది. ఈ మకుటాన్ని చిన్నన్న 'పాలించి కరుణ జొప్పడ యోగనిద్ర జాలించి శ్రీరంగశాయి ! మేల్కనవె' అని అనువదించాడు. తమిళంతో గాఢమైన పరిచయమూ తెలుగులో చక్కని కవితా శక్తి కలిగిన చిన్నన్న కనుక యధాతథంగా అనువదించి వుంటే, తెలుగులో ద్రావిడవేదం వెలిసి వుండేది. ఆయన తనకు నచ్చిన భాగాలనో, ఆ యా సందర్భాలకు అనుగుణంగానో మూలాన్ని అనువదించాడు. మూలంలోని సౌందర్యాన్ని ఆస్వాదించే అనుభూతిని పాఠకుడికి కలగజేశాడు. ఇటువంటి రచనల వల్లనే, రెండు భాషల వారి మధ్య సన్నిహిత సంబంధం ఏర్పడగలదని నిర్వివాదంగా చెప్పవచ్చు.

తెలుగు-తమిళ సాహిత్యాల మధ్య సత్సంబంధాన్ని దృఢతరం చేసిన కవి రాజులలో శ్రీ కృష్ణదేవరాయలు సంభావ్యుడు. విశిష్టాద్వైత సిద్ధాంత సౌరభాన్ని గుబాళింపజేసే ఆముక్తమాల్యదా కావ్యం ద్వారా ఆయన తొలిసారిగా గోదాదేవి నామాంతరం కల ఆండాళ్ దివ్య చరిత్రను తెలుగు వారికి తెలియజేశాడు. ఆండాళ్ పన్నిద్దరాళ్వారులలో ఒకరైనప్పటికీ, తమిళంలో కవయిత్రి అయినప్పటికీ ఆమె చరిత్ర నభివర్ణించే కావ్యం తమిళంలో ఆ రోజులలో వెలువడలేదు. ఈ విశిష్ట గౌరవం రాయల వారివల్ల తెలుగుకి లభించింది. రాయలు బహుశః తెన్కలై సంప్రదాయానికి చెందిన వాడు కావడం వల్ల, తరుచుగా నాలాయిర దివ్య ప్రబంధ ప్రశంస చేశాడు తన కృతిలో.

ఆండాళ్ కథవలె, తెలుగు వారిని బహుధా ఆకర్షించిన మరొక కథ విప్రనారాయణుని (తొండరడిప్పొడి ఆళ్వారు) వృత్తాంతం. సారంగు తమ్మయ్య

చెదలవాడ మల్లయ ప్రభృతులు పలువురు కావ్య యక్షగానాది సాహిత్య ప్రక్రియ లలో విప్రనారాయణుని కథను పండిత పామర రంజకంగా చిత్రించారు తత్ఫలి తంగా నేటికీ ఆ అళ్వారు తెలుగు వారి మధ్య సజీవుడై ఉన్నాడు.

చారిత్రక కారణాలు, భక్త్యుద్యమం మొదలైన వాటివల్ల తెలుగు వారికీ తమిళులకూ మధ్య దగ్గరి చుట్టరికం ఏర్పడింది అది వారి సాహిత్యాభివృద్ధికి దోహదం చేసింది. ప్రతి సాహిత్యమూ ఇచ్చి పుచ్చుకుని పెరుగుతుందనడం సత్య సంపూర్ణం.

క్రీస్తు శకం 11 వ శతాబ్దిలో తమిళంలో యాప్పరుంగలక్కారికై అనే ప్రశస్త ఛందో గ్రంథం ఒకటి వెలిసింది, అమృతసాగరుడు అనే జైనుడు దీని రచయిత; గుణసాగరుడు అనే మరో జైనుడు దీనికి వ్యాఖ్యానం వెలయించాడు. యాప్పరుంగలం వెలువడక పూర్వమే తెలుగు, కన్నడ భాషలలో వడుగుచ్ఛందం, గుణకాంకియం అనే ఛందో గ్రంధాలు వెలువడినట్లు ఆ వ్యాఖ్యాత పేర్కొన్నాడు. వడుగుచ్ఛందం అనగా ఆంధ్రచ్ఛందమని అర్థం, 24 దీన్ని వాంచియార్ అనే జైనుడు వ్రాశాడట కొన్ని ప్రతులలో వాంచియార్‌కి మారుగా అపరంజియార్ అనే పేరు కనిపిస్తున్నదని ము, రాఘవయ్యంగారు పేర్కొన్నారు వాంచియ రేచయ (రేచన) కావచ్చునని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు విశ్వసించారు. ఏది యెలా ఉన్నా, ఒక తెలుగు ఛందోగ్రంధం తమిళంలో ఒక ఛందోగ్రంథ రచనకు దారి తీసిందని భావించడంలో విప్రతిపత్తి లేదు.

తమ్మి, అక్కట మొదలైన కొన్ని తెలుగు మాటలను తన రసవత్కావ్యంలో ఉపయోగించడమే కాక ఉత్తమ కవిత గోదావరి నడకలా ఉండాలని అభిలషిం చిన కంబ మహాకవి ఈ సందర్భంలో స్మరణీయుడు. ఆయన గోదావరిని ఇలా చిత్రించాడు : 25

'భూదేవికి అలంకారము గూర్చునదీ
శ్రేష్ఠమైన వస్తువులను పొలాలకు సమకూర్చునదీ
వేడిని పోగొట్ట గల రేవులు కలదీ
పలు ప్రాంతముల మీదుగా ప్రవహించునదీ, చల్లనిదీ
పొంగే స్వభావం కలదీ
పెద్దలు చెప్పిన కవిత వలె ఒప్పునదీ అయిన గోదావరిని
పరాక్రమ సంపన్నులైన రామలక్ష్మణులు దర్శించారు.'

'కిడన్ద గోదావరియినై' అని కంబకవి ప్రయోగించడం వల్ల, ఆయన వరదల్లో గోదావరిని దర్శించి వుండవచ్చునని భావించడం సముచితం. ఆ నదీ ప్రవాహం ఆయన్ని ఎంతగానో ఆకర్షించింది.

చోళ సమ్రాట్టుల పట్ల కలిగిన వైముఖ్యం వల్ల కంబ కవి ఓరుగల్లు పరిపాలించే మొదటి ప్రతాపరుద్రుని ఆస్థానానికి వెళ్ళినట్లు, ఆ తమిళ కవిచక్రవర్తి కవిత విని కాకతీయ నృపుడు ముగ్ధుడైనట్లు ఒక కథ ఉన్నది. ఆ తర్వాత కంబడు ప్రతాపరుద్రుణ్ణి ప్రశంసిస్తూ ఈ కింది చాటువు చెప్పినట్లు ప్రతీతి.

'అవని ముళుదుణ్డు, మయిరా వతత్తున్
బవని తొళువార్ పడుత్తుంబువని
ఉరుద్దిరా ! నిన్నుడైయ ఓరంగ నాట్టిళ్
గురుత్తిరా వాళైక్కుళామ్....'

(అవని యంతయు నీ అతిథు లగుట వల్లను, ఐరావతం వంటి పట్టపు టేనుగు నధివసించి ఊరేగుతున్న నిన్ను చూచి మోహం పట్టలేక మదవతులు కింద పరుచుకుని శయనించడం వల్లనూ, రుద్రా ! నీ ఒరంగల్లు నాడులో అరటి యాకులు కరవైనాయి.)

వాల్మీకాన్ని అనుసరించినా, తెలుగు రామాయణ కవుల వలె కంబడు కూడా అవాల్మీకాంశాలు చాలా చేర్చాడు. వాటిలో ఒకటి సీతాపహరణ వృత్తాంతం. రావణుడు తన చేతులతో సీతను అపహరించుకుని లంకకు వెడలినట్లు వాల్మీకి చెప్పగా, కంబడు తద్భిన్నంగా పేర్కొన్నాడు.

కంబ రామాయణంలోని రావణుడు వీణానాదాన్ని స్ఫురింపజేసే కంఠంతో వేద పారాయణం చేస్తూ సీతను సమీపిస్తాడు. ఆ తర్వాత తన నిజ రూపాన్ని చూపించేసరికి, ఆమె భయభ్రాంత అవుతుంది. అంత భయంలోనూ తనను సమీపించవద్దనీ, రావణుడు రాముడికి సమానం కాదనీ చెపుతుంది. రావణుడు ఆమెను అపహరించుకుని పోదామని అనుకుంటాడు. కాని పూర్వ శాపం గుర్తుకి వచ్చి, తన నిర్ణయాన్ని మార్చుకుంటాడు. ఒక స్త్రీ సమ్మతి లేకుండా ఆమెను చేరదలచితే, రావణుని తల పలు ముక్కలవుతుందని ఆ శాప సారాంశం. అందు వల్ల రావణుడు సీత నివసించే ఆ పర్ణశాలనే పెల్లగించి, దాన్ని తన రథంలో పెట్టుకుని లంకకు ప్రయాణమయ్యాడు. పెకలించిన పర్ణశాలతోనే లంకకు

ప్రయాణం కావడాన్ని ఆధునిక తమిళ విమర్శకులు కొంద ు పరిహసించారు[5]
వాల్మీకిని సమర్థించారు 26

ఈ సందర్భంలో వాల్మీకిని తెలుగు రామాయణ కవులు అనుసరించినా, జానపద రామాయణ కవులలో చాలామంది మాత్రం కంబ కవిని అనుసరించారు. సంక్షేప రామాయణ కర్త వర్ణించిన సీతా పహరణాన్ని పరికించండి : 27

'అని పది తలలు రాక్షసుడు జూపె
పది తలలు జూపగా పడి మూర్ఛ బొందె
మూక మామిడి విరిగి పడ్డ చందమున
గోరుచుట్టూ పయిని రోకలి పోటు
చెవులో పోటుకు తోడు సన్నాయి జోడు
జంకుచు కనుమూసి వణకుచు నున్నట్టి
భూమిపై నున్నట్టి భూపుత్రి జూచి
గడ్డ పెల్లగించి రథము పై బెట్టి
పగ దీరెనని తలచి గగనమున కెగిరి....'

గడ్డ పెల్లగించిన అంశాన్ని జానపద కవులే కల్పించారో, కంబ కవి కల్పనయో స్పష్టంగా చెప్పలేము కాని, ఈ కథాంశం మాత్రం తెలుగు జానపద సాహిత్యంలో ప్రముఖంగా చోటు చేసుకుందని చెప్పవచ్చు.

విజయనగర సమ్రాట్టులూ, వారి సామంతు లనదగిన మధుర, తంజాపురాది నాయక రాజుల యేలుబడిలో వివిధ వృత్తులకు చెందిన తెలుగు వారు తమిళనాడుకి తరలి వెళ్ళి అక్కడే స్థిర నివాసాలు ఏర్పాటు చేసుకున్నారు. ఆ రోజుల్లో తమిళులు కూడా తెలుగు భాషా సాహిత్యాలు నేర్చారు. వాళ్ళలో కొందరు తెలుగులో రచనా వ్యాసంగమూ చేశారు, ఆ కోవకు చెందిన వారిలో సుబ్బరామ దీక్షితులు, టి. యస్. మురుగేశం పిళ్లై, ఆర్కాటు త్యాగరాజ మొదలి ప్రభృతులు పేర్కొనదగిన వారు.

17 వ శతాబ్ది పూర్వార్ధంలో రామరాజ భూషణుని వసుచరిత్రకు తమిళ సేత వెలువడింది. ఇద్దరు తెలుగు మిత్రులు సహాయంతో అంబలత్తాడుం అయ్యన్ అనే కవి ఈ కావ్యాన్ని అనువదించాడు. 'తమిళంలో చక్కని కల్పనలతో విలసిల్లే కంబ రామాయణం, విల్లి భారతం, నైషధం మొదలైన కావ్యాలకు తరువా

తిదిగా ఈ కృతిని ఉదాహరించవచ్చు.' అని తమిళానువాదాన్ని ప్రకటించిన మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారాధిపతి పేర్కొన్నారు. నిజానికి తమిళ కవి మూలంలోని సొగసులను తన అనువాదంలో వెలార్చడానికి యథోచితంగా ప్రయత్నించాడు.

తెలుగు వారినీ తమిళుల్నీ సాంస్కృతికంగా సాహిత్యపరంగా సన్నిహితం చేసిన వారిలో ముఖ్యులు తెనాలి రామలింగకవి, త్యాగరాజు, వేమన మొదలైన వారు. తెనాలి రామలింగడు వికట కవిగా తమిళుల మధ్య నిలిచిపోయాడు. ఆయన కథలు నేటికీ చెప్పుకుంటారు; చెప్పుకుని కడుపుబ్బ నవ్వుకుంటారు. ఇక త్యాగయ్య విషయం చెప్పనవసరం లేదు. త్యాగరాజు కృతులలోని అందచందాలను పూర్తిగా అవగాహన చేసుకోవాలనే తలంపుతో తెలుగు భాష నేర్చుకునే తమిళులు ఎందరో నేటికీ కనిపిస్తారు. అలాగే వేమన్న కూడా తమిళులకు సుపరిచితుడు. వేమన పద్యాలను సీతారామ ప్రసాద్ (1892) పుదువై నారాయణ దాసర్ (1903) ప్రభృతులు తమిళం చేశారు. సుమతి శతకం కూడా తమిళంలోకి అనూదితమై 1904 లో ముద్రితమయింది. అనువాదకులు ఎళుమూర్ సమరపురి ముదలియార్. ఇంకా మరికొన్ని తెలుగు రచనలు తమిళంలోకి పరివర్తితము లైనాయి.

మొదటి నుంచీ తెలుగు కవులలో పలువురు బహు భాషాభిజ్ఞులుగా మనకు కనిపిస్తారు. ఆధునికులలో కూడా ఆ కోవకు చెందిన వారు కనిపించడం గమనించదగిన అంశం అందువల్ల, తిరుక్కురళ్, కంబ రామాయణం, భారతి కవితలు, వ్యాసాలు, తమిళ కథానికలు మొదలైన వాటిని తమిళం నుంచే అనువదించి మన తెలుగు రచయితలు ఆధునిక సాహిత్యాభివృద్ధికి కృషిచేశారు, చేస్తున్నారు. కనుపర్తి వెంకటరామ విద్యానందనాథులు, క్రొత్తపల్లి సుర్యారావు, గరిమెళ్ళ సత్యనారాయణ, పూతలపట్టు శ్రీరాములురెడ్డి, చల్లా రాధాకృష్ణశర్మ, ముదునూరి జగన్నాథ రాజు — ఇంకా మరికొందరు ఈ అనువాద కార్యక్రమంలో పాల్గొని తెలుగు తమిళ సాహిత్యాల మధ్య సంబంధాలను పటిష్ఠం చెయ్యడానికి ప్రయత్నించారు.

ఈ సందర్భంలో తెలుగు వారి తమిళ సాహిత్య సేవను కూడా దిఙ్మాత్రంగా పరిశీలించడం అసంగతం కాదు. 29 ఏండ్లకే నూరేళ్ళూ నిండిన అణ్ణామలై రెడ్డియార్ తొలుత సంభావ్యుడు. ఆయన సంతరించిన కావడిచ్చిందు నేటికీ

తమిళులకు ప్రీతి పాత్రమైన గేయ రచన. శ్రీయుతులు న. పిచ్చమూర్తి, త్రిలోక సీతారాం, కు. ప. ర, శంకరరాం ప్రభృతులు తమిళంలో కవితలూ కథానికలూ మొదలైనవి వెలయించి ప్రసిద్ధు లయ్యారు. సంస్కృతాంధ్ర గ్రంథాలు ఎన్నో వెలుగులోకి తెచ్చిన వావిళ్ళ వారు కొన్ని తమిళ గ్రంథాలు కూడా ప్రకటించారు. అలాగే తమిళ ముద్రాపకులు కూడా ఏన్నో తెలుగు గ్రంథాలు అచ్చువేసి, తెలుగు సాహిత్యాభివృద్ధికి గణనీయమైన కృషి చేశారు. వీరందరి కృషి చిరస్మరణీయం.

స్వాతంత్ర్యానంతరం, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు వివిధ భాషా సాహిత్యాల అభ్యున్నతికి సముచిత రీతిని కృషి చేస్తున్నాయి. అనువాద కార్యక్రమాన్ని ప్రోత్సహిస్తున్నాయి. సంస్థలతోపాటు కొందరు రచయితలు కూడా ఈ కార్యక్రమంలో స్వచ్ఛందంగా కృషి సాగిస్తున్నారు. ఈ వివిధ అనువాదాల వల్ల భారతీయుల మధ్య సాన్నిహిత్యం ఏర్పడగలదని భావించవచ్చు. అయితే వెలువడిన, వెలువడుతున్న యీ అనువాదాలు ఎంతవరకు మూలవిధేయంగా, [illegible] యోగ్యంగా ఉన్నాయన్నది మరో అంశం. ఈ అనువాదాల వెను[illegible] ప్రయత్నం మాత్రం ప్రశంసార్హం.

ఒకే కుటుంబానికి చెందిన భాషలు కావడం వల్లనూ, చారిత్రకంగా సాంస్కృతికంగా దగ్గరి చుట్టరికం ఉండడం వల్లనూ, చాలా కాలం రాజకీయంగా ఒకే రాష్ట్రంలో నివసించడం వల్లనూ తెలుగు-తమిళ సాహిత్యాల నడుమ సంబంధం ఏర్పడడంలో వింత లేదు. కాని తెలుగు నుంచి తమిళంలోకి గాని, తమిళం నుంచి తెలుగులోకి గాని వెలువడిన అనువాదాల సంఖ్యను పరిశీలించి నట్లయితే, ఎంతటి ఆశావాదికీ నిరుత్సాహం కలగక మానదు. తెలుగు, తమిళ భాషలు తెలిసిన ద్విభాషా రచయితల సంఖ్య కూడా అంతంతగానే ఉన్నది. బహు విధాలుగా సాన్నిహిత్యం ఉండి కూడా, తెలుగు తమిళ భాషలకు చెందిన ఉత్తమానువాదాలు వెలువడకపోవడం నిజంగానే మన దురదృష్టం. తెలుగు - తమిళ సాహిత్యాల మధ్య నెలకొన్న సత్సంబంధాలు ఇంకా దృఢతరం కావాలి. ఇందుకు ఈ ఉభయ భాషలకు చెందిన రచయితలూ, సాహిత్య సాంస్కృతిక సంస్థలూ కృషి చెయ్యడం చాలా అవసరం.

తెలుగు-తమిళ భాషలకు నడుమ నెలకొన్న సాన్నిహిత్యాన్ని చమత్కార పూర్వకంగా తెలియజేసే ఒక ప్రసిద్ధ చాటువు తమిళంలో ఉన్నది. అది దాదాపు

నాలుగు వందల యేండ్లకు మునుపు వెలుగు చూచి వుండవచ్చు నని భావించ బడుతున్నది. ఆ చాటువును యథాతథంగా ఉదాహరిస్తున్నాను. 28

> 'ఆనైక్కణ్ణిల్ ఒరు పిడియుం అసురన్ విరోది ఇళం పింజుం
> కానక్కుదిరై పుఱత్తోలుం కాలిల్ చెరుప్పై మాట్రియదుం
> తానే తాయ్‌కొల్ చాఱిట్టు త్తయవాయ్ ఆరైత్తుక్కొళ్ వాయేల్
> మానై పెరురుష్ణం విళియాలే వడుగుం తమిళుం గుణమామే.'

తన అనారోగ్యాన్ని తెలియజేసి, తగిన ఔషధం ఇవ్వవలసిందిగా ఒక యువతి ఒక వైద్యుణ్ణి కోరింది. అందుకు తమిళ పండితుడైన ఆ వైద్యు డిచ్చిన ప్రత్యుత్తరమే పై పద్యం. పద్యం అర్థం కాని యువతి ఆ వెజ్జుని ఎగా దిగా చూసింది. అప్పు డాయన మందహాసం చేసి, పద్య గత భావాన్ని ఇలా విశదీకరించాడు :

"ఆ (యా) నైని సంస్కృతంలో హస్తి అంటారు. హస్తి తమిళంలో అత్తిగా మారింది. కనుక ఆనైక్కణ్ణు అంటే అత్తి (మేడి) చెట్టని అర్థం. ఆ అత్తిచెట్టు లేత ఆకులు కొన్ని తీసుకోవాలి. అసుర విరోధి మరెవరో కాదు; వేలాయుధుడైన షణ్ముఖుడు. అనగా వేలై మరం (తుమ్మలో ఒక రకం) లేత పిందెల్ని తీసుకోవాలి. ఆ తర్వాత కానక్కుదిరై అంటే అడవి మామిడి చెట్టు బెరడుని, చెరువుగట్టుల కనిపించే సెరుప్పడిని (మూలిక) కూడా గ్రహించాలి. వీటన్నిటినీ అరటి ఊచరసంతో కలిపి బాగా నూరాలి. అప్పుడు ఔషధం తయారవుతుంది. అయితే అది యే వ్యాధికి? వడుగుం తమిళుం — వడుగు అనగా తెలుగు; తెలుగూ తమిళం కలిసినదే ఆ వ్యాధి పేరు. వయిట్రు క్కడుపు! కడుపుని (పొట్ట) తమిళంలో వయిరు అంటారు. నేటికి తమిళులు జిగట (బంక) విరేచనములను వయిట్రు క్కడుప్పు అని వ్యవహరిస్తారు.

వయిట్రు క్కడుప్పు అని పేర్కొనక, తెలుగు తమిళ శబ్దముల సమాహారమే ఆ వ్యాధి పేరు అని చమత్కార పూర్వకంగా చెప్పడమే యీ పద్యంలోని విశేషం !

# అధో జ్ఞాపికలు

1. కణ్ణన్‌పాట్టు, కణమ్మా—ఎన్ కాదలి, 4.

నేట్రుమున్నాళిల్ వన్ద ఉఱవన్ఱుడీ–మిగ
నెడుం పణ్డైక్కాలముదల్ సేర్‌న్దు వన్దదామ్.

భారతియార్ కవితైగళ్ వానతి పదిప్పగం, మదరాసు, 1975.

2. చెంగణ్మా (ఉత్తరార్కాడు జిల్లా) కొండ ప్రాంతపు రాజుగా ప్రసిద్ధుడు.

3. శ్రీమదాంధ్ర మహాభారతము–(ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి ప్రచురణ, 1970) ఆదిపర్వము, షష్ఠాశ్వాసము, 263 వ పద్యం.

4. పైది, ఆదిపర్వము, ప్రథమాశ్వాసము, 24 వ పద్యం, చూడండి: ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారి ఆంధ్ర సాహిత్య చరిత్ర, 1979, పుటలు: 36, 37.

5. పైది, ఆదిపర్వము, ప్రథమాశ్వాసము, 8.

6. ఆంధ్ర మహాభారతము, ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి సంశోధిత ముద్రణ, 1968.

7. నిడుదవోలు వేంకటరావుగారి తెనుగు కవుల చరిత్ర, మదరాసు విశ్వ విద్యాలయ ప్రచురణ 1956, పుట XV

8. కంబకవి క్రి. శ. 9 వ శతాబ్దిలో జీవించినట్లు కొందరూ, 12 వ శతాబ్దిలో వర్ధిల్లినట్లు మరికొందరు భావిస్తున్నారు, ఏమయినప్పటికి, బహుప్రాచీను డనడం నిర్వివాదం.

9. అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులు తమ నేటి కాలపు కవిత్వం (1928) లో యతిప్రాసలు అస్థిర ధర్మాలని పేర్కొని, అవి పద్యానికి అనవసర మన్నారు. సంస్కృత కవులు వాడినట్లుగా యతిని వాడడం మంచిదని ఆయన అభిప్రాయం, ఈ అభిప్రాయాన్ని సమర్థించిన మరికొందరూ లేకపోలేదు.

10. ఇంకా వివరాలకు చూడండి; నా Tamil Element in Telugu Literature (unpublished M. Litt; Thesis submitted to the University of Madras, *1964*.

11. తెలుగు, తమిళ, కన్నడ ఛందస్సంప్రదాయాల్ని పరిశీలించి రాజగోపాల రావుగారు A Comparative Prosody of the Dravidian Languages (1913) అనే ప్రశస్త రచన చేశారు, పుట: 29,

12. దక్షిణ దేశ భాషా సారస్వతములు, దేసి, 1949,

13. K. A. Nilakanta sastri : Studies in Cola History and Administration. P. 68.

14. శ్రీరామాయణము, పరిష్కర్త శ్రీ నిడుదవోలు వేంకటరావు (తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథావళి, సంఖ్య 12) 1950, సంపుటము: 1, పుట: 8. పాల్కురికి సోమనాథుడు కూడ 'కరికాలచోడని కట్టిన యలవో' అన్నాడు పండితారాధ్య చరిత్రము, మొదటి భాగము, పుట: 458,.

15. 'కలుకొన్న విరుల బెరుగం
గలుకోడి రవంబు దిశల గలయగ జెలగన్
బొలుచు నొరయూరి కధిపతి
నలఘు పరాక్రముడ డెంకణాదిత్యుండడన్'—కుమార సంభవము 1-54,

16. 'అక్కజంబుగ పూచె నంత గల్పొన్న
గుక్కురో కుర్రని కూసె గల్కోడి.'
—పండితారాధ్య చరిత్రము, 2 వ భాగము, పుట; 197.

17. కుమార సంభవము, 1-54.

18. తమిళ వేదంగా కీర్తించబడుతున్న తేవారంలో 'మూవర్' అనబడే అప్పర్, సంబందర్, సుందరర్ అనే ముగ్గురు నాయనారుల భక్తిగీతాలు అందాలు దిద్దుకున్నాయి.

19. టి. సుబ్రమణ్య పిళ్ళై, శివస్థల మంజరి, 1931.

20. బసవ పురాణం, 1925, పుట: 122.

21. కాళహస్తి మాహాత్మ్యము, 3-185.

22. నిడుదవోలు వేంకటరావు: ఆంధ్ర వచన వాఙ్మయము, 1954, పుటలు: 28-30.

23. '..................శఠకోప మౌని
వేదంబు దెనుగు కావించి సంసార
ఖేదంబు మాన్పిన కృష్ణమాచార్యు

పరమయోగి విలాసము, తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణ, 1938,
పుట్లు: 4.

24. వడుగు అనే మాట తెలుగు కన్నడాలను సూచించే శబ్దమని కొందరు తలచినా, సుప్రసిద్ధ విద్వాంసులైన ము. రాఘవయ్యంగారు ప్రభృతులు వడుగు శబ్దం తెలుగునే సూచిస్తున్నదని పేర్కొనడం గమనించదగిన అంశం. రాఘవయ్యంగారు ఇలా అన్నారు : 'అది (అనగా కన్నడం) తమిళం తెలుగు (వడుగు) భాషల కలయిక వల్ల ఏర్పడిన భాష అని ప్రాచీన తమిళ విద్వాంసుల విశ్వాసం ఈ ప్రమాణములను పురస్కరించుకుని చూడగా, తెలుగునకు తమిళమునకు ఉన్నంత ప్రాచీనత గలదని గ్రహించ వచ్చును.' ఆరాయ్చ్చిత్తొగుది (వ్యాస సంకలనం).

25. వివరాలకు చూడండి : నా 'వేమన సూక్తులు' 1977, పుటలు: 51-53.

26. వివరాలకు చూడండి : నా The Ramayana in Telugu and Tamil—A comparative study, 1973.

27. స్త్రీల రామాయణపు పాటలు, 1955, పుటలు : 1-18.

28. ము. కు. జగన్నాథరాజా, వడుగుం తమిళుం వ్యాసం, దినమణి, 14-4-1983.

# తమిళంలో సంస్కృత శబ్దాలు

తమిళం అతి ప్రాచీన మయిందనీ, స్వతంత్రమైన భాష అనీ, తమిళ సాహిత్యం విలక్షణమైనదనీ చాలామంది అభిప్రాయం. నిజమే. కాని యితర భారతీయ భాషలలో వలె, తమిళ భాషా సాహిత్యాల మీద కూడా సంస్కృత భాషా సాహిత్యాల ప్రభావం కొద్దిగానో, గొప్పగానో కనిపిస్తూనే వుంటుంది. కీర్తి శేషులూ సుప్రసిద్ధ తమిళ పరిశోధక విద్వాంసులూ అయిన యస్. వైయాపురి పిళ్లైగారు 'తమిళమునకు సంస్కృతం దాది వంటిది' అని పేర్కొనడం గమనించ దగిన విషయం.

తమిళ సాహిత్య చరిత్రలో తొలి యుగం సంగయుగం. ఆనాళ్ళలో వెలుగు లోకి వచ్చిన కావ్యాలలోనూ, ఆ తరువాత వెలువడిన మణిమేకలై వంటి కావ్యాల లోనూ ఎన్నో సంస్కృత శబ్దాలు కనిపిస్తాయి. కడమ భారతీయ భాషలలో వలె తమిళంలోనూ రామాయణ భారతాదులు సంతరించబడ్డాయి. అందువల్ల తమిళ సాహిత్యం మీద సంస్కృత సాహిత్య ప్రభావం కొద్దిగా నైనా కనిపించడంలో వింత లేదు.

తొలి తమిళ లాక్షణికు డైన తొల్కాప్పియనార్ కాలం నాటికే తమిళంలో సంస్కృత శబ్దాలు చోటు చేసుకున్నాయి. తమిళ శబ్దాలను ఇయర్చొల్, తిరిచొల్, దిశైచ్చొల్, వడచొల్ అని ఆయన నాలుగు విధాలుగా వర్గీకరించాడు. తమిళ నాడుకి చెందిన వివిధ భాగాలలో వ్యవహృతమయ్యే మాటలకు దిశైచ్చొల్ అని పేరు. వీటిని మాండలిక భేదా లని చెప్పవచ్చు. కొన్ని ప్రాంతాలలో ముట్టైని (గ్రుడ్డు) మొట్టు అంటారు. మొట్టువంటి మాండలికాలను దిశైచ్చొల్‌గా భావిం చడం సముచితం. కాని కొందరి అభిప్రాయంలో తమిళనాడు సరిహద్దులలో ఉన్న ప్రాంతాల నుంచి వచ్చి, తమిళ భాషలో ప్రవేశించిన మాటలే దిశైచ్చొల్ అవుతాయి.

ఇక వడచొల్ అంటే సంస్కృత శబ్దాలని అర్థం. నన్నూల్ అనే ప్రశస్త లాక్షణిక గ్రంథం సంతరించిన పవణంది ముని (13 వ శతాబ్ది) దృష్టిలో దిశై

చ్చొల్, వడచొల్-ఈ రెండూ భిన్నములు. సంస్కృత శబ్దాలనే వడచొల్ అని వ్యవహరించడం సమంజసమని ఆయన పేర్కొన్నాడు. ఈ వడచొల్‌ని తత్సమ తద్భవాలుగా విభజించ వచ్చు. కమలంవంటి శబ్దాలు తత్సమాలైతే, విడం (విషం) ఔడదం (ఔషధం) వంటివి తద్భవాలు. వడచొల్ కేవలం సంస్కృత శబ్దాలకే పరిమితం కాదనీ, ఉత్తరాది భాషల మాటలన్నీ వడచొల్ అనీ కొందరి అభి ప్రాయం. అనగా సంస్కృత ప్రాకృత శబ్దాలని భావించవచ్చు. తెలుగుని తమిళులు 'వడుగు' అని వ్యవహరించారు. నాడు నేడు కూడా సంస్కృత భాషను సంస్కృతం అనక వడమొళి (ఉత్తరాది భాష) అనడమే తమిళుల వ్యవహారం.

తమిళ జైన కవులు సంస్కృత శబ్దాలను స్వీకరించారు. తమిళ వేదమని వినుతి కెక్కిన తిరుక్కురళులో కూడా సంస్కృత శబ్దాలు కాన వస్తాయి. సిలప్పది కారం, మణిమేకలై కావ్య కర్తలే కాక కవి చక్రవర్తి కంబన్ వంటి మహా కవులూ, ఆ తరువాతి వారైన అరుణగిరినాథర్, కుమరగురుపరస్వామి ప్రభృతులు సంస్కృత శబ్దాలను యథోచితంగా ఉపయోగించారు. ఇక భక్త కవులైన ఆళ్వార్లను (వైష్ణవ కవులు) గురించి చెప్ప నవసరంలేదు. తమిళ సంస్కృతాలు కలిసిన ఒక మిశ్రమ శైలిని మణి ప్రవాళ మనే పేరుతో వైష్ణవ వ్యాఖ్యాతలు ప్రచారంలోకి తీసుకు వచ్చారు. నేటికీ వైష్ణవ గ్రంథాలు మణిప్రవాళ శైలిలో సంతరించబడుతున్న విషయం సర్వ విదితం.

ఎన్నో యేండ్ల పరిశ్రమకు ఫలితంగా ఆరు సంపుటాలలో వెలువడిన తమిళ లెక్సికన్ (తమిళ బృహన్నిఘంటువు)లో చోటు చేసుకున్న సంస్కృత శబ్దాలను స్థూలంగా పరిశీలించినా, పైన ఉదాహరించిన విషయాలు స్పష్టం కాక పోవు. ఆ నిఘంటువులో అగ్నికి సంబంధించిన ఆరోపాలను మాత్రం పరిశీ లిద్దాము :

అగ్నికి తొమ్మిది అర్థాలు సూచించబడ్డాయి.

| | |
|---|---|
| అగ్నికక్కట్టు | అగ్నిచ్చువాలై (జ్వాల) |
| అగ్నికక్కరప్పాన్ | అగ్నిచేర్వై |
| అగ్నికారియం (కార్యం) | అగ్నిచకన్ (సఖుడు) |
| అగ్నికుండం | అగ్నిచకాయన్ |
| అగ్నికుమారం | అగ్నిసాట్చియమ్ |

అగ్నికుమారన్
అగ్నికులం
అగ్నికోణం
అగ్నికో (హో) త్తిరం
అగ్నికో (హో) త్తిరి
అగ్నిచ్చలం
అగ్నిచ్చివం
అగ్నిచ్చువత్తర్
అగ్ని ద్రావకం
అగ్ని దిశై
అగ్ని దివ్యం
అగ్ని దీపనం
అగ్ని దేవన్
అగ్ని నట్చత్తిరం
అగ్ని నాళ్
అగ్ని మండలం
అగ్ని మరం
అగ్నిమాంద్యం
అగ్ని రణం
అగ్ని లింగం
అగ్నిచా (జా) లం
అగ్నిట్టి
అగ్నిట్టోమం
అగ్నిత్తంబం
అగ్నిత్తంబనం
అగ్నిత్తాళి (అగ్నిని ఉంచే మట్టి పాత్ర)
అగ్ని ప్రవేశం
అగ్నిప్లాస్త్రి
అగ్ని పంచకం
అగ్ని పరీట్చై (పరీక్ష)
అగ్నిప్రాద్రై
అగ్ని పురాణం
అగ్ని పూ (భూంస్కందుడు)
అగ్నిమూత్తై
అగ్నియాతానం
అగ్నియోగం
అగ్నిస్నానం
అగ్ని సంస్కారం

ఇలా తన్నిఘంటువు పేర్కొన్న సంస్కృత శబ్దాలను ఉదాహరించాలంటే ఒక గ్రంథమే తయారవుతుంది. భాషా దృష్టితో ఈ నిఘంటువుని పరిశీలించడం అభిలషణీయం.

'ఇది తమిళ శబ్దమే' అన్నంతగా సంస్కృత శబ్దాలు కొన్ని వ్యావహారిక తమిళంలో కలిసి పోయినాయి. సెల్వంతన్ (ధనవంతుడు), తర్చెయల్ (తత్ + చెయల్ — తలవని తలంపుగా), తార్కాలికం (తాత్కాలికం) మొదలైనవి కొన్ని ఉదాహరణాలు. ఆనందక్కణ్ణీర్ (ఆనంద బాష్పములు), దురోగ (హ) చ్చెయల్ (విద్రోహ చర్య) వంటి సమాసాలు వ్యావహారిక తమిళంలో తరుచుగా విని పిస్తాయి. సత్యా సత్యములు—వంటి సమాసాలను పురస్కరించుకొని కాబోలు, ఘాస్త్రా

మాసం (నెల నెలా), వరుషా వరుషం (ప్రతి సంవత్సరం), వేళా వేళై (సమయా సమయాలు) వంటి ప్రయోగాలు తమిళుల వ్యవహారంలో విన నస్తాయి. సంస్కృతంలో మాస శబ్దం ఉంది కాని అమాస శబ్దం లేదు

ఇక తమిళుల నిత్య వ్యవహారంలోనూ, ప్రముఖ తమిళ పత్రికలలోనూ కాన వచ్చే కొన్ని సంస్కృత శబ్దాలను ఈ దిగువ ఉదాహరిస్తున్నాను (తమిళుల ఉచ్చారణ ననుసరించి తమిళ శబ్దాలు ఉదాహరించబడ్డాయి),

| తమిళం | తెలుగు |
|---|---|
| ఆన్మా | [illegible] |
| సముదాయం | సమాజం, సంఘం |
| సముదాయ నాడగం | సాంఘిక నాటకం |
| అగ్రాసనర్ | అధ్యక్షుడు |
| వివసాయం | వ్యవసాయం |
| కారియక్కమిట్టి | కార్యవర్గం |
| ముక్కియత్తువం | ముఖ్యత్వం |
| ఆత్తిరం (ఆత్రం) | ఉద్రేకం, కోపం |
| సుకవీనం | అనారోగ్యం |
| వెగుమతి | బహుమతి |
| మరణం | మరణం |
| సుదందిరం | స్వతంత్రం |
| సుదందిరప్పోర్ | స్వాతంత్ర్య సమరం |
| తియాగ వాళ్వు | త్యాగమయ జీవితం |
| తియాగి | త్యాగి |
| అరశాంగం | రాజ్యాంగం, ప్రభుత్వం |
| మనిద వర్గం | మానవ జాతి |
| మగా(హా)న్ | మహాత్ముడు |
| అర్పణం | సమర్పణ |
| దురాక్రమిప్పు | దురాక్రమణ |
| సేవై | సేవ |
| నాశం | నాశనం |

| తమిళం | తెలుగు |
|---|---|
| పూరణ | పూర్ణ |
| విషయం | విషయం, సంగతి |
| సంబవం | సంఘటన |
| సమత్తువం | సమత్వం |
| దేసియ | జాతీయ |
| దేశియక్కవి | జాతీయ కవి |
| సమూగం | సంఘం |
| సమూగ నావల్ | సాంఘిక నవల |
| నిది మందిరి | ఆర్థిక మంత్రి |
| వరదట్చిణై | కట్నం, వరదక్షిణ |
| మల్ యుద్ధం | మల్లయుద్ధం |
| అపాయం | అపాయం |
| ఉణవు దానియం | ఆహారధాన్యం |
| మగానాడు, మానాడు | మహాసభ |
| పయణం | ప్రయాణం, పయనం |
| లచ్చియం | లక్ష్యం |
| స్తాపనం | సంస్థ |
| జెయంతి | జయంతి |
| జెయరామన్ | జయరామన్ |
| జెయలట్చిమి | జయలక్ష్మి |
| కడన్ నివారణై | ఋణ నివారణ |
| సోదనై (శోధన) | ప్రయోగము, పరీక్ష |
| వివగారం | వ్యవహారం |
| ఆలోచనై | ఆలోచన |
| యాత్రీకర్ | యాత్రికులు |
| ఐతీగం | ఐతిహ్యం |
| అబివిరుత్తి | అభివృద్ధి |
| రాజ్జియం | రాష్ట్రం (కేరళ రాష్ట్రం) |

| తమిళం | తెలుగు |
|---|---|
| ఉఱ్పత్తి | ఉత్పత్తి |
| నాగరీకం | నాగరికం |
| మద్దియ సర్కార్ | కేంద్ర ప్రభుత్వం |
| పిర (ప్ర)బల | ప్రసిద్ధ |
| పిరముకర్ | ప్రముఖుడు |
| నిరాకరిప్పు | నిరాకరణ |
| ఆదరవు | సహకారం, దయ, ఆదరణ |
| అర్పుతం | అద్భుతం |
| ఆట్చేపం | ఆక్షేపణ |
| గోష్టిగానం | బృందగానం |
| ఉణ్ణావిరతం | నిరాహారదీక్ష |
| పిరమాదం (ప్రమాదం) | అద్భుతం |
| మదువిలక్కం | మద్యపాన నిషేధం |
| నియమనం | నియామకం |
| నగరాట్చి | నగర పరిపాలన |
| అన్నియ | అన్య |
| మూలదనం | పెట్టుబడి |
| అవసియం | అవశ్యకం |
| యోచనై | ఆలోచన, సలహా |
| రత్తం | రక్తం |
| రత్తక్కణ్ణీర్ | రక్తాశ్రువులు |
| నిర్వాకి (హి) | నిర్వాహకుడు |
| అరిచ్చందిరన్ | హరిశ్చంద్రుడు |
| సూరియ | సూర్య |
| చందిర | చంద్ర |
| సగాక్కళ్ | సహచరులు |
| ఏకమనదాగ | సహర్షముగా, ఏకగ్రీవముగా |
| పిరచ్చై (ప్రశ్న) | సమస్య |

| తమిళం | తెలుగు |
|---|---|
| అమైచ్చర్ (అమాత్య; తెలుగు వారి ఉచ్చారణలోనూ 'త్య' చ్యగా మారుతున్నది ) | మంత్రి |
| దట్చిణమండలం | దక్షిణమండలం |
| మిన్‌సారం | విద్యుచ్ఛక్తి |
| గోష్టి | జట్టు |
| జనాదిపతి | రాష్ట్రపతి |
| పిరదమర్ | ప్రధాని |
| ఊర్జితం | ఉద్ఘాటన |
| సబానాయకర్ | సభాపతి (స్పీకర్) |
| విచారణై | విచారణ |
| మన్దిరి సబై | మంత్రివర్గం |
| జననాయకం | ప్రజాస్వామ్యం |
| విమాన నిలైయం | విమానాశ్రయం |
| విశేషవణ్డి | ప్రత్యేక రైలు |
| శట్టవిరోదం | చట్టమునకు వ్యతిరేకమైన (చట్ట విరోధమైన) |
| పొదువివాదం | సాధారణ చర్చ |
| శతవీదం | శాతం |
| అదిపర్ | అధ్యక్షుడు (అమెరికా అధ్యక్షుడు) |
| ఉలోగం | లోహం |
| అమైచ్చాంగం | మంత్రివర్గం |
| వనవిలంగు | వన్యమృగము |
| మన్దిరకోల్ | మంత్రదండం |
| వాక్కు | ఓటు |
| వాక్కాళర్ (వాక్కు + ఆళర్) | ఓటర్లు |
| కాలం చెన్ఱ | కాలం చేసిన, స్వర్గీయ |
| ఐక్కియ మున్నణి | ఐక్య సంఘటన |

| తమిళం | తెలుగు |
|---|---|
| ఉయరదికారక్కమిట్టి | ఉన్నతాధికార సంఘం |
| విపత్తుక్కుళ్ళాన | విపత్తుకు లోనైన |
| అనుతాపం | సంతాపం |
| కలాచ్చారం | సంస్కృతి |
| వాక్కుమూలం | వాఙ్మూలం |
| చిన్నం | చిహ్నం |
| విజయం | ఆగమనం |
| శిలై | శిలావిగ్రహం |
| ప్రసంగం | ఉపన్యాసం |
| వరుడాంతరం | సంవత్సరాంతం |
| నందవనం | నందనవనం |
| సంసారం | భార్య |
| వివాదం | చర్చ |
| సగా (హా)యం | సహాయం |
| పేచ్చువార్తై | సంభాషణలు |
| సాయంగాలం | సాయంకాలం |
| ముదలాళిత్తువం | పెట్టుబడిదారీ విధానం |

ఇలా వాడుక తమిళంలో ఎన్నో సంస్కృత శబ్దాలు చోటు చేసుకున్నా వాటిని పరిహరించి, తమిళ శబ్దాలనే వాడాలనే ఒక ఉద్యమం లేకపోలేదు. ఇది కొంతవరకూ సమర్థించదగిందే అయినా, వాడుకలో కలిసి మెలిసి పోయిన మాటలను పరిహరించి వాటికి బదులుగా కొత్త మాటలు కల్పించడంగాని, ప్రాచీన వాఙ్మయంలోని మామూల మాటలను వెలికి తీసి వాటినే ఉపయోగించాలని అనుకోవడం గాని అంత సమర్థనీయం కాదు ప్రతి భాషా ఇచ్చి పుచ్చుకొని 'ఇంతింతై వటుడింతయై....' అన్నట్టుగా పెరుగుతుంది. సంస్కృతం కూడా ద్రావిడ భాషల నుంచి ఎన్నో మాటలు స్వీకరించింది. భాష పెరుగుదలకు ఈ యిచ్చి పుచ్చుకోవడం చాలా అవసరం. ఈ దృష్టితో చూచినప్పుడు ప్రచారంలో ఉన్న మాటలను వీలయినంతవరకూ గ్రహించడమే సమంజస మనిపిస్తుంది.

గ్రాంథిక భాషావాదులైన పండితులు సంస్కృత శబ్దరహితమైన శుద్ధ ద్రావిడంలో (తూయ త్తమిళ్) రచనలు చేస్తున్నారు. కాని వ్యావహారిక భాషావాదులైన రచయితలు చాలామంది రచనలలో వాడుకలో ఉన్న సంస్కృత శబ్దాలు క్షీర నీర న్యాయంలా కనిపిస్తాయి.

తమిళ సాహిత్య చరిత్రకు శ్రీకారం చుట్టిన ఘనత సంగయుగానికి చెందుతుంది ఈ యుగంలో వెలుగులోకి వచ్చిన అగనానూరు, పురనానూరు మొదలైన కృతులు స్వతంత్ర రచనలు; తమిళుల ఆచార వ్యవహారాలు, జీవన విధానం మొదలైన వాటిని ప్రతిబింబించే ప్రశస్త దర్పణాలు. కాగా సంగ యుగపు కృతుల వల్ల తమిళ సాహిత్యానికి ప్రాచీనతే కాక ప్రత్యేకత కూడా లభించింది.

సంగయుగంలో వెలిసిన కృతులు స్వతంత్ర రచనలే అయినా, వాటిలో రామ కథకు సంబంధించిన కొన్ని అవాల్మీక గాథలూ, సంస్కృత శబ్దాలూ (తత్సమ, తద్భవాలు) మొదలైనవి చోటు చేసుకోవడం గమనించదగిన అంశం. అనగా అప్పటికే సంస్కృత భాషా సాహిత్యాలు దక్షిణాపథంలో వ్యాప్తిలోకి వచ్చినట్లు నిస్సంశయంగా చెప్పవచ్చు.

ప్రాచీన తమిళ కవులు తత్సమ తద్భవముల రూపంలో సంస్కృత శబ్దాలు స్వీకరించారు. కొన్ని సందర్భాలలో తమిళభాషా సంప్రదాయాలకు అనుగుణంగా సంస్కృత శబ్దాలను తమిళం చేసుకున్నారు.

ఇక ఎట్టుత్తొగై, పత్తుప్పాట్టు మొదలైన సంగకాలపు సంకలన కృతుల నుంచి సేకరించిన కొన్ని తత్సమములను ఈ దిగువ ఉదాహరిస్తున్నాను.

| | |
|---|---|
| అంకుశం | అంతరం |
| అమరర్ (అమరులు) | అంజనం |
| అశోకం | ఆది |

ఇన్దిరన్ (ఇంద్రుడు)
ఉత్తరియం (ఉత్తరీయ)
కటకం
గంగై (గంగ)
కాలన్ (కాలుడు)
గతి (నడక)
సుదై (సుధ)
తిలకం
బూతం (భూత)
మల్లికై (మల్లిక)
యవనర్ (యవనులు)
చటై (జటా)
నగర్, నగరం

ఈశన్
కలాపం
కంటం (కంఠ)
కామం
కాలం
సమం
సికరం (శిఖర)
దిశై (దిశా)
పిండం
యామం
యూపం
తమాలం
నూపురం

ఈ క్రింది తద్భవాలను పరిశీలించండి :

అరసు (రాజ్య)
అమిర్తం, అమిళ్తు (అమృతం)
ఇమయం (హిమాలయం)
అమయం (సమయం)
ఆణై (అజ్ఞా)
ఆత్తిరై (యాత్రా)
ఇయక్కన్ (యక్ష)
ఒట్టకం (ఓష్ఠ-ఒంటె)
కరుమం (కర్మ)
సేమం (క్షేమ)
తన్తై (తాత)
పుణ్ణియం (పుణ్య)
పంగుని (ఫాల్గున-నెల)
విచయ (విజయ)

వచ్చిరం (వజ్ర)
అవై (సభా)
అరమియం (హర్మ్య)
అన్నం (హంస)
అరంగు (రంగ)
ఆరం (హార)
అవుతి (ఆహుతి)
ఎన్దిరం (యంత్రం)
ఓరై (హోర)
కుటుమి (కుటుంబి)
తేఎం (దేశం)
దెయ్వం (దేవ-దైవ)
పవళం (ప్రవాళ)
మేళకం (మేషక)

తమిళ శబ్దాలలో ఆదిని రకారం ఉండదు కాబట్టి రాజ్య, రంగ మున్నగు నవి అరసు, అరంగులుగా మారినవి. అలాగే హకారం తమిళంలో 'అ' గాను, 'ఇ' గాను 'వు'గాను మార్పు చెందింది, (హారతి-ఆరతి, హిమాలయం—ఇమయం మొదలైనవి). వజ్ర శబ్దం వచ్చిరం అయినా, ఉచ్చారణలో వజిరం అవుతుంది. సంస్కృతంలోని సకారం తమిళంలో అకారంగా మారుతుంది. సమయ - అమయం, సభా-అవై.

ఇక కొన్ని సంస్కృత శబ్దాలను తమిళ కవులు ఎలా తమిళం చేసుకున్నది పరిశీలిద్దాము.

త్రయాగ్ని-ముత్తీ (ముత్తీ విళక్కిన్ తుంజం — పురనానూరు)
పంచపాండవులు-పంచవర్ (చెరుమాన్ పంచవర్ ఏఱే — పురనానూరు)
త్రిలోచన-ముక్కణ్ (ముక్కణ్ చెల్వర్ — పుర)
చతుర్వేదములు—నాన్మఱై (నాన్మఱై మునివర్ — పుర)
బ్రాహ్మణ-పార్ప్పన (అవుం అన్ ఇయల్ పార్పన మాక్కళుం — పుర)
శ్రేణి-ఏణి (నళి ఇరుమున్నీర్ ఏణిఆగ — పుర)
నిత్య-నిచ్చం (నిచ్చముం ఒళుక్కం ముట్టవై—పుర)
సంధ్య-అన్తి (అన్తి అన్దణర్ అరుంగడన్ ఇఱుక్కం పుర)

తమిళులవలె మన తెలుగు కవులు కూడా కొన్ని సంస్కృత శబ్దాలను యథాతథంగా స్వీకరించని విషయం పండితులకు తెలిసిందే. అందువల్లనే త్రిలోచన (త్ర్యంబక) శబ్దం తెలుగులో ముక్కంటి అయింది, 'నిత్య'ను మనవారు నిచ్చ, లేక నిచ్చలుగా వ్యవహరించారు, తకారం చకారంగా ఉచ్చరించబడు తున్నది. ఉదా : సత్యం-సచ్యం; సత్యనారాయణ -సచ్యనారాయణ తమిళులు 'సత్తియ' అని ఉచ్చరిస్తారు. వ్రాతలో చత్తియ అని వ్రాస్తారు.

కొన్ని తమిళ శబ్దాలలో ప్రాకృతభాషాచ్ఛాయలు కనిపించడం గమనించ దగిన మరొక అంశం. ఇందుకు నిదర్శనం, దేశ శబ్దం 'తే (దే)ఎం'గా మార్పు చెందడం. పురనానూరులోని 15 వ పద్యంలో నిన్‌తెవ్వర్ తే ఎత్తు అని ఉన్నది. ఆధునిక తమిళంలో 'తే ఎత్తు' తేచత్తుగా (దేశత్తు-దేశముయొక్క)గా మారింది.

కనుక తమిళంలో ప్రవేశించిన తత్సమ తద్భవాలను భాషా దృష్టితో పరిశీలించడం చాలా అవసరం.

ఇక సంగకాలపు కృతులలో కానవచ్చే మరికొన్ని తత్సమ తద్భవాలను పాఠకుల పరిశీలనార్థం ఉదాహరిస్తున్నాను.

కవురియర్ (బహుశః గౌరి నుండి వచ్చిందేమో)
కుమరి (కుమారి) కన్యాకుమారి.
ఉరువం (రూపం)
మునివర్ (మునులు - నాన్ మఱై మునివర్)
చాపం (చాప)
పోకం (భోగ)
మణ్డిలం (మండల)
దణ్డం (దండం)
తామరై (తామరస)
నావాయ్ (నావ-మున్నీర్ వళంగు నావాయ్ పోలవుం-పుర)
నేమి (చక్రం)
ముత్త (ముక్త)
మురచం (మురజ)
నేమియోన్ (చక్రి-కృష్ణుడు; నీలనిఱ ఉరువిన్ నేమియోనుం-పుర)
శాత్తన్ (శాస్త్రా)
ఆదన్ (ఆదిత్య)
కరాం (నక్రం)
తూమం (ధూమకేతు)
పారం (భార)
అవుణర్ (హుళ)
కోట్టై (కోష్ఠ)
మోరియర్ (మౌర్య)
వచ్చిర తటక్కై (వజ్రహస్త లేక పాణి)
చాకాటు (శకట)

అచ్చు (అక్ష)
తూతు (దూత)
పలి (బలి)
వయిరం (వజ్రం)
పూత (పూత-పవిత్ర, పెయ్‌ద పూతనీర్-పుర)
వతువై (వధూ)
అరక్కన్ (రాక్షస)
తూణం (స్థూణ-స్థాణు)

పురనానూరు (పురం+నానూరు) 400 గీతాల సంకలన కృతి. ఈ గీతాలు సంతరించిన కవుల పేర్లు కూడా పరిశీలించదగినవే.

మహాశాత్తనార్ (మహాశాస్తా)
ఉలోచ్చనార్ (లోచనుడు)
దామోదరనార్
బూతనాదనార్ (భూతనాధుడు)
ఉరుద్దిరన్ (రుద్ర)
తిరుత్తామనార్ (శ్రీధామ)
పెరున్దేవనార్ (మహాదేవ లేక దేవదేవ)
కౌశికనార్ (కౌశికుడు)
వాన్మీకియార్ (వాల్మీకి)

పురనానూరు వంటి సంగకాలపు కృతులను కనుక పర్యాప్తంగా పరిశీలిస్తే. పైన పేర్కొన్నవే కాక సాహిత్య సాంస్కృతిక రంగాలకు సంబంధించిన విభిన్న విషయాలు మనకు సుస్పష్టము లవుతాయని నా నమ్మకం.

ఉపసంహారంగా ఒక మాట చెప్పడం అవసరం కేవలం, తమిళ భాషాభిమానం మూర్తీభవించిన పండితులు సంస్కృత శబ్దాల పట్ల సుముఖంగా లేక పోయినా, తమిళ రచయితలు పలువురు తమ రచనలలో సంస్కృత శబ్దాలను ఉపయోగిస్తున్నారు. అలాగే తమిళ పత్రిక, తమిళ సినిమా—మొదలైన రంగాలకు సంబంధించిన వారు కూడా యథోచితంగా సంస్కృత శబ్దాలు వాడుతున్నారు. తమిళనాడులో సామాన్య మానవుడు కూడా బయం, దైరియం,

జొరం (జ్వరం). సందోషం, అదికారి—ఇలా వాడుకలో నిలిచిపోయిన సంస్కృత శబ్దాలను వాడుతున్నారు. కాని కొందరు మాత్రం తమ ఉపన్యాసాలలో కూడా వీలయి నంతవరకూ శుద్ధ ద్రావిడాన్ని ఉపయోగిస్తున్నా రనడం సత్య సన్నిహితం.

తమిళంలో కొన్ని మాటలు అతి సహజంగా వినవస్తాయి ఉదాహరణానికి తిరువణ్ణామలై లోని అమ్మవారిని 'అపీతకుచాంబ' అని సంస్కృతంలో వ్యవహరిస్తే, తమిళులు ఉణ్ణాములై (ఉణ్ణాముల) అనీ, తిరుచిరాపల్లిలోని 'మాతృభూతేశు'ణ్ణి తాయుమానవర్ అనీ వ్యవహరిస్తారు తాయుం ఆనవర్ (తాయుమానవర్) అనగా తల్లియు అయిన వాడని అర్థం అలాగే మధుర మీనాక్షిని అంగయర్కణ్ణి అని తమిళులు వ్యవహరిస్తారు. ఉణ్ణాములై, తాయుమానవర్, అంగయర్కణ్ణి (అంగయ కన్య, అంగయ కన్యాంబ అని మన తెలుగు కవులు ఉపయోగించారు)] మొదలైన యీ పేర్లు తమిళంలో సహజంగా, సరళంగా ఉన్నాయి. కనుకనే యివి ప్రజల నాలుకల మీద నిలిచి వున్నాయి. *

* ఈ వ్యాస రచనలో నాకు తోడ్పడిన సుప్రసిద్ధ తమిళరచయిత యశశ్శకీరులు త. నా. కుమారస్వామిగారికి కృతజ్ఞుణ్ణి.

# తమిళ వేదం

జ్ఞాన సంపన్నుడైన మానవుడు ధర్మార్థ కామ మోక్షములను సాధించాలని మన పెద్దలు ఆదేశించారు. ఈ పురుషార్థాలకు గల ప్రాశస్త్యాన్ని కళ్ళకు కట్టేలా తెలియజేసే ఉద్గ్రంథం ఒకటి తమిళంలో ఉన్నది. దాని పేరు తిరుక్కురళ్. రెండు పాదాల పద్యానికి కురళు అని పేరు. మొదటి పాదంలో నాలుగు గణములూ, రెండవ పాదంలో మూడు గణములూ శుంటాయి తిరు శబ్దం పవిత్రతను సూచిస్తుంది కనుక, తిరుక్కురళ్ పవిత్ర గ్రంథ మని భావించడం సమంజసం.

తమిళ సాహిత్యాకాశంలో ధ్రువ తారగా ప్రతిభాసిస్తున్న యీ ప్రశస్త రచనకు ముప్పాల్ (త్రివర్గము), తమిళ్ మరై (తమిళ వేదము), ఉత్తర వేదం, దెయ్‌వ నూల్ (దివ్య గ్రంథము, పొయ్యామొళి (యథార్థ కావ్యము), పొదుమరై (విశ్వజనీన వేదము) మొదలైన పది పేర్లు ఉన్నాయి, ధర్మార్థ కామములను ప్రధానంగా వివరించే గ్రంథం కావడం వల్ల, దీనిని తమిళ వేదంతోపాటు త్రివర్గ మనీ వ్యవహరించడం సహేతకమూ సముచితమూను,

సార్వజనీనమూ సార్వకాలికమూ అయిన యీ రచన తమిళ వేదంగా ప్రసిద్ధి కెక్కడంలో ఆశ్చర్యం అణుమాత్రమైనా లేదు. ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని పలువురు పండితులూ కవులూ నాడు నేడూ వివరించారు. 'అణువును తొలిచి అందులోకి సప్త సముద్రాలూ చొప్పించి, తర్వాత ఆ అణువుని చీల్చి అందు లోంచి ఒక భాగాన్ని కురళుగా తీర్చిదిద్దినాడు తిరువళ్ళువర్' అని ఒక ప్రాచీన తమిళ కవయిత్రి పేర్కొన్నది. రజత పాత్రలో పొదగబడిన స్వర్ణ ఫల మని ఒక సహృదయుడు ప్రశంసించాడు. మరో సహృదయుడు తత్కర్తను విశ్వ కవిగా అభివర్ణించాడు.

తమిళ వేదమైన తిరుక్కురళుని వెలయించిన మహాకవి తిరువళ్ళువర్ అనే మహనీయుడు. కురళుకి నామాంతరాలు ఏర్పడినట్లుగానే, వళ్ళువరుకి కూడా పూజనీయుడు (నాయనార్), మహా పండితుడు (పెరునావలర్), దైవాంశ గల కవి (దెయ్‌వ ప్పులవర్) మొదలైన పేర్లు ఏర్పడ్డాయి, కాని అయన అసలు పేరే మిటో నేటికి తెలియరాక పోవడం శోచనీయం.

వళ్ళువర్ అనే మాటకు చాలా అర్థాలు చెపుతారు. ఆది ద్రావిడులలో పురోహితవృత్తి ననలంబించిన వారిని వళ్ళువులని వ్యవహరిస్తారు. ప్రాచీన కాలంలో ఏను గెక్కి, నగారా మోగిస్తూ, రాజాజ్ఞలను తెలియజేసే వారిని వళ్ళువు లని పిలిచేవారట. శకునాలను పురస్కరించుకుని భవిష్యత్తు నూహించి చెప్పే వారిని కూడా వళ్ళువు లని వ్యవహరించేవారు మరి తిరుక్కురళు కర్త ఏ వర్ణానికి చెందిన వాడో యిదమిత్థమని చెప్పలేము. వళ్ళువర్ శైవు డని కొందరి అభిప్రాయం. కొందరి దృష్టిలో ఆయన జైన మతా వలంబకుడు తిరుక్కురళు లోని తొలి పద్యం ఈ అభిప్రాయాన్ని కొంతవరకు బలపరుస్తున్నది,

అగర ముదల ఎళుత్తెల్లాం ఆది
బగవన్ ముదట్రే ఉలగు.
(ఆది అకారము అక్షర తతికి;
ఆదియౌ భగవాను డఖిల జగతికి )

భగవన్ అంటే సర్వజ్ఞుడు. కేవల జ్ఞాని అని అర్థం. ఇది ఆది తీర్థంకరు డైన వృషభదేవుని సూచిస్తున్న దని కొందరు విశ్వసిస్తున్నారు కనుక వళ్ళువర్ జైనుడై ఉండవచ్చు నని వారి అభిప్రాయం,

వళ్ళువర్ కాలమును గురించి కూడా భిన్నాభిప్రాయాలు లేక పోలేదు. ఏది యెలా ఉన్నా, ఆయన అతి ప్రాచీను డని నిస్సందేహంగా పేర్కొన వచ్చు. బహుశః క్రీస్తుశకం తొలి మూడు శతాబ్దులలో జీవించి వుండవచ్చు.

తమిళ వేద కర్త మదరాసులోని మైలాపూరులో ప్రభవించినట్లు పండితాభిప్రాయం. మైలాపూరులో వళ్ళువర్ ఆలయం ఒకటి నేటికీ ఉండడం గమనించ దగిన అంశం అయితే దాన్ని పూర్వం నాయనార్ గుడి అని వ్యవహరించే వారనీ, నాయనార్ శబ్దం జైన మతస్థులు పూజించే తీర్థంకరుల్నీ జైన మునుల్నీ సూచిస్తున్న దని కొందరి అభిప్రాయం. నేత వృత్తిని ఆధారంగా చేసుకుని వళ్ళువర్ జీవయాత్ర సాగించినట్లూ, సముద్ర వ్యాపారీ సహృదయుడూ అయిన ఏలేల సింగన్ అనే అతని అండదండలు లభ్యమైనాయనీ ఒక కథ వాడుకలో ఉంది, తిరువళ్ళువర్ సహధర్మచారిణి పేరు వాసుకి. సర్వ విధాల భర్తకు తగిన సాధ్వి ఆ ఉత్తమ చరిత! ప్రేమైక జీవులైన ఆ దంపతుల సాంసారిక జీవితం సౌఖ్య ప్రదంగా సాగిందని వేరే చెప్పనవసరం లేదు. వారికి సంబంధించిన కమ్మని కథలు ఈనాటికీ ప్రచారంలో ఉన్నాయి,

ఒకనాడు ఒక సన్న్యాసి వళ్ళువర్ యింటికి వచ్చాడట. గృహస్థాశ్రమంలో నిజంగా సౌఖ్య మున్నదా? అనే విషయాన్ని తెలుసుకోవాలని ఆయన అభిలాష. అయితే వళ్ళువర్ బదులేమీ చెప్పలేదు కొన్నాళ్లపాటు తమ యింట్లో ఉండి, తన ఆతిథ్యం స్వీకరించవలసిందిగా వినయ పూర్వకంగా అర్థించాడు. అందుకు ఆ సాధువు సరే అన్నాడు.

ఒకరోజు వళ్ళువర్ చద్ది తింటూ భార్యను పిలిచాడు అప్పుడామె పెరట్లో బావివద్ద ఉంది. భర్త పిలుపు చెవిని పడిందో లేదో, తోడుతున్న కుండను కూడా అలాగే విడిచిపెట్టి ఆమె భర్తదగ్గరకి వచ్చింది. అప్పుడు వళ్ళువరు "ఈచద్ది చాలా వేడిగా వుంది. కొంచెం విసురు" అన్నాడు. ఆమె మారుమాట్లాడ లేదు. విసనకఱ్ఱ తెచ్చి విసరసాగింది. ఆమె విసురుతున్నంత సేపూ దొంతరలు దొంతరలుగా పొగలు పైకి వచ్చాయట! ఆ తర్వాత ఆమె బావివద్దకు వెళ్ళి చూడగా, కుండ తాను విడిచినచోటనే వుందట!

ఇటువంటి దృశ్యాలను వళ్ళువర్ యింట్లో చూచిన ఆ సన్న్యాసి "వాసుకి వంటి యిల్లాలు కనక లభిస్తే, ఆ సంసారం స్వర్గం కాక మరేమవుతుంది" అనుకున్నాడు, మనస్సులో.

వాసుకి మరణించిన తర్వాత వళ్ళువర్ సన్న్యాసం స్వీకరించినట్లూ ఆమెపై ఆయన ఈ కిందిపద్యం చెప్పినట్లూ తెలియవస్తున్నది.

తీయని బువ్వకంటె కడు తీయనిదానవు, కాళులొత్తుచున్
రేయి బరుండి తామసిలి తేపకడన్ వడి లేచుదాన, వ
య్యో! యలినీలవేణి, యెటులోర్తును, నిన్నెడబాయు నాదు కం
దోయికి నిద్ర పట్టదు, మనోహరభాషిణి! ప్రేమరూపిణీ!

(చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి)

గృహస్థాశ్రమం మహోత్కృష్టమైనది— అనే విషయాన్ని వళ్ళువర్ జీవితచరిత్రేకాదు, ఆయన కృతి కూడా స్పష్టం చేస్తున్నది బ్రహ్మచారులకూ, వానప్రస్థులకూ, సన్న్యాసులకూ, అనాథలకూ, నిర్ధనులకూ గృహస్థు ఏడుగడ. తన విధ్యుక్తధర్మములను సక్రమంగా నిర్వర్తించే గృహస్థు సంఘంలో భగవంతుడుగా భావించబడతాడు—అని ఒకచోట ఆయన పేర్కొన్నాడు,

తిరుక్కుఱళులో తొలిఖండమైన ధర్మవిభాగంలో గృహస్థాశ్రమము, సన్న్యాసాశ్రమము, ఆత్మనిగ్రహం, సజ్జనుని హృదయం, మధురభాషణం

తపస్సు, యశస్సు, సత్యము, దానము, విధి మొదలైనవాటిని గురించి ఎన్నో విషయాలు మధురమనోజ్ఞంగా చెప్పబడినవి. ధర్మం, దయాగుణం, ప్రేమ, విధ్యుక్తధర్మ నిర్వహణ మొదలైనవి మానవుని లక్ష్యములై ఉండాలి. ఆత్మ నిగ్రహం స్వర్గానికి దారి చూపుతుంది. నిగ్రహించబడని వాంఛ అగాధమైన చీకటిలోయను చూపుతుంది. మనోనిగ్రహంగల వ్యక్తిని సందర్శించేందుకు ధర్మ దేవత అభిలషిస్తూ వుంటుంది. భూదేవివలె మానవుడు సహనశీలుడై ఉండాలి. నేలలో గోతులు తీసేవారిని కూడా భూదేవి క్షమిస్తున్నది, గొప్పతనమంటే యిదే! దరిద్రులైనవారికి ఇచ్చేదే దాన మవుతుంది; ఇతరుల కిచ్చేది అప్పివ్వడం వంటిది. మరణం కంటె దుఃఖతరమైనది మరొకటి కనిపించదు, కాని ధర్మం చేసే శక్తిలేనివానికి మరణం సంతాపహేతువు కాదు. దానశీలుడైన సజ్జనుని హదయం ఊరిమధ్య వుండే ఫలవృక్షం వంటిది. జలమయమైన తటాకంవలె సజ్జనుని సంపద ఇతరులకు ఉపయోగపడుతుంది. మధురభాషణం మానవునికి సుభూషణం. తియ్యనిమాట లెన్నో వుండగా, వాటిని విడిచిపెట్టి, కటువుగా మాట్లాడడం మంచిది కాదు. ఇది ఎలా వున్నదంటె, పండిన పండును విడిచిపెట్టి, పచ్చ కాయను కోరుకున్నట్టుగా ఉంటుంది.

ఇక వళ్ళువర్ చిత్రించిన గృహిణిని చూద్దాము. సహధర్మచారిణి గుణవతి అయితే, అప్పుడు దారిద్ర్యానికి ఆస్కారం లేదు. గుణవతి కానప్పుడు సిరి సంపద లుండి మాత్రం లాభమేమిటి? శీలవతి అయిన సతీతిలకం కంటె సౌందర్యవంతమైన వస్తువేది? శీలవతికిగల శక్తిని వళ్ళువర్ ఇలా వర్ణించాడు.

దెయ్వన్ తొళా అళ్ కొళునన్ తొళుదళువాళ్
పెయ్యెన ప్పెయ్యుం మళై
(పరదైవముల వీడి పతిగొల్చుచాన
కురియు మన్నంతనే కురియదే వాన.)

ధర్మఖండంలో గృహస్థాశ్రమమునూ సన్న్యాసాశ్రమమునూ గురించి చెప్పినట్లుగా, అర్థఖండంలో వళ్ళువర్ పాలకులకూ పాలితులకూ మధ్య ఉండవలసిన సంబంధాలను చక్కగా వివరించాడు.

రాజు కఠినోక్తులాడి ప్రజలను బాధించకూడదు. తనను నిందించేవారిని కూడా అతడు మన్నించాలి. అధర్మమును అరికట్టాలి. వానకోసం ఆకాశం వంక

చూచేటట్లు, తమ రక్షణకోసం ప్రజలు రాజదండం వైపు చూస్తారు. జయలక్ష్మిని తెచ్చేది కరవాలం కాదు; రాజదండం, అయితే అది ఏవైపుకి మొగ్గక నిటారుగా ఉండాలి. న్యాయపరిపాలనమే కీర్తికి మూలకారణం. అధర్మపరిపాలన అపకీర్తికి దారి తీస్తుంది.

దేశమును గురించి వళ్ళువర్ వెలిబుచ్చిన అభిప్రాయాలు ప్రభాతస్మరణీయాలు. బంగారుపంటలకు కాణాచియై, సాధువులకూ శ్రీమంతులకూ నివాసస్థానమై విలసిల్లేదే దేశం దేశద్రోహులు, హంతకులు కరవుకాటకాలు, కలహించుకునే వర్గాలు లేనిదేశమే దేశం ధనము, సత్యసంపద, భద్రత, సౌఖ్యము, వ్యాధిభయం లేకుండుట—మొదలైనవి రాజ్యరమకు అమూల్యాభరణాలు వళ్ళువర్ దృష్టిలో కర్షకుడు చాలా విశిష్టుడు. వ్యవసాయం చాలా గొప్పది. ప్రపంచమంతా కర్షకుని మీదనే ఆధారపడివుంది. కృషిచెయ్యనివారిని కూడా పోషించేది కర్షకుడే. అటువంటి కర్షకుడు కనుక చేతులు ముడుచుకొని కూర్చుంటే, సర్వసంగపరిత్యాగం చేసిన సాధు పుంగవులు కూడా బాధలకు లోనవుతారు. కృషిచెయ్యకుండా తన పేదరికాన్ని తలచుకొని కంటతడిపెట్టే నిర్భాగ్యుణ్ణి చూచి పొలము పడతి నవ్వుతుంది.

తిరువళ్ళువర్ కవితాశక్తినీ కల్పనా చాతురినీ గురించి తెలుసుకునేందుకు కామఖండం ఎంతైనా తోడ్పడుతుంది. ఆయన వర్ణించింది ధర్మబద్ధమైన కామం, ఈ ఖండంలో ప్రేయసీ ప్రియుల ప్రథమ సమాగమం, ఆతర్వాత దురదృష్టవశాత్తూ వారికి ఏర్పడే వియోగం మొదలైనవి వర్ణింపబడినవి, ప్రేమ సంతోష సాగరం వంటిది. కాని వియోగంవల్ల కలిగే దుఃఖం ఆ సాగరాన్ని మించుతుంది. పూర్వస్మృతుల్ని గుర్తుకి తెచ్చుకునేటప్పుడు కూడా ప్రేమ సంతోషదాయకంగా ఉంటుంది. ప్రేమ సుమకోమలము, ఆ మృదుత్వాన్ని గ్రహించి, సుకుమారంగా సంరక్షించుకునేవారు కొద్దిమందే వుంటారు.

'సదమల ప్రేమ పుష్పముకంటె మృదుల,
మది గ్రహించి భరించు ముదితాత్ము లరిది'.

ఈ విధంగా తిరుక్కుఱళలో ధర్మార్థకామములను గురించి ఎన్నో విషయాలు చెప్పబడినవి. మానవుడు ధర్మపథం అనుసరించాలి. అప్పుడే అతనికి శాశ్వత సౌఖ్యం లభిస్తుంది. కామక్రోధ మోహములు మానవుని కష్టాలకు కారణ

భూతములు. ఇవి తొలగినప్పుడే కష్టజలధినుంచి అతడు గట్టెక్కుతాడు — ఈ విషయాన్ని వళ్ళువర్ ఇలా స్పష్టం చేశాడు

కామం వెగుళి మయక్కం—ఇవై మూన్దిన్
నామం కెడక్కెడుం నోయ్.

తిరుక్కుఱళును చదివిన తర్వాత ప్రధానంగా స్ఫురించే విషయాలలో ఇదొకటి అని చెప్పవచ్చు. తిరుక్కుఱళ్ వెలసిననాటినుంచీ తమిళంలో ఎన్నో వ్యాఖ్యానములు వెలసినవి. ప్రాచీనవ్యాఖ్యలలో పరిమేలళగర్ వ్రాసినది ప్రశస్తమైనదని పండితుల విశ్వాసం. ఆధునికులు కూడా ఈ ఉద్గ్రంథానికి వ్యాఖ్యలెన్నో వెలయించారు ఈ నీత్యుద్బోధక రచనకు వచ్చినంత ప్రచారం మరియే యితర తమిళ రచనకు రాలేదనడం సత్య సంపూర్ణం.

గంభీర హృదయుడైన తిరువళ్ళువర్ పిల్లల తొక్కు పలుకులకే కాదు, వారి చిట్టి చేతులను చూసి కూడా మురిసిపోయి యిలా పేర్కొన్నాడు

'చిట్టి చేతుల తోడ చిటిపాడ కలుపు
పట్టె డన్నమె సుధాప్రాయమై తనుపు.'

పురాకృత కర్మల ననుసరించి సంతానం కలుగుతుందని ఆయన విశ్వాసం. జన్మదాత అయిన తండ్రికి కొడుకు వల్ల మంచి పేరు కలుగుతుంది. అయితే యెప్పుడు? ఆహా! యిటువంటి కుమార రత్నాన్ని పొందడానికి ఆ తండ్రి ఎలాంటి నోములు నోచాడో కదా—అని ఊరివారు మెచ్చుకున్నప్పుడు. అదే తనయుడు తండ్రికి చేసే ఉపకృతి

తనయుడు జనకుని కొనరించు మే 'లి
తని పొంద ఏమి నోచెనొ తండ్రి' యనుట

ప్రతి మానవుడూ దయార్ద్రచిత్తుడై ప్రేమను ప్రదర్శించాలని తిరువళ్ళువర్ ఆదేశించాడు ఆయన మానవతాదృష్టికి ఈ భావం పునాది వంటిది. ప్రేమ రహితులు తమకు మాత్రమే ఉపయోగపడతారనీ, ప్రేమ గలవారు సంఘానికి ఉపయోగపడతారనీ ఆయన పేర్కొన్నాడు ప్రేమ రహితుల్లో స్వార్థచింతన ఉంటుంది ప్రేమగలవారు విశాల భావసమన్వితులై వ్యవహరిస్తారు. వారికి స్వార్థ చింతనకూ చుక్కెదురు! వారిలో త్యాగ దృక్పథం నెలకొని వుంటుంది. కనుకనే వారు సమాజానికి సహాయపడతారు. ఆయన ఇంకా అన్నాడు గదా! ప్రేమ

వల్లనే జీవితానికి సార్థకత అంటూ యేర్పడుతుంది; ప్రేమ రహితులు తోలు కప్పిన ఎముకల గూళ్ళు—కాగా, ప్రేమ తత్త్వం అతి విశిష్ట మయింది. ఆ తాత్త్విక కవీశ్వరుని మాటల్లో చెప్పాలంటే:

"ఎల్ల అంగము లుండి యేమి లాభమ్ము
ఉల్లము ప్రేమకు ఉనికి కానపుడు?"

దయాభరితమైన యీ ప్రేమ మానవుడికి సహజంగా కలగాలి కాని తెచ్చి పెట్టుకున్నదిగా వుండకూడదు. అంతేకాక ప్రత్యుపకారాన్ని ఆశించే ప్రేమగా వుండకూడదు అలాంటిదే నిజమైన ప్రేమ; ఆ ప్రేమనే వళ్ళువర్ పదే పదే ప్రశంసించాడు. ఒక పద్యంలో ఆయన అన్నాడు గదా! స్వర్గం లభించినా పుచ్చుకోవడం మంచిది కాదు; స్వర్గం లభించకున్నా యివ్వడమే మేలు—అని దయాభరిత హృదయుడై ఒకరికి యివ్వాలి కాని, ప్రత్యుపకారాన్ని యే మాత్రమూ ఆశించకూడదు; ఆయివ్వడాన్ని కూడా ప్రేమతో యివ్వాలి. ఈ సందర్భంలో వళ్ళువరే చెప్పిన యీ కమనీయ సూక్తిని గుర్తు చేసుకోవాలి.

'కసరి యిచ్చిన దానికంటె-రమ్యోక్తి
పసమించు మోముతో పలుకుటే రక్తి'.

ప్రేమ కలిగి వుండడమేకాక ప్రేమతో మాట్లాడాలని కూడా వళ్ళువర్ ఆశించాడు. కఠినోక్తులు అవాంఛనీయము లన్నాడు.

సరసోక్తి ఎంత శ్రేయోదాయకమో, మందహాసం కూడా అంత అవసర మని వళ్ళువర్ అభిప్రాయం నవ్వడం తెలియని వ్యక్తికి ఈ విశాల విశ్వం పట్ట పగలే అంధకార బంధురంగా కనిపిస్తుంది—అని ఆయన స్పష్టం చేశాడు, కనుక ప్రతి వ్యక్తీ నవ్వడం నేర్చుకుని, కష్టాలను ఆ నవ్వులో విస్మరించాలన్నది ఆయన అభిమతం. కష్టాలు కమ్ముకున్నప్పుడు నవ్వుతూ వుండాలని వళ్ళువర్ అభి ప్రాయం.

తాత్త్వికుడే అయినప్పటికీ, వళ్ళువర్ ఎన్నడూ కూడా వాస్తవ దృష్టిని మరిచిపోలేదు, కనుకనే యీ లోకంలోని సుఖ దుఃఖాలను కష్ట నష్టాలను ఆయన విస్మరించలేక పోయాడు, తట్టుముట్టాడే పేదరికంతో సంసారయాత్ర సాగించే వారిని చాలా మందిని చూసి వుంటాడు. వారిని చూసి కన్నీరు కార్చాడు పేదరికం

కంటే బాధాకరమయింది ఏది ? అని ప్రశ్నించుకుని, ఆయనే అందుకు బదులు చెప్పాడు ఒక పద్యంలో. పేదరికం కంటె బాధాకరమయింది పేదరికమే అన్నాడు తిరువళ్ళువర్.

విజ్ఞాన సముపార్జనలో పాలకుడు అప్రమత్తుడై ఉండాలి. అధర్మపరుడైన పాలకుడు క్రమ క్రమంగా తన రాజ్యలక్ష్మిని కోల్పోతాడు. ఆతని సిరిసంపదలు నశించడానికి ముఖ్య కారణం కష్టచరితుల కన్నీరే. న్యాయ పరిపాలన కీర్తికి మూల స్తంభం. అధర్మ పరిపాలన అపయశస్సుకి హేతువవుతుంది. క్రూరాత్ముడైన వాని పాలనలో దరిద్రుడి కంటె ధనికుడే దురవస్థకు పాల్పడుతున్నాడు. ఇలా తిరువళ్ళువర్ పేర్కొన్నాడు.

తిరువళ్ళువర్ దృక్పథంలో వ్యవసాయం అతి ప్రధానమయింది. అన్ని వృత్తులకూ అది తలమానికం. ఈ లోకానికి ఆహార మిడుతున్న మహనీయుడు కర్షకుడు, భూమిని దున్ని జీవించే వారే జీవిస్తున్నట్టు భావించాలి. మిగిలిన వృత్తుల వారు వారి మీద ఆధారపడి జీవిస్తున్నారు. ఈ కురళ చూడండి :

"చేను దున్నెడు వారె జీవించువారు
కాని, తక్కొరు వారి గడన కాశింత్రు".

తిరువళ్ళువర్ వివరించిన ప్రధాన భావాలలో ఒకటి అహింసాతత్త్వ ప్రాధాన్యం.

సర్వభూతముల యందు గౌరవాభిమానాలు ఏర్పడడానికి అహింసాతత్త్వం ఎంతైనా దోహదం చేస్తుంది. అహింసను ఒక ధర్మంగా అవలంబించాలి, హింస పాపానికి దారితీస్తే, అహింస సుఖశాంతులకు కారణభూత మవుతుంది. ఈ వివిధ విషయాలను మనస్సులో వుంచుకొని కాబోలు, హింస చేయకుండా వుండడం పరమ ధర్మమనీ, సకల దోషాలకు హింస కారణమనీ వళ్ళువర్ యిలా తెలియ జేశాడు :

"హింస సలుపమి అహీన ధర్మమ్ము,
హింస కారణ మన్ని దోసములకును."

తిరువళ్ళువర్ ధర్మజ్ఞులను బహుధా ప్రశంసించాడు. ఆయన వారిని 'శాన్రోర్' అని వ్యవహరించాడు. ధర్మజ్ఞులకు విధిగా జ్ఞానం, సార్వజనీనప్రేమ, అందరికీ సహాయపడాలనే ఆశ, అనుకంప, సత్య భాషణం - వుండాలని ఆయన

అభిప్రాయం. ఈ విశిష్ట గుణాలు వున్నవారే ధర్మజ్ఞు లవుతారు వారు ప్రేమ మూర్తులు అపకృతి చేసిన వారికి సైతం వారు ఉపకారం చేస్తారు. ఈ విశిష్ట గుణం కనుక లోపిస్తే, ధర్మజ్ఞులకు కళంకం ఏర్పడినట్లే. ప్రళయ కాలంలో కూడా వారు తమ ధర్మాలను విసర్జించరు పైగా చలించరు కూడా. అటువంటి మహనీయుల వల్లనే యీ లోకం నిలువ గలుగుతోంది. ధర్మజ్ఞులలో అహంకారం మచ్చుకైనా కనిపించదు. తన, మన అనే భావానికి అతీతులుగా ఉంటారు వారు. తమకంటె తక్కువవారి చేతిలో ఓటమి సంభవించినా, ఆ విశిష్టగుణ సంపన్నులు సహర్షంగా ఆ పరాభవాన్ని స్వీకరిస్తారు ఒక వేళ అలాంటి ధర్మజ్ఞులు తమ విశిష్టగుణాలను విసర్జిస్తే, అప్పుడు భూమి కూడా అందరినీ భరిస్తున్న తన ధర్మము నుంచి తప్పుకుంటుంది. కాగా, ప్రపంచ గతికి ధర్మజ్ఞులు ప్రదాన కారణ మవుతున్నారు.

"ధర్మ మూర్తులు గతి తప్పి నడిచిన
ధర్మమ్ము తప్పును ధరణి సైతమ్ము"

మానవుడు ధర్మజ్ఞుడు కావడానికి ప్రయత్నించాలి. అంతకు ముందు అతను గృహస్థుగా తన విధ్యుక్త ధర్మాలను ఆచరించాలి, ఆ తర్వాత త్యాగ బుద్ధి అలవరుచుకోవాలి. అయితే గృహస్థు నిర్వర్తించ వలసిన ధర్మాలేమిటి? తిరువళ్ళువర్ ఇలా పేర్కొన్నాడు :

"మనసులో చేర్చకు మలినత, ధర్మ
మనగ అదియె, పెర ఆడంబరమ్ము."

మనస్సుని మాలిన్యరహితంగా ఉంచుకోవడమే విశిష్ట ధర్మమనీ, యితర ధర్మములన్నీ వట్టి ఆడంబరాలనీ ఆయన అభిప్రాయం,

ఇలా తమిళ వేదకర్త జ్ఞానం, నీతి, కామం మొదలైన ఎన్నో విషయాలను గురించి వివరించాడు.

ఒక ప్రాచీన తమిళ కవి తిరువళ్ళువర్ మహాకవిని గురించి చేసిన ప్రశంసను ఆధారంగా చేసుకుని శ్రీ చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారు చెప్పిన పద్యం పరిశీలనార్హం.

'కొంచెపు నీటిబిందువున
గోచరమైన మహా తరుక్రియన్

సంచిత పుణ్యరాశి యన
జాలిన తావక భావజాల మ
భ్యంచిత రీతిమై ద్విపద
లందె కుదించి రచించి నట్టి నీ
యంచిత పుణ్యమూర్తికి జొ
హారు లివే—తిరువళ్ళు మహాకవీ !

త్రవ్విన కొలది చెలమ నేర్పడిన నీర
మట్లు, చదివిన కొలది భావైక రాశి
నలరు భవదీయ సత్కవితామృతాప్తి
పారమే లేదు రసిక ప్రపంచమునకు.''

తమిళ వేదంలోని సూక్తులు సుధారసోక్తులే కాక స్వభావోక్తులు కూడా, అందువల్ల అవి విభిన్న భాషల వారికి, విభిన్న సంస్కృతుల వారికి శిరోధార్యములు కాగలిగాయి. కురళు పెక్కు ప్రాచ్య పాశ్చాత్య భాషలలోకి పరివర్తితమై సహృదయుల్ని అలరిస్తూ వుండడం హర్షించదగిన అంశం. శ్రీయుతులు కనుపర్తి వేంకటరామ విద్యానందనాథులు, గరిమెళ్ల సత్యనారాయణ, పూతలపట్టు శ్రీరాములు రెడ్డి, చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి ప్రభృతులు తిరుక్కురళును పూర్తిగానో లేక కురళులోని కొన్ని భాగాలనో తెలుగు చేసి, తమిళ వేద ప్రాశస్త్యాన్ని తెలుగు వారికి తెలియజేశారు.

ఇక, కురళుకి నేను చేసిన అనువాదంలోంచి కొన్ని ద్విపదల్ని ఉదాహరిస్తున్నాను.

దైవ స్తుతి :

చదివిన ఫలమేమి సర్వజ్ఞు పుణ్య
పదముల భక్తితో ప్రణుతింప కున్న ?
అణచిన అయిదింద్రి యమ్ములవాని
వినుతించువారు జీవింత్రు పెక్కేండ్లు,

గార్హాస్థ్యము :

ధర్మ సంబద్ధులై తనరు మువ్వురకు
నిర్మలు డౌగేస్తు ఁక్కంపుదిక్కు,
తన ధర్మమున నిల్చి మునులకు సాయ
మొనరించువాడెపో మునికంటె ఘనుడు.

సహానము :

తనను త్రవ్వినవారి ధర సైచునట్లు
తనను నిందించువారిని సైప వలయు.
హాని సహించుట అత్యుత్తమంబు;
దాని మరచుట అంతకు మించి లెస్స.

పాప భీతి :

పగ యెట్టి దైనను బ్రతుకంగవచ్చు;
పగబట్టి హతమార్చు పాప మను పగ.
వీడక తిరిగెడు నీడను వోలె
వీడదు పాపమ్ము వెంట తిరుగుచు.

విద్య :

నేర్చుట మంచిది నేర్వ దగినవి;
నేర్చినట్లు నడత నిల్చుట మేలు.
కలవు కండ్లు చదువు గలవారలకు; వి
గిలిన వారికి పుండ్లు కలవు మొగాన.

పురుష ప్రయత్నము :

జతనమ్మున గలుగు చాలభాగ్యమ్ము;
జతనమ్ము లేకున్న సంపద చెడును.
ఎవరికి దుర్విధి అవమతి కాదు;
అవమతి యగు ప్రయత్నమ్ము లేకున్న.

# ప్రజాకవయిత్రి అవ్వైయారు

ప్రాచీన తమిళవాఙ్మయంలో నీతిప్రధానంగానూ వేదాంతపరంగానూ సంతరించబడిన రచనలు కోకొల్లలు. ఒక్క తమిళంలోనే కాదు, ప్రధానమైన భారతీయ భాషలన్నిటిలోనూ ప్రాచీన వాఙ్మయం చాలా వరకు నీత్యుద్బోధకంగా ఉన్నట్లు కనిపిస్తుంది. భౌతిక వాదానికి బహుళప్రచారం లభిస్తున్న యీరోజులలో కూడా మనదేశంలో తాత్త్విక రహస్యాలకు ఎంతో విలువ లభిస్తున్నది. అటువంటప్పుడు ధర్మాసనమని పేరుపెంపులు గడించుకున్న ప్రాచీన భారతంలో వ్యాప్తికి వచ్చిన వాఙ్మయం ముఖ్యాలు మువ్విసం నీతి ప్రధానంగాను, వేదాంత పరంగాను ఉండడంలో ఆశ్చర్యం లేదు.

తమిళంలో నీత్యుద్బోధకంగా వెలువడిన గ్రంథాలలో తిరుక్కురళ్, నాలడియార్, అవ్వైయార్ సుభాషితాలు మొదలైనవి ముఖ్యంగా పేర్కొనదగినవి.

కురళ్‌కర్త అయిన తిరువళ్ళువర్ వలె చిరయశస్సు సముపార్జించిన మహాకవయిత్రి అవ్వైయార్. ఆమె తిరువళ్ళువర్ సహోదరి అనే కథ ఒకటి వాడుకలో ఉన్నది.

అమ్మకు రూపాంతరం అవ్వ. ఆర్ గౌరవ వాచకంగా వాడబడుతున్నది. కాగా, అవ్వైయార్ అనే మాటకు పూజ్యురాలని అర్థం. అంతే తప్ప ఆ కవయిత్రి అసలు పేరేమిటో యింతవరకూ తెలియ రాలేదు, ఆమె కాలం మొదలైన విషయాలు కూడా ఇదమిత్థమని తెలియలేదు. కాని యీ విషయాలకు సంబంధించిన పుక్కిటి పురాణాలు మాత్రం ప్రచారంలో ఉన్నాయి,

మచ్చుకి ఒక కథ :

ఒకసారి అవ్వైయార్ సుభాషితాలు వినాలనే అభిలాష కలిగిందట కుమారస్వామికి ! అప్పు డాయన ఆలకాపరి వేషం ధరించి ఒక నేరేడు చెట్టు మీద కూర్చున్నాడు. సరిగ్గా ఆ సమయానికి అవ్వై అక్కడికి విచ్చేసింది. ఆమె దృష్టి చెట్టు మీద కూర్చున్న ఆలకాపరి మీద పడింది.

"నాయనా ! నాలుగైదు పళ్ళు కోసి కింద పడేస్తావా ?" అని ఆమె అడిగింది.

'చల్లనివా, వేడివా ?' అమాయకంగా అడిగాడు ఆలకాపరి వేషంలో ఉన్న ఆరుమొగముల సామి.

వీడెవడో పిడుగులా ఉన్నాడనుకుంది అవ్వై. వేడి పళ్ళే కావాలి నాయనా అని బదులు చెప్పింది.

వెంటనే మంచి పండొకటి పైనుంచి కింద పడింది. దానికి అంటుకున్న మట్టిని దులిపేందుకు అవ్వై ఉఫ్ ఉఫ్ అంటూ ఊదసాగింది.

అది చూసి కుమారస్వామి 'అవ్వా! జాగ్రత్తగా తిను. నోరు కాలేను' అని నవ్వాడు. ఆ మాటల్లోని చమత్కారాన్ని ఆమె గ్రహించకపోలేదు.

ఇటువంటివే మరికొన్ని కథలు వాడుకలో ఉన్నాయి

అవ్వైయార్ పేరుతో ఇద్దరు ప్రసిద్ధ కవయిత్రులు తమిళ వాఙ్మయ చరిత్రలో కనిపిస్తారు.

ఒకరు క్రీస్తుకు పూర్వం వర్ధిల్లినట్లు చెప్పబడుతున్న సంగయుగంలోనూ, మరొకరు క్రీస్తుశకం పది లేక పన్నెండవ శతాబ్దిలో జీవించినట్లు పండితుల అభిప్రాయం.

సంగయుగంలో వర్ధిల్లిన అవ్వైయార్ రచించినవిగా చెప్పబడే కొన్ని పద్యాలు ప్రాచీన తమిళ కావ్యాలలో చోటు చేసుకున్నాయి, తమిళ మహీపతులైన చేర చోళ పాండ్య భూపతుల మధ్య స్నేహ సంబంధం నెలకొనడానికి ఆమె కృషియే కారణమనీ, ఆమెపట్ల వారికి గల ఆదరాభిమానములు నిరుపమానములనీ చెపుతారు. ఇంతకు మించి ఆమెను గురించి ఎక్కువగా తెలియ రాలేదు,

అవ్వై పేరుతో వ్యవహృత మవుతున్న మరొక కవయిత్రి కూడా ప్రజాభిమానాన్ని చూరగొన్నది. ఆమె రచించినట్లు భావించబడుతున్న ఆత్తిచూడి, కొండ్రై వేందన్ మొదలైనవి నీతి ప్రధాన రచనలు. ఈ లఘు రచనలవల్ల అవ్వైకి తమిళ సాహిత్యంలో శాశ్వత స్థానం లభించింది. వీటి నుంచి ఆమె ఆత్మీయతను గ్రహించవచ్చు.

నిర్ధనులంటే అవ్వైకి అనిర్వచనీయమైన అనుకంప. పేద సాదులకు తోడు నీడగా ఉండాలి; వారికి గుప్పెడు మెతుకులైనా పెట్టాలని ఆమె ఉద్బోధించింది, దానధర్మాలు చెయ్యనివారే తక్కువజాతి వారని ఆమె అభిప్రాయం. అవ్వైయార్ దృష్టిలో ధనార్జన చెయ్యడం తప్పు కాదు. అయితే ధర్మబద్ధంగా ఆర్జించాలి.

అధర్మమార్గం అవాంఛనీయం. అధర్మమార్గంలో సంచరించేవారిని ధర్మం శిక్షిస్తుందనీ, న్యాయస్థానంలో అసత్యం ఆడరాదనీ, సాడీలు చెప్పరాదనీ, ఆమె హితవు చెప్పింది. సంపాదించిన ధనమును భూమిలో భద్రం చెయ్యడంకంటె నీచమైన కృత్యం మరొకటి లేదనీ, ఆధనం నలుగురికి ఉపయోగపడాలనీ ఉద్బోధించింది.

అందని వాటికి అర్రులు చాచడం అభిలషణీయం కాదు; వాటిని విస్మరించాలి. కర్మ ననుసరించి శుభాశుభాలు ఏర్పడతాయి – అని తెలియజేసింది

గృహస్థ ధర్మాలను కూడా అవ్వైయార్ మనోజ్ఞంగా వివరించింది. దారిద్ర్యం, క్షణభంగురమైన దేహం మొదలైన వాటిని గురించి చెప్పినా ఆమె సన్యాసము అంతగా ప్రోత్సహించలేదు. తామరాకు మీది నీటిబొట్టులా జీవించాలని ఉపదేశించింది. భార్యాభర్తలు ప్రేమస్వరూపులై ఉండాలి; ఏక మనస్కులై ఉండాలి. అనురాగంలేని భార్యచేతి అన్నం తినడంకంటె మించిన కష్టం మరొకటి లేదు. మానమర్యాదలతో జీవితం సాగించాలి. ఇతరుల్ని ప్రేమించడం నేర్చుకోవాలి. జీవహింస, మాంసాహారం మంచివి కావు. తల్లిదండ్రులే ప్రత్యక్ష దైవతములు. తండ్రిమాట మంత్రం కంటె మహిమోపేత మయింది. తల్లిని సేవించడం గుళ్ళు గోపురాలను సందర్శించడం కంటె మంచిది.

నేర్చింది పిడికెడు; నేర్వవలసింది ఆకాశ మంత అని ఆకవయిత్రి చదువుల గొప్పతనాన్ని కొనియాడింది. జీవితంలో నేర్చుకునేది అత్యల్పం కనుక అధ్యయనం ఎప్పుడూ కొనసాగుతూ వుండాలి. అయినా చదువు సంధ్యలకంటె చక్కని నడత అత్యవసరమని ఆమె సూచించింది.

అవ్వైయారు వెలయించిన కృతులు అమృత తుల్యములు. వాటిలో దైనందిన జీవితానికి సంబంధించిన నీతివాక్యాలెన్నో ప్రముఖంగా కనిపిస్తాయి. అవి అనుభవం మీద చెప్పబడినవిగా గోచరిస్తాయి. అవ్వగారి మవ్వపు సూక్తులు తమిళనాడులో వాడవాడలా ప్రతిధ్వనిస్తూ వున్నాయి. ప్రజాకవయిత్రిగా ఆమె ప్రథితయశస్కురా లయింది.

వివిధ సమయాలలోనూ అవ్వై చెప్పిన పద్యాలూ సూక్తులూ ప్రాతఃస్మరణీయాలు. కొన్నిటిని పరిశీలిద్దాము:

దుర్భర మతి దుర్భరము దారిద్ర్యము
దానికంటె దుర్భరము జవ్వనమున లేమి

దానికంటె దుర్భరము తీరని రుగ్మత
దాని కంటె దుర్భరము ప్రేమలేని భార్య
దాని కంటె దుర్భరము ఆమె చేతికూడు.

తగిన తరుణి గృహిణియైన
చెయ్యవచ్చు సంసార మెట్లైన
ఒక వేళ తద్భిన్నమైన
మాటాడక తీసికొనుము సన్న్యాసము.

విభూతిలేని ముఖము పాడు
నెయ్యి లేని కూడు పాడు
ఏరులేని ఊరికి అందము పాడు
తోబుట్టువులు లేని పుట్టుక పాడు
ఇల్లాలు లేని యిల్లు పాడు.

లోతు కడలిలో ఎంతలోతుగా ముంచినా
ఒక ముంతకు నాలుగింతలు రావు నీళ్ళు.
సఖి! ఉండవచ్చు సఖుడును సంపదయు
కాని శుభము లేర్పడు కర్మ ననుసరించి.

తోబుట్టవులే చుట్టాలని నమ్మకు
ఒంట బుట్టిన వ్యాధి తీయును ప్రాణము
ఎక్కడో అడవిని పుట్టిన మూలిక
ఔషధమై కాపాడును మనలను.

పొగడుము మిత్రుని పరోక్షమున
పొగడుము గురువుని ప్రతిచోటను
పొగడుము సతిని పట్టెమంచమున
పొగడుము సుతుని అంతరంగమున
పొగడుము భృత్యుని పనియైనపిదప

రమ్మన్నను రానిది రాదు
పొమ్మన్నను వచ్చునది పోదు

అయినా సతమతమైపోదురు
దీర్ఘాలోచనతో పామరులు.

ఎంత చూచినా ఈ దేహము పుట్టిల్లు
విషక్రిములకూ పలు వ్యాధులకూ;
ఇది తెలిసి సంచరింతురు బుధులు
తామరాకు మీది నీటి చుక్కవలె

మాను మన్నను మానవు ఒక్కరోజు అన్నము
తిను మన్నను తినలేవు రెండురోజుల అన్నము
ఎఱగవు నా బాధలు, ఓ ఉదరమా!
ఇడుమల కెల్ల అలవాలమా!
నీతో మనుట అరిది.

ఊడిగ మొనర్చుట, తిరిప మెత్తుట
కడలిని దాటుట, కపటములాడుట, పాలించుట
పరస్తుతి చేయుట, పాపకార్యము లొనర్చుట -
ఇవి యెల్ల పొడు జేనెడు పొట్ట కూటికి కాదె!

తినునది సోలెడు, కట్టునది నాలుగు మూరలు
మనసులో ఎనుబది కోట్ల తలపులు
పచ్చికుండ వంటి బ్రతుకు సాగినన్నాళ్ళు
తప్పవు మానవునికి చీకు చింతలు.

కసరి యిచ్చుట కంటె లేదనుట మేలు
ఎదురాడు పడతి కంటె భూతము మేలు
ప్రేమలేని మిత్రత కంటె పగయె మేలు
కష్టపు బ్రతుకు కంటె మరణమే మేలు.

అడుగకున్నను ఇచ్చుట ఉదారత
అడిగిన తోడనే ఇచ్చుట వదాన్యత
అడిగించుకొని ఇచ్చుట కాళ్ళకూలి అది
అడిగినా మొండి చెయ్యి చూపితే
అడుగంటును వాని వంశము.

పంట పొలములకు పెట్టునీరు
ప్రవహించును కాలువ వెంబడి
దారిలోని పచ్చికను తడుపుచు;
లోకములో ఒక సజ్జను డున్నా
అతని కోసము కురియును వర్షము
ఉపకరించును సర్వజగతి కది.

జాతు లసలు లేవు, రెండు తప్ప
ఇడెడు వారొకరు, ఇడని వారొకరు
ఇడెడు వారు ఆభిజాత్యులు
ఇడని వారు హీన కులజులు
ఇదియెపో సత్యము.

తొలి జన్మల చేసిన మంచియే
ఇలను రూపొందును సంపదగా
మంచివి చేయుము, చెడును వీడుము
సర్వమత సారాంశ మిదియె.

చతుర్విధ పురుషార్థముల గురించి అవ్వై యీ క్రింది పద్యంలో చక్కగా వివరించింది.

అర్థుల కిచ్చునదే ధర్మము
ధర్మబద్ధమైన ఆర్జనమే అర్థము
ఏక మనస్కులై మెలగుటే కామము-
దైవ స్మరణలో వీటిని విస్మరించుటే మోక్షము.

ఇక అవ్వైరచనగా చెప్పబడుచున్న ఆత్తిచూడిలోని నీతి వాక్యాలను పరిశీలిద్దాము. అకారాద్యక్షర క్రమంలో కూర్చబడిన లఘుకృతి యిది. ఇందులో 108 సుభాషితాలు చోటు చేసుకున్నాయి. ఆకృతిలో లఘుకృతి అయినా, దీనిప్రభావం మాత్రం కొండంత. నేటికీ ఈ సుభాషితాలు ప్రచుర ప్రచారంలో ఉండడమే కాక తత్కవయిత్రి కూడా సంభక్తికంగా సంస్మరించబడుతున్నది.

మహాకవి భారతి అవ్వైని ప్రశంసిస్తూ, ఒక కవితలో ఇలా అన్నాడు.

"జాతులు రెండే రెండని చాటిన
అవ్వ పలుకులనే అమృత మనేము

నీతిని పాటిస్తూ పరులకు తోడ్పడుతూ
నివసిస్తే పైవారు ; ఇతరులు కిందివారు.”

అవ్వైయారుని అనుకరిస్తూ భారతి ‘పుదియ ఆత్తిచూడి’ ని (కొత్త అత్తి చూడి) వెలయించాడు ఆ కవయిత్రిలా ఆయన కూడా అకారాద్యక్షర క్రమంలోనే నూతనసుభాషితాలు చెప్పడం గమనించ దగిన విషయం.

ఇక అవ్వై సంతరించిన అత్తిచూడిని యధామూలంగా పరిశీలిద్దాము :

అత్తిమాల ధరించు హరతనూభవుని
బత్తిమీర మనము ప్రణుతిసేయుదము.

| | |
|---|---|
| అఱంజెయ విరుంబు | ధర్మము చేయ గోరుము |
| ఆఱువదు సినం | తగ్గవలసినది కోపము |
| ఇయల్వదు కరవేల్ | ఇయ్యదగినది దాచకుము |
| ఈవదు విలక్కేల్ | ఇచ్చునప్పుడు అడ్డు తగులకుము |
| ఉడైయదు విళంబేల్ | ఉన్నదానిని తెలియ జెప్పకుము |
| ఊక్కమదు కైవిడేల్ | శ్రద్ధను విడనాడకుము |
| ఎణ్ణెళుత్తిగళేల్ | తర్కవ్యాకరణములను తెగడకుము-లేక |
| | వ్యాకరణ గణితములను తెగడకుము |
| ఏఱ్పదు ఇగళ్చి | యాచన నీచము |
| ఐయమిట్టుణ్ | మొదట పెట్టి పిదప తినుము |
| ఒప్పురవొళుగు | లోకము ననుసరింపుము |
| ఓదువదు ఒళియేల్ | చదువు మానకుము |
| ఔవియం పేసేల్ | ఈసుమాటలు చెప్పకుము |
| అఃగం సురుక్కేల్ | గింజలు తగ్గింపకుము |
| కండొన్ఱు సొల్లేల్ | ఒకటిచూచి మరొకటి చెప్పకుము |
| శని నీరాడు | శనివారము నాడు తలంటు పోసికొనుము |
| జయంపడ ఉరై | కమ్మగా మాటలాడుము |
| ఇడంపడ వీడెడల్ | మించిన యిల్లు కట్టకుము |
| ఇనుక్కమఱిన్దు ఇణంగు | గుణమెరిగి చెలిమి చేయుము |
| తన్నై తాయ్ పేణ్ | తలిదండ్రులను కాపాడుము |
| నన్ఱి మరవేల్ | మేలును మరువకుము |

| | |
|---|---|
| పరువత్తే పయిర్ చెయ్ | పరువమున పైరు చేయుము |
| మ్నణ్ణు పఱిత్తు ఉణ్ణేల్ | న్యాయస్థానపు సొమ్మును తినకుము |
| ఇయల్ప లాదన సెయేల్ | తగని పనులు చేయకుము |
| అరవం ఆట్టేల్ | పాముల నాడింపకుము |
| ఇలవం పంజిల్ తుయిల్ | దూది పరపున నిద్రింపుము |
| వంచకం పేసేల్ | వంచన లాడకుము |
| అళగు అలాదన సెయేల్ | నీచపుపనులు చేయకుము |
| ఇళమైయిల్ కల్ | బాల్యమున అభ్యసింపుము |
| అఱివై మఱవేల్ | ధర్మమును మఱువకుము |
| అనంతల్ ఆడేల్ | నిద్ర మానుము |
| పడివదు మఱు | కటూక్తులు మరచి పొమ్ము |
| కాప్పదు విరతం | కాపాడుటే వ్రతము |
| కిళమైప్పడ వాళ్ | ఉపయోగపడునట్లు జీవింపుము |
| కీళ్మై యగట్రు | నైచ్యమును తొలగింపుము |
| గుణమదు కై విడేల్ | మంచి గుణమును విడువకుము |
| కూడిప్పిరియేల్ | చెలిమిని విడువకుము |
| కెడుప్పదు ఒళి | కీడు తలపకుము |
| కేళ్వి మయల్ | వినుటకు ప్రయత్నింపుము |
| కైవిలై కరవేల్ | చేతిపనిని దాచకుము |
| కొళ్లై విరుంబేల్ | కొల్లగొట్టుటను కోరకుము |
| కోబాట్టుఒళి | తప్పాడు ఆటను వీడుము |
| చక్కెర నెరి నిల్ | చక్రపథమున నిలువుము |
| శాన్డోర్ ఇన త్తిరు | మహిమంతుల వరుస నుండుము |
| చిత్తిరం పేసేల్ | నర్మోక్తులు ఆడకుము |
| సీర్మై మఱవేల్ | మంచిది మరువకుము |
| చుళిక్క చ్చొల్లేల్ | కోపము తెప్పించునట్లు(చురుకుమనునట్లు మాటలాడకుము |
| చూదు విరుంబేల్ | జూదమును కోరకుము |
| చెయ్వన తిరున్దచ్చెయ్ | చేయునవి సరిగా చేయుము |

| | |
|---|---|
| సేరిడం అఱిన్దు సేర్ | చేరు చోటును తెలిసి చేరుము |
| చైయెన త్తిరియేల్ | ఛీ అనునట్లు తిరుగకుము |
| చోట్ సోర్వు పడేల్ | మాటాడునప్పుడు మరపు వలదు |
| సోంబి త్తిరియేల్ | సోమరివై తిరుగకుము |
| తక్కోనెన త్తిరి | సజ్జనుడవై సంచరింపుము |
| దానమదు విరుంబు | దానము చేయగోరుము |
| తిరుమాలుక్కు అడిమై చెయ్ | విష్ణువును సేవింపుము |
| తీవినై యగఱ్ఱు | పాపకార్యములను పరిహరింపుము |
| తున్బత్తిఱ్కు ఇడం కొడేల్ | దుఃఖమునకు తావొసగకుము |
| తూక్కి వినై సెయ్ | ఆలోచించి చేయుము |
| దెయ్వం ఇగళేల్ | దైవమును దూషింపకుము |
| దేశత్తోడు ఒత్తువాళ్ | దేశముతో కలసి జీవింపుము |
| తైయల్ సొల్ కేళేల్ | మగువ మాటలు వినకుము |
| తొన్మై మఱవేల్ | ప్రాచీనతను మరువకుము |
| తోఱ్ఱన తొడరేల్ | ఓడిపోవువానితో చేరకుము |
| నన్మై కడప్పిడి | మంచిని ఆశ్రయింపుము |
| నాడొప్పన చెయ్ | నలుగురికి నచ్చినవి చేయుము |
| నిలైయిల్ పిరియేల్ | నీ యునికినుండి తొలగకుము |
| నీర్ విళైయాడేల్ | నీటిలో ఆటలాడకుము |
| నుణ్మై నుగరేల్ | అల్పాహారమును పరిహరింపుము |
| నూల్ పలకల్ | పెక్కు పుస్తకములు చదువుము |
| నెర్పయిర్ విళై | వరిపైరు చేయుము |
| నేర్పడ ఒళుగు | సక్రమముగా సంచరింపుము |
| నైవినై నణుగేల్ | చెడుపనులను ఆదరింపకుము |
| నొయ్య ఉరైయేల్ | నీచముగా మాటాలాడకుము |
| నోయ్క్కు ఇడం కొడేల్ | వ్యాధికి చోటియ్యకు |
| పళిప్పన పగరేల్ | నిందలు వెయ్యకుము |
| పాంబోడు పళగేల్ | పాముతో ఆడకుము |
| పిళై పడచ్చొల్లేల్ | దోషయుక్తముగా మాటాడకుము |
| పీడు పెఱనిల్ | గర్వకారణ మగునట్లు ప్రవర్తింపుము |

| | |
|---|---|
| పుగళ్‌న్దారై పోట్రి వాళ్ | పొగడినవారిని ఆదుకొనుచు జీవింపుము |
| బూమి తిరుత్తి ఉణ్ | భూమిని దున్ని తినుము |
| పెరియారై తుణైక్కొళ్ | పెద్దలను తోడు చేసికొనుము |
| పేదైమై యగట్రు | అజ్ఞానమును తొలగింపుము |
| పైయలోడు ఇణంగేల్ | తుంటరి పిల్లలతో చేరకుము |
| పొరుడనై పోట్రివాళ్ | ధనమును వృద్ధిచేసికొనుచు జీవింపుము |
| పోర్‌త్తొళిల్ పురియేల్ | యుద్ధవృత్తి అవలంబింపకుము |
| మనం తడుమాఱేల్ | మనస్సును చెదరనీయకుము |
| మాట్రానుక్కు ఇడం కొడేల్ | పగవానికి చోటియ్యకుము |
| మిగైన డచ్చొల్లేల్ | అతిగా మాట్లాడకుము |
| మిదూణ్ విరుంబేల్ | మితిమీరిన భోజనమును కోరకుము |
| మునై ముగత్తు నిల్లేల్ | యుద్ధభూమిని నిలువకుము |
| మూర్క్కరోడు ఇణంగేల్ | మూర్ఖులతో చెలిమి చెయ్యకు |
| మెల్లెన ప్పేసు | మెల్లగా మాటలాడుము |
| మేన్మక్కళ్ సొల్ కేళ్ | ఉత్తముల మాట వినుము |
| మైయల్ అగట్రు | మోహము వీడుము |
| మొళివదు అఱమొళి | సందేహమునకు చోటియ్యక మాటాలాడుము |
| మోసత్తై ముని | మోసమును చంపుకొనుము |
| వల్లమై పేసేల్ | ఆత్మ ప్రశంసను మానుము |
| వాదుమున్ కూఱేల్ | వాదులు సేయుట మానుము |
| విద్దై విరుంబు | విద్యను కోరుము |
| వీడు పెఱ నిల్ | మోక్షమార్గమున నిలువుము |
| ఉత్తమనా ఇరు | ఉత్తముడవై ఉండుము |
| ఊరుడన్ కూడివాళ్ | ఊరి వారితో కలసి జీవింపుము |
| వెట్టెన ప్పేసేల్ | కత్తివాటువలె మాటలాడకుము |
| వేణ్డి వినై సెయ్యేల్ | కోరి కీడు చెయ్యకుము |
| వైగఱై త్తుయిలెళు | వేకువనే నిద్ర మేల్కొనుము |
| ఒన్నారై త్తేఱేల్ | విరోధులను విశ్వసింపకుము |
| ఓరం సొల్లేల్ | పక్షపాతముగా మాటలాడకుము |

అవ్వైయార్ లోక నీతి అనే మరొక లఘుకృతి వెలయించినట్లు విజ్ఞుల విశ్వాసం. ఇందులోని సుభాషితాలు కొన్నింటిని పరిశీలిద్దాము :

ఒక్కనాడును చదువు మానకుము
ఎవ్వరినీ తప్పులు పట్టకుము
తల్లిని ఎన్నడూ మరువకుము
వంచకులతో చేరకుము
పోరాని చోటుకి పోకుము
వెనుక నిందింపకుము
తెలిసి అబద్ధము చెప్పకుము
నిలుకడలేని విషయమును స్థిరపడుపకుము
విషజంతువులతో ఆడకుము
దుర్జనులతో చెలిమి చేయకుము
నిర్భయముగా ఒంటరిత్రోవలో వెళ్లకుము
ఆశ్రితులకు కీడు తల పెట్టకుము
ఇచ్ఛవచ్చినట్లు తిరుగకుము
పగవానిని బంధువుగా నమ్మవలదు.
ఆర్జించిన ధనమును తినకుండ పూడ్చి పెట్టకుము
ధర్మమును ఒక్కనాడును విస్మరింపకుము
కోపకారణమున దుఃఖము పొందకుము
క్రోధ చిత్తుల వెంట వెళ్ళకుము
తప్పు లెన్నుచు తిరుగకుము
హంతకులతోను చోరులతోను తిరుగకుము
పండితులను పరిహసింపకుము
శీలవతులైన స్త్రీలను దూషింపకుము
రాజునకెదుట నిలిచి మారుమాటాడకుము
గుడిలేని ఊరిలో నివసింపకుము
కుమార్తెను కాపురము చెయ్యనీయక (నీయొద్ద) ఉంచుకొనకుము
ఇల్లాలిని తప్పు పట్టకుము
దిగరాని గోతిలో దిగకుము

యుద్ధములో వెన్నిచ్చి రాకుము
చితికిపోయిన వారిలో తప్పు లెన్నకుము
వట్టి మాటలు చెప్పువారితో తిరుగకుము
గౌరవింపని వారి తలవాకిలిని త్రొక్కకుము
వృద్ధుల మాటలను విస్మరింపకుము
ముక్కుమీద కోపము గలవారితో చేరకుము
ఉపాధ్యాయునకియ్యవలసినది ఉంచుకొనవలదు
దారిదోపిడి గాంగ్రతతో చేరకుము
ఆలోచింపక పనులు పూర్తి చేయకుము
తప్పుడు లెక్కలు చెప్పకుము
పోరు జరుగు స్థలమునకు పోవలదు
ఉమ్మడిచోట ఉండకుము
ఇద్దరు స్త్రీలను పెండ్లియాడకుము
పేదవారితో పగ సాధింపకుము
పోరాని చోటికి పోవలదు
చేసిన మేలును ఎన్నటికిని మరువకుము
ఊరివారితో కలిసి సాడీలు చెప్పుచు తిరుగకుము.

దేశకాల పాత్రలలో మార్పులు రావడం సహజం. ఒకప్పటి నీతి మరొకప్పుడు అవినీతిగా కనిపించవచ్చు. తాగేనీటికి సైతం పాచిపట్టడం ఎలా సహజమో, సుభాషితాలకు కూడా కాలదోషం పట్టడం అంతే సహజం. ఈ దృష్టితో మన సుభాషితాలను పరిశీలించాలి. అంతేగాని అవి పరమ ప్రమాణాలని విశ్వసించడం అవివేక మవుతుంది.

దేశకాలాదులలో మార్పులు రావచ్చు. తలపుతీరులో మార్పురావచ్చు. కాని కొన్ని సుభాషితాలు మాత్రం ఎప్పటికైనా, నిత్యనూతనంగా ఔచిత్య భరితంగా కానవస్తాయి. అనగా, కాలదోషం పట్టని సార్వకాలిక సూక్తులన్న మాట అవి! ఆకోవకు చెందినవి అవ్వైయారు సుభాషితాలలో మనకు చాలా కనిపిసాయి ఊరివారితో కలిసి జీవింపుము — ఈ సూక్తిని సార్వకాలిక మనవచ్చు. సంఘజీవి అయిన మానవుడు సంఘమును అనుసరించి వెళ్ళడం సమంజసం. చెడ్డవారితో అని కాదు అర్థం. చెడ్డవారికి సంఘంలో స్థానమున్నప్పటికీ, చదువు సంస్కారం మొదలైనవి కలిగి ఋజుమార్గంలో ప్రవర్తించేవారినే మానవుడు ఆదర్శంగా గ్రహిస్తాడు. సంఘాన్ని త్రోసిరాజని మానవుడు ఒంటరి బ్రతుకు బ్రతకలేడు, అటువంటి బ్రతుకు అవాంఛనీయం.

జీవితానికి ఉపయోగపడే కవితలూ సూక్తులూ వెలయించింది కనుకనే, అవ్వైయారు నేటికీ స్మరింపబడు తున్నది. ఆమె వాక్కుకి చిరంజీవిత్వం లభించింది. అందువల్లనే, ఆ చల్లని తల్లి ప్రజాకవయిత్రిగా ప్రతిభాసిస్తున్నది.

# తమిళంలో రామ కథ

సాహిత్యపరంగా ఉత్తర దక్షిణ భారతాలను ఏకం చేసిన రసవత్కథ రామ కథ. పండితుల్నీ పామరుల్నీ సరిసమానంగా రంజింపజేస్తున్న రమణీయ కథ రామ కథ. కాగా రామ కథ మృత పురాణం కాదు; సజీవమైన చక్కని కథ ప్రచుర ప్రచారంలో ఉన్న రామ కథాత్మకము లైన పలుకుబళ్ళనీ సామెతల్నీ కనుక పరిశీలిస్తే, ఈ విషయం మరింత స్పష్ట మవుతుంది.

'వల్లవనుక్కు ప్పుల్లుం ఆయుదం' అనే సామెత నేటికీ తమిళనాడులో వాడుకలో ఉన్నది. ఇది కాకాసురుని వృత్తాంతాన్ని తెలియజేస్తున్నది. ఇంద్రుని కుమారు డైన జయంతుడు. మలిన మనస్కుడై, కాకి రూపంలో సీతాదేవిని సమీపించగా రాముడు అప్పుడు చెంతనున్న తృణం తీసుకుని దాన్ని అతని మీదికి విసిరి వేశాడు. అదే అతని పాలిటి రామబాణ మయింది. నాటినుంచీ, బలవంతుడి చేతిలో అనాదరభావంతో చూడబడే తృణం (పుల్) సైతం ఆయుధ మవుతుందనే సామెత వ్యవహారంలోకి వచ్చి వుండవచ్చు.

ఈ కాకాసురుని కథనే తెలియజేసే సామెతలు మరికొన్ని వాడుకలో ఉన్నాయి. 'కురివిక్కేట్ర రామచరం' (పక్షికి తగిన రామబాణం); 'చిట్టుక్కురివిక్కు రామ బాణమా ?' (పిచ్చుకమీద బ్రహ్మాస్త్రమా ?) మొదలైనవి.

'వడక్కే పోన కురంగు వరవిల్లై' (ఉత్తరంగా వెళ్ళిన కోతి తిరిగి రాలేదు) అనే సామెత సీతాన్వేషణకు సంబంధించింది. సీతాన్వేషణ నిమిత్తం వానరులు నలువైపులకూ వెళ్ళారు. దక్షిణాభిముఖంగా వెళ్ళిన హనుమంతుడు మాత్రం సీత జాడ తెలుసుకుని రాముడి వద్దకు వచ్చాడు.

ప్రజల నాలుకల మీద నానే సామెతలు ఒక్క రోజులో ఏర్పడేవి కావు. ఏళ్ళతరబడిగా ప్రచారంలో ఉండే నమ్మకాలనూ కథలనూ అవి వ్యక్తం చేస్తాయి.

అలాగే తమిళ జానపద సాహిత్యంలోనూ రామ కథకు సంబంధించిన రచనలు ఎన్నో ఉన్నాయి. అమ్మానై, కుమ్మి, కావడిచ్చిందు మొదలైన జానపద ప్రక్రియలలో రామకథ చెప్పబడింది. అమ్మానై (గచ్చకాయల ఆట), కుమ్మి (గొబ్బి తడుతూ పాడే పాట) బాలికల క్రీడా విశేషాలు. గచ్చకాయలు ఆడుతూ

పాడే పాటకు అమ్మానై అని వ్యవహారం. కావడిచ్చిందు సంగీత ప్రధాన మయింది. కావడి బుజాన వేసుకుని మైమరచి పాడుతారు. ఒక ఏతం పాటలో రామాయణ కథ సంగ్రహంగా చెప్పబడింది. మన ప్రాచీన సంస్కృతి సురక్షితంగా ఉండడానికి ప్రబల కారణాలలో ఒకటి జానపద సాహిత్యం అనడం సాహసం కాదు.

ఆధునికులలో కూడా కొందరు జానపద గేయ రూపంలో రామ కథను రచించడం గమనించదగిన అంశం. ఈ కోవకు చెందిన వాటిలో టి. వైద్యలింగం చెట్టియార్ వ్రాసిన రామాయణ చ్చిందు, కె. తిరుమలై సామి అయ్యంగారు రచించిన రామాయణ కృప్పల్, సి. మునుస్వామి ముదలియారు వెలయించిన రావణన్ కుమ్మి, రత్నసభాపతి ముదలి రచించిన రామర్ తాలాట్టు (జోలపాట), త్యాగప్ప దాసర్ సంతరించిన రామసింగార చ్చిందు మొనలైనవి పేర్కొన దగినవి. తక్కై రామాయణం, కుయిల్ రామాయణం అనేవి కూడా జానపద కవులు రచించిన రామాయణాలు. కుయిల్ (కోకిల) రామాయణం 128 పాటల చక్కని రచన.

సీత రావణుని చిత్రం వేసినట్లూ, ఆ చిత్రరచన తరువాతి ఆమె అరణ్యవాసానికి దారి తీసినట్లూ తెలియజేసే ఒక కథ జానపద సాహిత్యంలో ఉన్నది. ఆ కథ ఒక తమిళ గేయంలో ఇలా సంగ్రహంగా తెలుపబడింది ;

'సీతమ్మ రాసేను లంక చెలువమ్ము
రావణుని అందమూ రాక్షసుల గుణమూ;
రాసి సరి చూసేను లేదీగ సీతమ్మ
చదివి సరి చూసేను చక్కన్ని సీతమ్మ.'

ఇవి కాక రామకథా సంబంధి చాటువులు కూడా తమిళంలో చుబ్బన చూరలు. ఒక చాటువులో అవాల్మీకమైన అద్భుత కథ ఒకటి అందాలు దిద్దుకుంది.

రావణ వధానంతరం సపరివారంగా రాముడు అయోధ్యకు బయలుదేరే సన్నాహంలో ఉన్నాడు. అప్పుడు సీతకు ఒక వింత కోరిక కలిగిందట ! లంక నుంచి చూడ చక్కని ఒక సన్నెకల్లు తనతోపాటు తీసుకు వెడదామనుకుంది. సన్నెకల్లుని సంపాదించే భారాన్ని నమ్మిన బంటు హనుమంతుడి మీద పెట్టింది. అమ్మవారి ఆజ్ఞను సహర్షంగా తల దాల్చాడు ఆంజనేయుడు. వెతికి వెతికి ఒక

మంచి సన్నెకల్లు ఎన్నిక చేశాడు. దాన్ని పైకి ఎత్తబోతూ వుండగా, జాంబవంతుడు అక్కడికి వచ్చాడు. ఏం చేస్తున్నావని అడిగాడు, అమ్మవారి ఆజ్ఞను తెలియ జేశాడు ఆ నమ్మినబంటు. జాంబవంతుడు తనలో తాను నవ్వుకుంటూ వెంటనే అమ్మవారి వద్దకు దారితీశాడు.

సీత జాంబవంతుణ్ణి సబహుమానంగా స్వీకరించింది. అప్పుడు ఆయన ఇలా అన్నాడు: 'సముద్ర మధనం, అయిదు తలల బ్రహ్మ, రెక్కలున్న కొండలు, తియ్యని సముద్ర జలం, మన్మథుని మనోహరాకృతి, పరమ శివుని తెల్లని కంఠం, రెండు కళ్ళ ఇంద్రుడు—మొదలైన పరమాద్భుతాలు ఎన్నిటినో నేను నా కళ్ళారా చూశాను. కాని దానం చెయ్యబడిన వస్తువుని తిరిగి తీసుకోవడ మనే వింతను మాత్రం నేను నా దీర్ఘ జీవిత చరిత్రలో ఇంతవరకూ చూడలేదు.' అని చెప్పి జాంబవంతుడు మౌనం వహించాడు.

తన పొరపాటుని తెలుసుకుంది సీత. విభీషణుణ్ణి లంకకు రాజుగా చేసిన తర్వాత అది అతని రాజ్య మనీ అందువల్ల అందులోని ప్రతి అణువూ అతనిదే అనీ తెలుసుకుంది, ధర్మ సూక్ష్మాన్ని. సన్నెకల్లు ఉన్నచోటనే ఉండి పోయింది.

చవులూరే యీ కథను తెలియజేసే చాటువు ఇది:

'కంటి సాగర మథనమ్ము, కంటి అయిదు
తలల బ్రహ్మను, కంటి రెక్కల గిరులను,
కమ్మని కడలి నీటిని కంటి, ఇక్షు
చాపుని కనుగొంటి, శివుని చక్కని మెడ
గంటి, రెండు కండ్ల మఘువు గంటి, ఇచ్చి
మరల తీసికొనెడు వింత నరయనైతి.

రామబాణ మహిమను గుర్తించిన తమిళులు తాళపత్రాలను క్రమబద్ధంగా తొలిచే ఒక కీటకాన్ని రామబాణం అని వ్యవహరిస్తారు.

రామబాణ మహిమను అభివర్ణించే ఏతం పాట ఒకటి ఉంది. ఇందులో రామబాణ లక్షణాలు తెలుపబడినవి.

'పిడుగులా బాణం
వేసేను రఘురాముడు

గాలిలా బాణం
రయ్యిమని వచ్చేను
వానలా బాణం
కురిపించేను స్వామి
పసిడిలా బాణం
సంధించేను ఆ దేవుడు.

తమిళ జానపద వాఙ్మయంలో మహిరావణుడికి సంబంధించిన రచనలు కూడా ఉన్నాయి. మయిల్ రావణన్ కదై, శతకంట రామాయణ క్కదై మొదలైనవి మహిరావణా కదా సంబంధములు.

తమిళ వాఙ్మయ చరిత్రలో తొలి యుగం సంగయుగం. సంగయుగపు కాలం గురించి పండిత లోకంలో అభిప్రాయ భేదాలు ఉన్నా, అది క్రీస్తు శకం తొలి మూడు శతాబ్దులలో వర్ధిల్లినట్లు నిస్సంశయంగా చెప్పవచ్చు.

సంగయగంలో వెలసిన కృతులలో అగనానూరు, పురనానూరు మొదలైన సంకలనాలు పేర్కొన దగినవి. అగనానూరులోని ఒక పద్యంలో రామ కథా సంబంధి అయిన రసవత్తర సన్నివేశం ఒకటి చిత్రించబడింది. ధనుష్కోటిలో ఒక రావిచెట్టు నీడను ఆసీనుడై రామచంద్రుడు తన సహచరులతో సమాలోచన జరుపుతున్నాడు, దశకంఠుని మీదికి ఎలా దండెత్తి వెళ్ళాలా అని. అప్పుడు చెట్టు మీది పిట్టలూ పులుగులూ చెవులు చిల్లులు పడేలా గోల చెయ్యసాగాయి. వాటి వంక రాముడు ఒక్కసారి చూశాడు. పక్షులన్నీ మౌనం వహించాయి. అనగా, పక్షిజాలం సైతం రాముడి పక్షం వహించినట్లు ఈ సన్నివేశంలో చమత్కరించ బడింది.

పురనానూరులోని ఒక పద్యం వానరులు వివిధాభరణాలను కైసేసికొన్న విధాన్ని వ్యక్తం చేస్తోంది. రావణాసురుడు సీతను ఎత్తుకొని పోతూ వుండగా, సీత తన నగలను పైనుంచి కిందికి జారవిడిచింది. అవి వానరుల కంట బడ్డాయి. ఆ ఆభరణాలను ఎలా ధరించాలో తెలియక తికమక పడి, చివరికి వాటిని ఏదో ఒక విధంగా ధరించి వానరులు తృప్తి చెందారు.

కలిత్తొగై అనే మరొక కృతిలో దశకంఠుడైన రావణుడు హిమవత్పర్వతాన్ని పైకెత్తబోయి, తుదకు పరాభవం చెందిన విషయాన్ని ఒక పద్యం అభివర్ణించింది.

పరిపాడల్ అనే యింకొక కృతిలో అహల్య కథను సంగ్రహంగా తెలియ జేసే ఒక పద్యం కాన వస్తున్నది. తమిళనాడులో ప్రచారంలో ఉన్న కథకు అనుగుణంగా, ఇంద్రుడు మార్జాలంగా చిత్రించబడ్డాడు. పిల్లి రూపంలో అతను గౌతమాశ్రమం నుంచి నిష్క్రమించినట్లు ఆ పద్యంలో ఉదాహరించబడింది.

కాగా, అతి ప్రాచీనమైన సంగయుగంలోనే తమిళంలో ఒక రామాయణ రచన వెలుగులోకి వచ్చి వుండవచ్చు నని పండితుల అభిప్రాయం అయితే అది లభ్యం కాలేదు.

తమిళ సాహిత్యానికి తలమానికంగా భావించబడుతున్న కంబరామాయణం వెలుగు చూడక పూర్వమే ఒక రామాయణం ప్రచారంలో ఉండినట్లు సుప్రసిద్ధ పండిత పరిశోధకులు యస్. వైయాపురి పిళ్లై పేర్కొన్నారు. తన అభిప్రాయాన్ని సమర్థిస్తూ ఆయన యీ కింది కారణాలు తెలిపారు. యాప్పరుంగలం అనే ఛందో గ్రంథానికి సంతరించబడిన వ్యాఖ్యానంలో 'వెణ్బా' అనే ఛందస్సులో వ్రాయబడిన ఒక రామాయణం ఉదాహరించబడింది. తొల్కాప్పియం అనే తొలి లక్షణ గ్రంథానికి నచ్చినార్ కినియర్ అనే వ్యాఖ్యాత వ్యాఖ్య వ్రాస్తూ రామాయణంలోని దంటూ ఒక పద్యం ఉదాహరించాడు.

వెణ్బా ఛందస్సులో రామాయణం ఒకటి సంతరించబడినట్లూ, ఆది క్రీస్తు శకం 650 ప్రాంతాల వాడుకలోకి వచ్చినట్లూ పండితుల అభిప్రాయం. ప్రాచీన కాలంలో రామాయణాన్ని సీ [శ్రీ] రామకదై అని కూడా వ్యవహరించే వారనీ, వెణ్బా ఛందస్సులో కంబకవికి పూర్వమే రామాయణం వెలువడి వుండవచ్చు ననీ ము. రాఘవయ్యంగారనే ప్రసిద్ధ పరిశోధక విద్వాంసుని అభిప్రాయం.

వెణ్బా ఛందస్సులో సంతరించబడిన రామాయణం తరువాతి కాలంలో లభ్యం కాకపోయినప్పటికీ, కంబమహాకవికి పూర్వమే తమిళంలో రామాయణ రచన జరిగిందని చెప్పడంలో విప్రతిపత్తి లేదు. పైగా, తమిళనాడులోని స్థల పురాణాలను కనుక పరిశీలిస్తే చాలా స్థలాలు రామ కథలోని వివిధ పాత్రలతో సంబంధం కలవిగా కనిపిస్తాయి.

సంగయుగానికి తర్వాత వెలువడిన తమిళ కావ్యాలలో సైతం రామ కథా ప్రశంస కనిపించడం గమనించ దగిన విషయం. అనగా, తమిళనాడులో అతి ప్రాచీన కాలం నుంచీ రామకథ ప్రచారంలో ఉందని భావించడం అసమంజసం కాదు.

తమిళ కావ్య పంచకంలో సిలప్పదికారం (మంజీరగాథ) ఒకటి. తత్కావ్య నాయకుడైన కోవలుడు, దురదృష్ట వశాత్తూ, స్వస్థలమైన పుహార్‌ని (కావేరీపూం పట్టణం) విడిచిపెట్టి పాండ్య రాజధాని అయిన మధురా నగరానికి వెళ్ళ వలసి వస్తుంది. ఆ విషయాన్ని పురస్కరించుకుని సిలప్పదికార కావ్యకర్త ఇళంగో అడిగళ్ (పూజ్యపాదులు), 'కోవలన్ నిష్క్రమించిన తర్వాత పుహార్ పట్టణం రాముడు లేని అయోధ్య వలె ఉన్నది' అని పేర్కొన్నారు. మధురా నగరం సరి హద్దులు చేరుకున్న తర్వాత, తన భార్య కణ్ణకిని కౌంతి అనే యోగినికి ఒప్పజెప్పి, కోవలుడు నగరానికి దారితీస్తాడు. అప్పు డామె పూర్వం భార్యా వియోగం వల్ల రాముడు, నలుడు మొదలైన వారు బాధపడ్డారనే విషయాన్ని తన అనునయ వాక్యాలలో కోవలుడికి గుర్తు చేస్తుంది. కౌంతి జైన మత సంప్రదాయాలు పాటించే యోగిని.

తమిళ పంచ కావ్యాలలో మరొకటి అయిన మణిమేఖలలో కూడా రామ కథా ప్రశంస కానవస్తున్నది. పెద్ద పెద్ద కొండలను సముద్రంలోకి విసిరి సేతు నిర్మాణంలో వానర వీరులు రాముడికి సహాయం చేసిన ఉదంతాన్ని కవి ఒక చోట ఉదాహరిస్తాడు. ము. రాఘవయ్యంగారు అభిప్రాయం అనుసరించి యిక్కడ ఉదాహృతమైన సేతువు కన్యాకుమారిని సూచిస్తున్నది. ఇది ఆది సేతువనీ, ధనుష్కోటి వద్ద ఉన్నది మధ్య సేతువనీ ఆయన విశ్వసించారు. ఇది సహేతుకంగా ఉన్నట్లు నా అభిప్రాయం. ఎందుకంటే ప్రాచీన కాలం నుంచీ కన్యాకుమారి పవిత్ర యాత్రా స్థలంగా భావించబడుతున్నది. ఇందుకు తమిళ సాహిత్యం సాక్ష్య మిస్తున్నది. అదీకాక, ఆ సేతు హిమాచలం అన్న సంస్కృత పదబంధానికి సమానార్థకమైన తమిళ పదబంధం 'కుమరి ముదల్ ఇమయం వరై,' ఇక్కడ ప్రయుక్తమైన కుమరి శబ్దం సేతువుని సూచిస్తున్నది.

పై విషయాదికాన్ని పరిశీలిస్తే. రామకథ తమిళనాడులో ప్రచుర ప్రచారంలో ఉండే దనీ, తత్కథా గత విషయాలు కవులకు సుపరిచితములనీ పేర్కొన వచ్చు.

ఒక జైన కవి తమిళంలో రామాయణం సంతరించాడనీ, అది నేడు అలభ్య మనీ కొందరి విశ్వాసం. అరవై ముగ్గురు మహా పురుషుల జీవిత విశేషాలను అభివర్ణించే శ్రీ పురాణం అనే కావ్యంలో ఇరవయ్యవ తీర్థంకరుడైన మునీశ్వరస్వామి కథలో రామ వృత్తాంతం వివరించబడింది. ఆ కథలో సీత దుఃఖాన్ని తెలియజేసే

కొన్ని పద్యాలను శ్రీ పురాణకర్త ఉదాహరించాడు. ఈ పద్యాల శైలికీ శ్రీ పురాణ శైలికి భేదం కనిపించడం వల్ల, ఉదాహృత పద్యాలు శ్రీ పురాణ కావ్యకర్తవి కావనీ, అవి జైన రామాయణాంతర్గతములై ఉండవచ్చుననీ పండితులు భావిస్తున్నారు.

జైనుల రామ కథలో హనుమంతుడు అణుమహాన్ అయ్యాడు. వాలిని లక్ష్మణుడు సంహరిస్తాడు. రావణాసురుణ్ణి సంహరించిందీ లక్ష్మణుడే; రాముడు కాదు. యుద్ధానంతరం, రాముడు దీక్ష స్వీకరిస్తాడు. అనంతరం మోక్షానికి అర్హు డవుతాడు. అణుమహాన్ ప్రభృతులు కూడా దీక్ష స్వీకరిస్తారు. ఒక్క లక్ష్మణుడికి మాత్రం నరకం లభిస్తుంది.

తమిళనాడులో భక్త కవులుగా పేరు పెంపులు గడించిన ఆళ్వారులూ నాయన్మారులూ వెలయించిన గీతాలు సుప్రసిద్ధాలు. అవి భక్తిరసపు ముద్దలు.

వైష్ణవ భక్త కవులైన ఆళ్వారులు సాహితీ రంగంలో ప్రవేశించే నాటికి వాల్మీకి వర్ణించిన ఆదర్శ మానవుడైన రాముడు అవతార పురుషు డయ్యాడు. రాముడు విష్ణ్వంశ సంభూతు డనే విశ్వాసం వాడుకలోకి వచ్చింది. తత్ఫలితంగా రసవత్కావ్యమైన రామాయణం పవిత్ర గ్రంథంగా భావించబడింది; శరణాగతి కావ్యంగా వినుతి కెక్కింది.

ఆళ్వారులు కృష్ణావతారానికి సంబంధించిన గాథలనే తమ గీతాలలో ఎక్కువగా వర్ణించినా, రాముడంటేనూ వారికి భక్తి ప్రపత్తులు లేకపోలేదు.

విష్ణుచిత్తు డనే భాగవతోత్తముడు (పెరియాళ్వారు) రామ కథా సంబంధ మైన పది పాశురాలు వెలయించాడు. వాటిలో సీతా రాములకు మాత్రమే తెలిసి నట్టు భావింపబడిన సంఘటనలు వర్ణించడం జరిగింది. కాకాసుర వృత్తాంతం వాటిలో ఒకటి. తాను రామ దూత అనే నమ్మకం కలిగించేందుకు హనుమంతుడు సీతకు ఈ పాశురాలు తెలియజేశాడు.

రాజ కవిగా ప్రసిద్ధుడైన కులశేఖరాళ్వారు కూడా తన రచనలో రామ ప్రశంస చేశాడు. ఆయనకి రాముడు సర్వస్వం. రామ లీలల్ని అభివర్ణిస్తూ ఆయన పది పాశురాలలో భక్తిరస ప్లావితమైన లాలి పాట వెలయించాడు. రాముడు అడవికి వెళ్ళిన విషయం తెలుసుకున్న దశరథుడు శోకించిన సన్నివేశాన్ని పది

పాశురాలలో వర్ణించాడు. కులశేఖరాళ్వారు పేర్కొన్న రామ కథా సంబంధి విష యాలను సంక్షేప రామాయణంగా గ్రహించవచ్చు.

విప్రనారాయణు డనబడే తొండరడిప్పొడి అళ్వారు (భక్తాంఘ్రి రేణువు) సేతు నిర్మాణంలో రాముడికి సహాయపడిన ఉడుత కథను ఒక పాశురంలో వర్ణించాడు. అవాల్మీకమైన యీ ఉదంతాన్ని కంబకవి కూడా అభివర్ణించలేదు

రామచంద్రుని వాత్సల్య భావాన్ని కీర్తిస్తూ తిరుమంగై ఆళ్వారనే మరొక భక్త కవి ఒక పాశురం చెప్పాడు. గుహుని తన సోదరుడిగాను, సీతనూ లక్ష్మ ణునీ గుహుని వదినగానూ తమ్ముడు గాను రాముడు సంబోధించినట్లు ఆయన అందులో పేర్కొన్నాడు. చెంచు జాతికి (ఆటవికుడు) చెందిన గుహుని యందు రాముడు ప్రదర్శించిన యీ సోదరభావం ప్రశంసార్హం. ఈ విశ్వ మానవ ప్రేమయే కంబకవి రామాయణానికి పరమ లక్ష్యంగా రూపొందినట్లు ప్రసిద్ధ పండిత పరిశోధకులు టి. పి. మీనాక్షి సుందరన్ పేర్కొన్నారు.

12 వ శతాబ్దిలో జీవించిన పెరియవాచ్చాన్ పిళ్లై అనే వైష్ణవాచార్యుడు 'పాశురప్పడి రామాయణం' అనే ఒక లఘుకృతిని సంకలనం చేశాడు. ద్రావిడ వేద మనే నామాంతరం కల నాలాయిర దివ్య ప్రబంధం ఆయనకి హృద్గతం కాబట్టి, తద్గ్రంథంలోని పదబంధాలతోనే పాశురప్పడి రామాయణం సంతరించా డాయన. ఇదే యీ రచనలోని విశిష్టత !

శైవ కవులైన నాయన్మారులలో తిరుజ్ఞాన సంబంధర్, తిరునావుక్కరశర్ ప్రభృతులు రావణుని చేతలను అభివర్ణించారు. తమిళ సాహిత్యానికి ప్రత్యేకతను సమకూర్చిన కంబ రామాయణాన్ని యిక పరిశీలిద్దాము.

దేశ భాషలలో లభ్యమైన రామాయణాలలో కంబ మహాకవి సంతరించిన రామాయణమే బహు ప్రాచీన మయింది. కంబ రామాయణంగా అది ప్రచా రంలో ఉన్నా, ఆయన తన రచనకు పెట్టిన పేరు రామావతారం. రామకదై, కంబ నాటకం అనే నామాంతరాలు కూడా ఉన్నాయి. అవాల్మీక విషయాలు ఎన్నో చోటు చేసుకున్న యీ రామాయణం 42, 276 పాదాల బృహద్రచన. కంబ రామాయణం ప్రక్షిప్త పద్యములమయం అని ప్రసిద్ధ విమర్శకులు టి కె. సి, (టి, కె. చిదంబరనాథ ముదలియారు) అభిప్రాయం. ఆయన పరిష్కరించి ప్రకటించిన కంబ రామాయణంలో బాలకాండలో 167 పద్యాలూ, అయోధ్యా

కాండలో 550 పద్యాలూ ఉన్నాయి. అయితే నేడు ప్రచారంలో ఉన్న కంబ రామాయణం ప్రతులలో బాలకాండలో 1,420, అయోధ్యాకాండలో 1,210 పద్యాలూ ఉన్నాయి, ఏది ఎలా ఉన్నా, కంబ రామాయణం రసవద్రచన మని తమిళ పండిత లోకం విశ్వసిస్తున్నది

దేవ భాష అయిన సంస్కృతంలో ముగ్గురు (వాల్మీకి, వసిష్ఠుడు, బోధాయనుడు అని కొందరి మతం; వాల్మీకి, వ్యాసుడు, అగస్త్యుడు అని కొందరి అభిప్రాయం) రామాయణం వెలయించినా, తాను వాల్మీకి కృతిని అధారం చేసుకుని రచన చేశానని కంబడు స్పష్టం చేశాడు. (దేవపాడైయిన్ ఇక్కదై చెయ్దవర్ మూవర్). వాల్మీకి అంటే అయనకి అపారమైన ఆదరభావం. వాల్మీకి రామాయణం వ్యాప్తిలో ఉండగా, తనవంటి వాడు రామాయణ రచనకు పూనుకోవడం పాల సముద్రమునంతా తాగివేయాలని తలచిన పిల్లి ఆశ వంటిదని అయన పేర్కొన్నాడు. ఇది కంబన్ సహజ వినయానికి తార కాణ. నిజానికి కంబ రామాయణం తమిళ సాహిత్యాకాశంలో ప్రతిభాసించే ధ్రువతార. వి. వి. యస్. అయ్యర్ వంటి సుప్రసిద్ధ విద్వాంసుల దృష్టిలో కంబని కృతి వాల్మీకం కన్న మిన్న. అయ్యరుగారి యీ మాటలు అవధరించండి :

'In the Ramayana of Kamban, the world possesses an epic which can challenge comparison not merely with Iliad and the Aeneid, the Paradise Lost and the Mahabharata, but with its original itself, namely, the Ramayana of Valmiki (Kamba Ramayana—A Study, 1965, P: I).

కవి చక్రవర్తి బిరుదాంకితు డైన కంబకవి కుల కాలములు గురించి అభిప్రాయ భేదా లున్నాయి. అయన క్రీస్తు శకం 9 వ శతాబ్దికి చెందిన వాడని పలువురి అభిప్రాయం. మరికొందరి దృష్టిలో ఆయన త్యాగవినోద బిరుదాంచితు డైన మూడవ కులోత్తుంగ చోళుని సమకాలికుడు; అనగా, 12 వ శతాబ్ది ఉత్తరార్థంలోనూ 13 వ శతాబ్ది ప్రారంభంలోనూ జీవించినట్లు చెప్పవచ్చు, ఏమయినప్పటికీ, కంబకవి ప్రాచీను డనడం నిర్వివాదం. ఆయన యింటి కట్టుకొయ్య కూడా కవిత చెప్పగలదట ! (కంబన్ వీట్టుక్కట్టు త్తరియుం కవి సొల్లుం). అంత ప్రముఖుడు కంబకవి !

వాల్మీకి కృతిని అనుసరించి కంబకవి రచన చేసినా, ఆయన రామాయణంలో అవాల్మీకాంశాలు కాన వస్తాయి. అయితే ప్రధాన కథలో మార్పులు

లేవు. పాత్ర చిత్రణలో చెయ్యబడిన మార్పులు కొట్టవచ్చినట్టు కనిపిస్తాయి. అందు లోనూ ఆయన స్త్రీ పాత్ర చిత్రణ ఉదాత్త మయింది. కాని ఆ మహాకవి చేసిన కొన్ని వర్ణనలు కొండవీటి చేంతాళ్ళు రామ దర్శనానంతరం సీత చెందిన విరహం సుమారు నలభై పద్యాలలో సాగింది. వాల్మీకంలో ఒకటి రెండు శ్లోకాలలో దశ రధుడు మిధిలా ప్రయాణం చెయ్యగా, అ మహారాజు ప్రయాణం కంబని కృతిలో సుమారు మూడువందల పద్యాలలో సాగింది.

కంబ రామాయణంలోని వర్ణనలు దీర్ఘము లనడం సత్య సన్నిహితం. ఒక్కొక్కసారి యీ వర్ణనలు మోతాదును మించినట్లు కనిపిస్తాయి. అలదువల్లనే కాబోలు కంబ రామాయణం దీర్ఘమైన వర్ణనకు పర్యాయపదంగా వాడబడుతున్నది. 'ఏమిరా కంబ రామాయణం మాట్లాడుతున్నావు' అని చిత్తూరు జిల్లావారు మాటల మధ్య వ్యవహరించడం గమనించదగిన విషయం.

వివాహాత్పూర్వమే సీతా రాములు ఒకరి నొకరు ప్రేమించుకోవడం, పిల్లి రూపంలో ఇంద్రుడు గౌతమాశ్రమం నుంచి నిష్క్రమించడం, దశరథుని కోరికను అనుసరించి శత్రుఘ్నుడు ఆయనకి అంత్యక్రియలు నిర్వహించడం, అగస్త్యమునిని తమిళ విద్వాంసుడుగా చిత్రించడం. పర్ణశాలా సహితంగా సీతాదేవిని రావణా సురుడు అపహరించడం, కైకేయిని రాముడు దూషించకపోవడం, వాలి మరణా నంతరం తారను వీర క్తమనస్కగా చిత్రించడం, భ్రాతృప్రేమ కల సోదరునిగా కుంభకర్ణుని చిత్రించడం, యుద్ధ రంగంలో మృతుడై పడివున్న భర్తను చూసి మండోదరి అక్కడి కక్కడే మరణించడం, విభీషణుడు రావణుడికి మండోదరికి అంత్యక్రియలు జరపడం, మాయా జనక పాత్రను సృష్టించడం, కంబకవిని ఆదరించిన శడయప్ప ముదలి పూర్వులు ఇచ్చిన కిరీటాన్ని వసిష్ఠుడు రాముడి శిరసున ఉంచడం — మొదలైనవి కంబ రామాయణంలో కనిపించే కొన్ని మార్పులు.

కంబ రామాయణంలో కనిపించే కమనీయ సన్నివేశాలలో ప్రముఖ మయింది సీతారాముల ప్రణయోదంతం. జనకుని అంతఃపురంలోని ఒక మేడ మీద నిలబడి వున్న సీతను కిందినుంచి రాముడు చూస్తాడు. ఆ తర్వాతనే సీత అతనిని చూస్తుంది. (అణ్ణలుం నోక్కినాన్, అవళుం నోక్కినాళ్). అలా ఇద్దరు ఒకరి నొకరు చూసుకున్నారు. అవి ప్రేమైక వీక్షణాలు. వియోగానంతరం కలుసు కున్న భార్యా భర్తల అనురాగం వర్ణనాతీతమనీ. సీతారాములు లక్ష్మీనారాయణు

లనీ కంబకవి యీ సన్నివేశాన్ని సమర్థించాడు. ఆ చూడడంలో కూడా రాముడు చూసిన తర్వాతనే, సీత అతనిని చూస్తుంది. అనగా పతివ్రతా ధర్మాన్ని పాటిస్తుంది. రాముడు కావించిన శివ ధనుర్భంగాన్ని 'ఎడుత్తదు కండనర్, ఇట్రుదు కేట్టనర్' అని ముక్తసరిగా తెలియజేశాడు. రాముడు వింటిని పైకెత్తుట కన్నారు; అది విరుగుట విన్నారు—అని ఆ పాఠానికి అర్థం. అంత అవలీలగా, కనురెప్ప పాటులో అయిదువేల మంది బలాఢ్యులు తీసుకు వచ్చిన ధనుస్సుని రాముడు విరిచాడు అనడంలో అతని ధనుర్విద్యా నైపుణ్యం చక్కగా వ్యక్తం చెయ్యబడింది.

శూర్పణఖ తన వికృత రూపంలో రాముణ్ణి సమీపించినట్లు వాల్మీకం పేర్కొన్నది. కంబకవి శూర్పణఖ అలా రాలేదు, అందాల బరిణగా వచ్చింది. పేరు ఎంత మనోహరంగా ఉందని! కామవల్లి అట! ఆ వికృత రూపిణికి మనోహరాకృతినే కాక మనోజ్ఞమైన పేరు కూడా ప్రసాదించాడు కంబకవి. ఆయన ఆమెను ఇలా చిత్రించాడు, శబ్దాలంకారం పట్టం కట్టుకున్న చిన్ని పద్యంలో—

'పంజి ఒళిర్ వింజుకులిర్ ప్పల్లవం అనుంగ
చెంజెవియ కంజనిమిర్ సీరడియళాగి
అంజొల్ యిళమంగై యెన అన్నమెన మిన్నుం
వంజియెన నంజమెన వంజమగళ్ వన్దాళ్.'
పల్లవమ్ము ఎర్రప్రత్తి సిగ్గు గొనగ,
హంస యనగ, కేకి యనగ, గరళ
మనగ, తీగ యనగ, అడుగుదమ్ములు వైచి,
ఆ పలుకుల కొలికి అరుగుదెంచె.

ఆమె తీగలా సన్నగా రెపరెపలాడుతూ వుంది. నడకయేమో హంస నడక. సోయగంలో నెమలి వంటిది. మాట లేమో మధురమైనవి. కాని మనస్సు మాత్రం విషపూరితం. వంజ మగళ్ అంటాడు కవి. మూర్తీభవించిన వంచన అని అర్థం, శూర్పణఖను ఇలా బంగారు బొమ్మగా వర్ణించడంలో కంబకవి ఆంతర్యం స్పష్టమే వికృత రూపిణిని ఎవ్వరూ ప్రేమించరు. అందువల్ల సుందరుడైన రాముణ్ణి తన వలలో వేసుకునే నిమిత్తం కామరూపిణి అయిన శూర్పణఖ కామవల్లిగా సౌందర్య తిలకగా రూపుదాల్చింది. ఎంత అందాల కొలికి వచ్చినా, రాముని

ఏకపత్నీ వ్రతానికి భంగం వాటిల్లదని తెలియజెయ్యడానికి కామవల్లిని కల్పించి వుండవచ్చు.

శూర్పణఖ రాముణ్ణి సమీపించడం, తర్వాత రామానుజుణ్ణి సమీపించడం, ఆ తర్వాత జరిగిన కథ అందరికీ సుపరిచితమే అయితే యితర రామాయణాలలో వలె కాక, కంబ రామాయణంలోని లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులతో పాటు ఆమె వక్షోజములు కూడా ఖండించాడు, ఆమెను మరీ వికృత రూపిణిగా చేసేందుకు ఈ కఠిన చర్య తీసుకోబడింది కాబోలు! అదీ కాక వక్షోజాలు కామ జనకాలు.

మలయాళ కవితలో ప్రామాణికమైన శైలిని సృష్టించిన ఎళుత్తచ్చన్ (16 వ శతాబ్ది ఉత్తరార్థం) తన అధ్యాత్మరామాయణంలో 'కాదుం ములైయుం మూక్కుం ఎల్లాం ఛేదిచ్చనేరం అవళ్ అలరి' (చెవులూ వక్షోజములూ ముక్కూ అన్నీ ఛేదించి నప్పుడు ఆమె గగ్గోలు పెట్టింది) అని అన్నాడు. కంబరామాయణపు ప్రభావం ఎళుత్తచ్చన్ మీద కనిపించదు. సంస్కృత అధ్యాత్మరామాయణంలోనూ ఈ ప్రసక్తి లేదు. మరి, వక్షోజ విచ్ఛేదనానికి మూలమేదో తెలియ రాలేదు.

ఇక సీతాపహరణం గురించి రెండు మాటలు :

వాల్మీకంలో లేకపోయినప్పటికీ, పర్ణశాలా సహితంగా సీతను రావణుడు అపహరించి తీసుకు పోయినట్టుగా కంబకవి ఎందుకు వ్రాశాడు ? ఈ విషయాన్ని పురస్కరించుకుని కొందరు తమిళ విమర్శకులు ఆయన్ని విమర్శించారు. వాల్మీకి రావణాసురుడు సీతను చేతులతో తాకి అపహరించగా, కంబకవి రావణుడు పర్ణ శాలను పెకలించి ఆ పర్ణశాలతోపాటు సీతను తీసుకుపోయె ననడం విచిత్రమూ అసహజమూ అని ఆ విమర్శకుల అభిప్రాయం. కావ్య విమర్శ చేసేటప్పుడు, ఆ కావ్యం వెలుగులోకి వచ్చినప్పటి దేశ కాల పరిస్థితుల్ని గుర్తుంచుకోవడం చాలా అవసరం.

కంబకవి కాలం నాటికి సీతారాములు లక్ష్మీనారాయణు లనే విశ్వాసం వాడుకలో ఉండేది. ఈ అంశాన్ని ఆయన తన రచనలో తరుచుగా ఉదాహరించాడు. ఆయన కావ్య నామం రామావతారం. కాగా, సాక్షాత్ లక్ష్మీదేవి అవతార మైన సీతను రావణుడు, అందులోనూ మలిన మనస్కుడై వచ్చిన ఆ లంకేశ్వరుడు, స్పృశించడం అవాంఛనీయం అనే ఉద్దేశంతో కంబకవి ఇలా పేర్కొని వుండ

వచ్చు. పూర్వపు శాపాన్ని స్ఫురణకు తెచ్చుకుని రావణుడు సీతను తాక లేదని ఒక కారణం కూడా తెలియజేశాడు. అదీకాక పతివ్రత అయిన సీతను కుటిల చిత్తుడైన పర పురుషుడు తాకడం ఆనాటి ప్రజల దృష్టిలో అవాంఛనీయమే కాక క్షంతవ్యం కూడా కాదు. కనుకనే లోకజ్ఞుడైన కంబకవి బుద్ధి పూర్వకంగానే యీ మార్పు చేసి వుంటాడు. ఆయన చేసిన మార్పులలో ముక్కాలు మువ్వీసం కథా గౌరవాన్ని ఇనుమడింపజేసేవే కాని అన్యములు కావు. ఈ దృష్టితో చూసి నప్పుడు తార విషయంలో కూడా ఆయన చేసిన మార్పు సమర్థనీయంగానే కనిపిస్తుంది.

కంబ రామాయణం ప్రకారం, వాలి మరణానంతరం అతని భార్య తార సుగ్రీవుని వలపు నేస్తంగా కాక విరక్త మనస్కగా ఉండిపోయింది; అనగా వాలి భార్యగానే ఉండిపోయింది. ఇది కూడా కంబన్ కాలం నాటి విశ్వాసాలకు అనుగుణంగా ఉన్నది. ఎందుకంటే, పంచ కన్యలలో తార ఒకతె. కడమ వారు— అహల్య, ద్రౌపది, సీత, మండోదరి ప్రభృతులు. పైగా తారను ప్రవేశపెట్టిన తీరు హృద్యం. అది కంబకవి పాత్ర పోషణ కౌశలానికి కర్పూర నీరాజనం పడుతున్నది.

వాన రోజులు వెనక పట్టాయి. అయినా అనుకున్న ప్రకారం, సుగ్రీవుడు యుద్ధ సన్నాహాలకు దిగలేదు. అది రాముడికి కోపకారణ మయింది. అసలు విషయం తెలుసుకోవాలని, అన్నగారి కోరిక మేరకు లక్ష్మణుడు కిష్కింధకు ప్రయాణ మయ్యాడు. ఉగ్రమూర్తియై వస్తున్న లక్ష్మణమూర్తిని చూసి వానర వీరులు భయభ్రాంతు లయ్యారు. అప్పుడు మద్యపాన రక్తుడైన సుగ్రీవుడు మన లోకంలో లేడు. ఈ విషయాలు తారదాకా వెళ్ళాయి. అప్పుడు స్త్రీజన పరివృతయై తార రామానుజుణ్ణి సమీపించింది. వాళ్లని చూడగానే అగ్నిపర్వతం వంటి లక్ష్మణుడు శాంతమూర్తియై, లజ్జాభరంతో తల వంచుకున్నాడు. 'మీ రాకతో మా భవనం పునీత మయింది. రాముణ్ణి ఒంటరిగా విడిచిపెట్టి మీ రిక్కడికి రావడం విడ్డూరంగా ఉంది. మీ కోపాన్ని చూసి మా వానరు లందరూ భయవిహ్వాలు లయ్యారు. ఇంతకూ మీ రాకకు కారణం?' అని తార అడిగింది. కమ్మని కంఠంతో తార పలికిన అ మధురోక్తులు లక్ష్మణుణ్ణి ఆశ్చర్యంలో ముంచి వేశాయి. ఇంత మధురంగా మాట్లాడిన యీ వానర భామిని ఎవరా? అని లక్ష్మణుడు తల పైకెత్తి చూశాడు. అతని మనస్సు వికావికలై పోయింది. ఎదుట నిలబడిన

తార శ్వేత వస్త్రధారిణి, నుదుట కుంకుమ బొట్టు లేదు, మెడలో మాంగల్యాది పవిత్ర భూషణాలు లేవు, ఆమెను చూడగానే, అదే అవస్థలో అదే ఆకృతిలో అయోధ్యలో ఉన్న తన తల్లులు గుర్తుకి వచ్చారు, లక్ష్మణుడికి. అతని గుండె దుఃఖంతో నిండిపోయింది, అతను శాంత చిత్తు డయ్యాడని వేరే చెప్పాలా ?

ఈ సన్నివేశాన్ని పరికించిన తర్వాత, కంబడి విమర్శకులు సైతం ఆ మహాకవి ప్రదర్శించిన అనల్ప కల్పనా చాతురికి కైమోడ్పు ఘటించక తప్పదు,

భాషా విషయకంగా, సాంస్కృతికంగా తెలుగువారూ తమిళులూ సన్నిహితు లైనా, ఎందువల్లనో కంబ రామాయణం వంటి కమనీయ కావ్యాలు తెలుగులో అంతగా ప్రచారం గడించలేదు. ఆదిపూడి సోమనాథరావుగారు (1867-1941) కంబ రామాయణాన్ని పద్య కావ్యంగా తెలుగు చేశారు (చూ. విజ్ఞాన సర్వస్వము, నాలుగవ సంపుటము, తెలుగు సంస్కృతి-2, 1961, పుట 1231), కాని యిది ముద్రిత మైనట్లు తెలియడం లేదు. పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారి ఆంధ్రానువాదం, రెండు సంపుటాలలో, ముద్రితమై ప్రచారంలో ఉన్నది,

కంబ రామాయణ ప్రభావం తెలుగు కవులమీద లేదనడం స్పష్టం, కాని జానపద కవులు కొందరు కంబ రామాయణంలోని ఒకటి రెండు సన్నివేశాలను అనుకరించినట్లు తెలియ వస్తున్నది.

సీతాపహరణ వృత్తాంతాన్ని సంక్షేప రామాయణ కర్త ఇలా వివరించాడు :

'....పది తలలు రాక్షసుడు జూపె
పది తలలు జూపగా వడి మూర్ఛబొందె
మూక మామిడి విరిగి పడ్డ చందమున
గోరు చుట్టూపయిని రోకలీ పోటు
చెవులో పోటుకు తోడు సన్నాయి జోడు
జంకుచు కనుమూసి వణుకుచు నున్నట్టి
భూమిపై నున్నట్టి భూపుత్రి జూచి
గడ్డ పెల్లాగించి రథము పైబెట్టి
ఘగ దీరెనని తలచి గగనమున కెగిరి,'

రావణుడు సీతను తాకడానికి భయపడ్డాడనీ, అందువల్ల ఆమె నిలబడిన గడ్డను పెల్లగించి అపహరించాడనీ టిబెటన్ రామాయణం పేర్కొన్నది ఇందుకు భారతీయుల విశ్వాసమే ఆధారమని చెపుతూ డా॥ వి. రాఘవన్ కంబ రామాయణాన్ని ఉదాహరించారు (The Ramayana in Greater India, పుట 12). కంబ రామాయణ ప్రభావం థాయ్‌లాండు రామ కథ మీద కూడా కానవస్తున్నదని ఆయన అభిప్రాయం.

కంబన్ స్వదేశాభిమానం ఆయన రచనలో పలుచోట్ల ప్రదర్శిత మయింది. ఆయన చేసిన అయోధ్యా నగర వర్ణన చదువుతుంటే, ఆ నగరం కావేరీ తీరాన ఎక్కడో ఉన్నట్లు అనిపిస్తుంది. ఆ కవి చక్రవర్తికి తెలుగు దేశమూ సుపరిచితమే అనవచ్చు. కాకతీయ నృపుల కాలంలో ఆయన ఓరుగల్లు దర్శించినట్లు తెలియ వస్తున్నది. ఉత్తమ కవిత గౌతమీ ప్రవాహంలా ఉండాలని ఆయన అభిలషించాడు. గోదావరిని ఆయన దర్శించినట్లు ఆయన చెప్పిన పద్యాన్ని పురస్కరించుకుని పేర్కొనవచ్చు. కొన్ని తెలుగు మాటలు కూడా ఆయన రచనలో చోటు చేసుకున్నాయి, తమిళభాషా స్వభావం అనుసరించి కొన్ని పేర్లలో కొద్దిపాటి మార్పులు చేయబడ్డాయి. కౌసల్య-కొ చకై, దశరథుడు-దయరతన్; మహాపార్శ్వుడు-పెరుం పాక్కన్; ధూమ్రాక్షుడు-పుగై నిరక్కణ్ణన్—మొదలైనవి యిందుకు ఉదాహరణలు. ఇలా కొన్ని పేర్లను తమిళం చెయ్యడంవల్ల, కంబన్ సంస్కృత భాషాభిమాని కాడని అనుకోవడం పొరపాటు. ఆయన సంస్కృత భాషాభిజ్ఞుడు, వాల్మీకి అన్నా, రామకథా అన్నా ఆయనకి అపారమైన గౌరవం.

కంబ రామాయణంలో వర్ణించబడిన సర్వమానవ సౌభ్రాత్ర దృక్పథం ముఖ్యంగా పేర్కొన దగిన అంశం. ఇదే ఆ కవిరాజు ప్రసాదించిన సందేశ మని అభిజ్ఞుల అభిప్రాయం. ఆటవికుడైన గుహుడు ప్రదర్శించిన భక్తికి మెచ్చుకుని రాముడు ఇలా అన్నాడు: 'అయోధ్యలో మేము నలుగురం అన్నదమ్ములం; కాని యిప్పుడు అయిదుమంది అయినాము.' వానరుడైన సుగ్రీవుణ్ణి చూసి, 'యిప్పుడు మేము ఆరుగురము' అంటాడు. రాక్షసుడైన విభీషణుడితో చెలిమి యేర్పడిన తర్వాత, 'యిప్పుడు మేము ఏడుగురం అన్నదమ్ములం' అని హర్షం ప్రకటిస్తాడు రాముడు. ఈ విధంగా కంబ రామాయణంలో వివిధ వర్గాల వారి మధ్య సోదరభావం స్థాపించబడింది.

కంబకవి షట్కాండలు మాత్రమే రచించాడు, ఉత్తరకాండను వాణిదాదన్ అనే కవి వ్రాశాడు. కాని అది ఒట్టక్కూత్తర్ అనే కవివతంసుని రచన అని కొందరి అభిప్రాయం,

18 వ శతాబ్దివాడైన అరుణాచల కవి రామకథను కీర్తనల రూపంగా వెలయించాడు. ఈ గ్రంథం పేరు రామాయణ కీర్తనై. రామ నాటక మనీ వ్యవహరిస్తారు. గేయాంశం నిండినదీ సాహిత్యపు విలువ కలదీ కావడం వల్ల, నేటికి యిది ప్రచారంలో ఉన్నది. స్వామినాథ పిళ్లై రామ నాటకం, ...ందయ్య పిళ్లై రామ విలాసం, భవానందం పిళ్లై సీతా కల్యాణం మొదలైనవి యితర రామాయణ నాటకాలు. 19 వ శతాబ్దికి చెందిన భక్తకవి రామలింగస్వామి రామ నామ మహత్త్వమును గురించి తన తిరు అరుట్పాలో వివరించాడు.

ఆధునికులలో కొట్టైయూర్ సుబ్రహ్మణ్య అయ్యరు 9,379 పద్యాలలో రామాయణ వెణ్బా రచించారు. ఇది సమగ్ర రామాయణం. టి. వెంకట కృష్ణ అయ్యంగారు రఘువంశ కావ్యం అనే బృహత్కావ్యం సంతరించారు. రావణుణ్ణి నాయకుడుగా చేసి పులవర్ కుళందై రావణ కావ్యం వ్రాశారు. ఇది వెయ్యి పద్యాల రచన. ఇంకా కొందరు రామకథా సంబంధి రచనలు చేశారు. నటేశ శాస్త్రి, సి. ఆర్. శ్రీనివాస అయ్యంగారు ప్రభృతులు వాల్మీకి రామాయణాన్ని పూర్తిగానో కొన్ని భాగాలనో తమిళం చేశారు. అధ్యాత్మ రామాయణాదులు కూడా తమిళం చెయ్యబడ్డాయి. వీరై ఆళవందార్ అనే కవి 2 055 పద్యాలలో జ్ఞానవాశిష్ఠ అమల రామాయణం రచించారు.

ఇటీవల శ్రీమతి హో. కి. వాలం అనే కవయిత్రి రచించిన 'ఇరామాయణ రత్నాకరం' అనే గ్రంథం వెలుగులోకి వచ్చింది. వాల్మీకి, కంబన్, తులసీదాసుల రామాయణాలను తులనాత్మకంగా పరిశీలించి సంతరించబడిన గ్రంథ మిది.

ఉపసంహారంగా, అతి ప్రాచీనమైన సంగయుగం మొదలుకొని నేటి దాకా రామకథ తమిళ రచయితలనూ, పాఠకులనూ ఆకర్షిస్తున్న దనవచ్చు. మదరాసు, మధుర, తిరుచ్చిరాపల్లి వంటి పట్టణాలలో రామాయణం పురాణంగానో సంగీతోపన్యాసంగానో (హరికథ) చెప్పబడుతూ వుండడం గమనించదగిన విషయం. ఇది ఆ కథకు గల ప్రచారానికి నిదర్శనం. తమిళ రామకథా వాఙ్మ

యానికి కంబ కవి ప్రసాదించిన రామాయణం తలమానికం అనడం అత్యుక్తి కానే కాదు.

రామ కథను 16 పాదాలలో అభివర్ణించే ఒక ప్రాచీన జానపద గేయంతో (జోలపాట) ఈ సమీక్షను ముగిస్తాను.

'తల్లి మాట మేరకు
రామ చంద్రుడు నడిచె.
పర్ణశాల వేసీ
స్వామి నిదుర బోయెను.
ఏమి తెలియని సీత
జింక కావలె నంచు
కోరగానే, స్వామియు
బయలుదేరె నడవికి.
బిచ్చ మనగ రావణుడు
వేసె నపుడు జానకి.
బిడియపడక సీతను
తీసుకొచ్చె లంకకు.
శిరోరత్న మొసగీ
హనుమ నపుడు పంపీ
సీత చెరను బాపెను
స్వామి రామ చంద్రుడు.

# జంట కావ్యాలు

## మణిమేకలై

మణిమేకలై, సిలప్పదిగారం, జీవకచింతామణి, కుండలకేశి, వళయాపతి —ఈ అయిదూ తమిళ పంచ కావ్యము లని వ్యవహారం. వీటిలో తొలి మూడూ నాడూ నేడూ ప్రచారంలో ఉన్నవే. కడపటి రెండూ నేటికీ నామ మాత్రంగానే ఉన్నవి.

రచనా కాలమును పురస్కరించుకొని పరిశీలిస్తే, ఈ కావ్య పంచకంలో మణిమేకలై తొలుత వెలుగులోకి వచ్చినట్లు తెలియ వస్తుంది. కాని కథా దృష్టితో చూస్తే మాత్రం మంజీర మహిమ అనే అర్థమిచ్చే సిలప్పదిగారం తొలుత వెలువడినట్లు స్ఫురిస్తుంది. ఏది ఎలా వున్నా, ఈ రెంటినీ జంట కావ్యా లనవచ్చు. సిలప్పదిగారంలో మాధవీ కోవలుల ప్రణయ గాథ మధురమోహనంగా వర్ణించబడగా, వారికి ప్రభవించిన మణిమేఖల పవిత్ర గాధ మణిమేకలై కావ్యంలో అందాలు దిద్దుకుంది. ఈ విధంగా ఒక బృహత్కథ ఈ రెండు కావ్యాలకు ఇతివృత్త మయింది.

మణిమేకలై కావ్యానికి 'మణిమేకలైతురవు' అనే నామాంతరం కూడా ఉన్నది. మణిమేఖలా సన్యాసమని దీని అర్థం. ఈ కావ్యమును శాత్తనార్ అనే మహాకవి సంతరించాడు. కాని ఆయన విఖ్యాత నామం శీత్తలై శాత్తనార్. శీత్తలై అంటే చీముకారే తల అని అర్థం. భాషలో గాని భావంలో గాని దోషమేదైనా కనిపించడం తరువాయి, వెంటనే ఆయన తాను వ్రాసే యినుప గంటంతో తలను పొడుచుకునే వాడట ! ఈ కఠిన నియమానికి ఫలితంగా ఆయనకు శీత్తలై శాత్తనార్ అనే వ్యవహార నామం కలిగినట్లు చెపుతారు.

తమిళ వాఙ్మయ చరిత్రలో తొలి యుగమైన సంగకాలంలో శాత్తనార్ నివసించినట్లు తమిళ పండితుల విశ్వాసం. కాగా ఆయన అతి ప్రాచీను డని చెప్పవచ్చు. బహుశః క్రీస్తు శకం రెండవ శతాబ్దిలో జీవించి వుండవచ్చు. ఆయన మధురా నగర ధాన్య వర్తకుడట. ఇంతకు మించి మణిమేకలై కావ్యకర్తను గురించి విశేషాలు తెలియరాక పోవడం దురదృష్టం.

ముప్పయి గాథలుగా విభజించబడిన యీ కావ్యంలో, ఆనాళ్ళలో తమిళ నాడులో వర్ధిల్లిన బౌద్ధ సంఘం కళ్ళకు కట్టినట్లుగా వర్ణించబడింది. బౌద్ధ మతాను యాయుల విశ్వాసములు, పూజా విధానములు, వారి ఆచార వ్యవహారములు మొద లైనవి వివరించబడినవి. కనుక ఇది బౌద్ధమత సిద్ధాంతములను తెలియజేసే ప్రశస్త కృతి అని పేర్కొన వచ్చు. కేవలం మత సిద్ధాంత గ్రంథమే అయితే, దీనికి కావ్య గౌరవం లభించి వుండేది కాదు. మణిమేకలై దార్శనిక వేషం వేసు కున్న ప్రశస్త కావ్యం అనడం సమంజసం. వేశ్యా గృహంలో జన్మించినా, వైభ వాల జోలికి పోకుండా శ్రావికగా జీవితం గడిపిన మణిమేఖల దివ్య చరిత్రను అభివర్ణించే కృతి కావడంవల్ల, దీనికి మణిమేఖలా సన్న్యాసం అనే పేరు కలగడం సమంజసమూ, సహేతుకమూను,

ప్రాచీన కాలంలో వర్ధిల్లిన తమిళ రాజ్యత్రయంలో ఎన్నదగింది చోళ రాజ్యం. చోళులకు తొలుత ఒరయూరు రాజధానిగా ఉన్నా, కరికాల చోళ మహీ పతి కాలంలో కావేరీ పూంపట్టణం ముఖ్య పట్టణంగా ఉండేది. ఆ నగరంలో కోవలుడనే వణిక్ ప్రముఖు డొకడు ఉండేవాడు; వ్యాపార రహస్యాలే కాక, సంగీత శాస్త్ర రహస్యాలు కూడా అతనికి కొట్టిన పిండి; మహా రసికుడు. అతని యిల్లాలి పేరు కణ్ణకి. వారి దాంపత్యం కొంతకాలం పాటు ఆదర్శప్రాయంగా సాగింది. కాని కోవలుడు మాధవి అనే వెలకాంత వలలో పడడంతో, అతని జీవితం పెడదారి పట్టింది.

మాధవి అందాల బరిణె. సంగీత నాట్యశాస్త్రాలలో అందెవేసిన చేయి. ఆమె మీది మోహం కొద్దీ, పరమ సాధ్వి అయిన కణ్ణకిని కూడా మరిచిపోయి, కోవలుడు మాధవితోనే దివారాత్రాలు గడపసాగాడు. మాధవీ కోవలుల ప్రణయ వల్లరి ఫలించి సఫలత చెందింది. ఆ శిశువునకు మణిమేకలై (మణిమేఖల) అని నామకరణం చేశారు,

అ తర్వాత, కొన్నాళ్ళకు మాధవి శీలమును శంకించి కోవలుడు కణ్ణకిని చేరుకున్నాడు. కాని కావేరీ పూంపట్టణంలో ఉండడానికి అతనికి మనస్కరించ లేదు. అందువల్ల కణ్ణకి కోవలులు మధురకు (పాండ్య మండలం) వెళ్ళడం, అక్కడ కోవలుడు దుర్మరణం చెందడం, ఆ కోపావేశంలో కణ్ణకి మధురా నగ రాన్ని బూడిదపాలు చేయడం, కోవలుని దుర్మరణవార్తను విని మాధవి తన సర్వస్వం త్యజించి ఒక బౌద్ధ శ్రమణుని పాద సన్నిధిని ఆశ్రయించడం మొద లైనవి మాధవీ కోవలుల జీవితంలోని కొన్ని ముఖ్య సంఘటనలు,

కణ్ణకి పాతివ్రత్య మహిమకు ముగ్ధురాలైన మణిమేఖల కూడా ఐహిక జీవితాన్ని రోసి మున్యాశ్రమం ప్రవేశిస్తుంది. అప్పటి కామె పదమూడేళ్ళ పడుచు.

ఈ వివిధ విషయాలూ సిలప్పదిగారం కావ్యంలో ఎంతో సుకుమారంగా తీర్చి దిద్దబడినవి. వీటిని తెలుసుకుంటేనే కాని, మణిమేకలై కావ్యంలోని కథ సులభంగా అర్థం కాదు.

ఇంద్రోత్సవ ప్రకటనతో మణిమేకలై కావ్యం ప్రారంభ మవుతుంది. ప్రతి సంవత్సరమూ కావేరీ పూంపట్టణంలో మహావైభవంగా ఇంద్రోత్సవం జరిగేది. ఆ సందర్భంగా మహారాజు సమక్షంలో మాధవి నాట్యం చేసేది, ఇది ఆమెకు వంశానుగతంగా వచ్చిన ఆచారం. కాని ఆ యేడు ఆమె ఇంద్రోత్సవంలో పాల్గొన లేదు. మణిమేఖల కూడా పాల్గొనలేదు.

ఇంద్రోత్సవ ప్రకటన ఎలా జరిగేదో చూడండి,

చోళమండలం వర్ధిల్లాలి ! కావేరీ పూంపట్టణం వర్ధిల్లాలి ! మన మహారాజు గారి న్యాయ పరిపాలన వర్ధిల్లాలి ! నెలకు మూడు వానలు చొప్పున చోళ మండల మంతా కురిసి, దేశం సస్యశ్యామలంగా ఉండాలి, విజ్ఞులారా! వినండి: మన ప్రభువులూ మంత్రివరేణ్యులూ ప్రతి సంవత్సరం వలె ఈ సంవత్సరమూ ఇంద్రోత్సవం జరపడానికి నిశ్చయించారు. రేపు సహస్రాక్షుడు సపరివారంగా మన నగరానికి విచ్చేయ నున్నాడు, కనుక మామిడాకుల తోరణాలు, అరటి కంబములు, చెరకు గడలు మొదలైన వాటితో మీ యిళ్ళను అలంకరించండి. ఇళ్ళూ వాకిళ్ళే గాక వీధులు కూడా శుభ్రంగా ఉండాలి. పాత యిసుకను తీసివేసి కొత్త యిసుకతో బాటలను నింపండి. పూర్ణకుంభాలతో దీపధూపాలతో ఇంద్ర భగవానుని ఆహ్వానించండి, జెండాలు ఎగురవేయండి, దేవ మందిరములన్నీ పరిశుభ్రంగా ఉండాలి, కల్యాణ మండపాలలో జరిగే పురాణ కాలక్షేపాలను శ్రద్ధగా వినండి. దేవతలూ మానవులూ కలిసి మెలిసి సంచరించనున్న యీశుభ సమయంలో విరోధులు తమ శత్రుత్వాన్ని విస్మరించి మిత్రులవలె మెలగాలి, ఉత్సవం బాగా జరపండి శాంతి సౌఖ్యాలు వర్ధిల్లాలి. కరువు కాటకాలు నశించాలి. జ్వరాది భయాలు నశించాలి.

ఈ కథా ప్రారంభం కావ్యానికి ఎంతో జిగినీ బిగినీ సమకూర్చింది. డొంక తిరుగుడుగా కాకుండా సూటిగా కథ చెప్పడం జరిగింది. ఆ తర్వాత కథ శర వేగంగా ముందుకు సాగుతుంది. కాని ఉప కథలెన్నో చెప్పబడడం వల్లనూ, మధ్య మధ్య వివిధ మతములకూ సంబంధించిన విషయాలు పేర్కొనబడడం వల్లనూ, కొంచెం శ్రద్ధగా చదివితేనే గాని, ప్రధాన కథ అర్థం కాదు.

లావణ్య లతిక అయిన మణిమేఖలను ఉదయకుమారుడు అనే యువకుడు ప్రేమిస్తాడు. అతడు యువరాజు. ఒక నాడామె పుష్పసంచయనార్థమై ఉపవన మనే సుందరోద్యానమునకు వెళ్ళినట్లు తెలుసుకుని, ఉదయకుమారుడు ఆమెను తన వశం చేసుకోవాలని అభిలషించడమే కాక ప్రయత్నిస్తాడు కూడా. అప్పుడు మణిమేఖల అనే ఒక దేవత ప్రత్యక్షమై ఆమెను కాపాడుతుంది. అందువల్ల అతని ప్రయత్నం బూడిదలో పోసిన పన్నీరవుతుంది.

ఆ దేవత మణిమేఖలకు దుఃఖ భూయిష్ఠమైన ఐహిక జీవితానికి సంబంధించిన అనేక విషయాలు తెలియజేస్తుంది. అంతే కాదు; మణి పల్లవం అనే ద్వీపానికి తీసుకు వెడుతుంది.

ఆ తర్వాత మణిమేఖలా దైవం ఉదయకుమారునికి స్వప్నంలో సాక్షాత్కరించి ఇలా హితోపదేశం చేస్తుంది : 'యువరాజా ! ఈ రాజ్యమునకు రాజుగా ఉండవలసిన నీవు ధర్మచ్యుతుడవైనచో వానలు కురియవు; దేశము సుభిక్షముగా ఉండదు. నీ ఆత్మ గౌరవమును నీవు సంరక్షించుకొనునట్లుగా, ప్రజల గౌరవమును కూడ నీవు కాపాడవలెను. లేకుంటే రాజ్య భ్రష్టుడవవుతావు. కామాతురుడవై ఒక స్త్రీని—అందులోను వేశ్యా కులములో జన్మించిన స్త్రీని—బలాత్కారం చేయ బూనుటకంటె ధర్మ విరుద్ధమైన కార్యం మరొకటి లేదు.'

ఆ తర్వాత మణిమేఖలకు ఆ దేవత మూడు మంత్రములు ఉపదేశిస్తుంది. పూర్వ జన్మలో ఉదయకుమారుడే తన భర్త అనే విషయమును కూడా ఆమె తెలుసుకుంటుంది. అమృతసురభి అనే అక్షయ పాత్రను పొందుతుంది, దాని సహాయంతో ఆమె ఎన్నో అద్భుత కార్యాలు చేస్తుంది. అన్ని అనర్థములకూ మూల కారణమూ, మానవ జాతికి ప్రబల శత్రువూ, విద్యా భ్యాసమునకు చుక్కెదురూ, గౌరవ హానికి దోహదకారీ అయిన క్షుద్బాధను మటుమాయం చెయ్యాలని మణిమేఖల ఆశించింది.

ఆ అక్షయ పాత్రవల్ల అన్నార్తులకు కావలసినంత ఆహారం లభించింది. వారు సంతుష్టులు కావడంతో మణిమేఖలకు ఏనుగెక్కినంత సంతోషం కలిగింది. ఒక అనాథ శరణాలయంలో ఆమె కాలం గడపసాగింది.

ఇలా ఉండగా ఒకనాడు ఉదయకుమారుడు మణిమేఖలను సమీపించాడు. ఆమె మీది మోహం అతని కింకా తగ్గలేదు. "ఎందు కిలా భిక్షుకి వైనావు ?" అని ప్రశ్నించాడు.

యువరాజుని చూడగానే ఆమెకు తన పూర్వజన్మ వృత్తాంతం స్ఫురణకు వచ్చింది. అతని మీద అపారమైన ఆదరభావం కలిగింది. అప్పు డామె ఇలా అన్నది : "ప్రభూ! పుట్టుట, పెరుగుట, గిట్టుట మొదలైనవి శరీరం అనుభవించి తీరవలసిందే! అందువల్ల బౌద్ధమత వ్యాప్తికోసమూ, దానధర్మాలు చేసేందుకూ ఈ భిక్షుకి వేషం ధరించాను".

ఆమెను చూసేకొద్దీ ఉదయకుమారుని మోహం శ్రుతి మించి రాగాన పడింది. అది ఆమె పసిగట్టింది. వెంటనే ఒక మంత్రం ఉచ్చరించి అప్పటి కప్పుడు కాయచండిక అనే ఒక స్త్రీ వేషం ధరించింది. అయినా యువరాజు మనస్సు మాత్రం ఆవంత కూడా మారలేదు. ఆమెను ఎప్పటికైనా సరే తన వశం చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు.

కాయచండిక వేషం ధరించిన మణిమేఖల ఒకరోజు కారాగృహంలో ఆకలి దప్పులతో బాధపడే దీనుల్ని చూడడం జరిగింది. వెంటనే తన వద్ద ఉన్న అక్షయపాత్ర సహాయంతో వాళ్ళ ఆకలి దప్పులు తీర్చింది. అంతే కాదు; ఆ కారా గృహమును ధ్వంసం చేయించి అక్క డొక అనాథ శరణాలయం నిర్మింపజేసింది. అనతికాలంలోనే ఆ పరిసరాలలో సుందర మందిరాలు కొన్ని వెలసినవి, ఒక బౌద్ధ పీఠం కూడా నిర్మించబడింది.

కామాంధుడైన యువరాజు చివరికి ఎలాగో తెలుసుకో గలిగాడు, కాయ చండిక వేషం ధరించిన స్త్రీ మణిమేఖలే అని. ఆమెను సమీపించాడు. మళ్ళీ ఆమె హితబోధ చేసింది. ఇంతలో అసలు కాయచండికను వెతుకుతూ ఆమె భర్త అక్కడికి చేరుకున్నాడు. మణిమేఖల యువరాజుతో మాటలాడడం చూచి అతడు ఆమె శీలాన్ని శంకించాడు. ఆ రాత్రి అమెను కలుసుకోవాలనే అభిలాషతో ఉదయకుమారుడు అక్కడికి వచ్చాడు. అప్పుడు కాయచండిక భర్త ముందు వెనుకలు చూడకుండా యువరాజుని హత్య చేశాడు. అప్పటికిగాని అతని కోపం చల్లారలేదు; కసి తీరలేదు. ఈ విషాద దృశ్యాన్ని కళ్ళార చూసిన మణిమేఖలకు యువరాజు మీద జాలి కలిగింది. మళ్ళీ తన నిజ వేషం ధరించింది.

యువరాజు దుర్మరణానికి మణిమేఖలే కారణమనుకొని, ఆగ్రహావేశాలకు లోనయిన ప్రజలు అమెను ఎక్కడ బాధిస్తారో అని భయపడి రాజు మణిమేఖలను కారాగృహంలో బంధించాడు. కాని రాణి మాత్రం ఆమెపై కసి తీర్చుకోవాలని ఆశించింది ఆమెను నానాబాధలు పెట్టించి. కాని మణిమేఖలా దైవం ఆ విపత్స

మయంలో ఆమెను కాపాడింది. చివరికి జరిగిన విషయం తెలుసుకుని రాణి పశ్చాత్తాపం చెందింది.

ఆ తర్వాత మణిమేఖల కారాగారం నుంచి విడుదల చేయబడింది. అక్షయపాత్ర సహాయంతో క్షుధార్తులను తృప్తి పరుస్తూ, వివిధ మతస్థుల ఆశ్రమములకు వెళ్ళి, ఆయా మత రహస్యాలు తెలుసుకుంటూ ఆమె కొంతకాలం గడిపింది. ఆమెకు తథాగతుని ధర్మోపదేశాలు నచ్చినట్లుగా ఇతర మతాచార్యుల ఉపదేశములు నచ్చలేదు. చివరకు అరవణ పూజ్యపాదులను సందర్శించింది, ఆయన అభిమతం ప్రకారం మణిమేఖల బౌద్ధ భిక్షుకి అయింది. తన యావజ్జీవితాన్ని బౌద్ధ ధర్మ నిర్వహణకు మీదు గట్టింది. జనన మరణాదులకు అతీతమైన నిర్యాణమును ప్రధాన లక్ష్యంగా భావించి, మణిమేఖల తథాగతుని ధర్మోపదేశములను అధ్యయనం చేస్తూ కాలం గడపసాగింది.

సంగ్రహంగా చెప్పవలెనంటే, మణిమేకలై కావ్యంలోని ప్రధాన కథ ఇది. నిజానికి కథా ప్రధానమైన కావ్యం కాదిది; బౌద్ధ మత ధర్మములను తెలియజేసే ప్రశస్త రచన యిది. కనుక మణిమేఖల కథను పురస్కరించుకుని, తత్కావ్య కర్త బౌద్ధ మత ధర్మములను విశదీకరించినట్లు భావించవచ్చు.

మణిమేకలైలో చోటు చేసుకున్న బౌద్ధ మత సిద్ధాంతములను దిఙ్మాత్రంగా పరిశీలిద్దాము :

"సర్వ విషయములకును ధర్మమే ప్రాతిపదికగా ఉండవలెను. ధర్మమనగా న్యాయము—తథాగతుడు ధర్మ స్వరూపుడు. అతడీ ప్రపంచమునకు—అనగా సంఘమునకు—ధర్మోపదేశము గావించెను. కనుకనే బౌద్ధులకు బుద్ధుడు, సంఘము, ధర్మము శరణ్యము లగుచున్నవి. శాక్యర్షి అయి బుద్ధుడు ధర్మ ప్రవర్తకుడు. చీకు చింతలు, జంతు బలులు, అర్థ రహితములైన పూజా పురస్కారములు, విరుద్ధాచారములు—మొదలైనవి కరుడు గట్టుకున్న ఆ దినములలో గౌతముడీ ప్రపంచములో అవతరించెను, అపమార్గముల సంచరించు మానవాళిని సంరక్షించు నిమిత్తమై అత డవతారమెత్తెను; జినేంద్రుడు సత్య చతుష్టయమును కనుగొని వాటిని లోకమునకు బోధించెను. ఆ నాలుగు సత్యము లివి ; ఈ ప్రపంచము దుఃఖ భూయిష్టమైనది. మోహమే దుఃఖమునకు మూలకారణము. మోహమును జయించిన నాడు మానవుడు దుఃఖమును కూడ జయింపగలడు, ఈ మూడింటి కంటెను మహోత్కృష్టమైన సత్యము నాలుగవది. అష్టాంగ మార్గమును

అనుసరించి నిర్వాణమును పొందవలెను. నిర్వాణ మనగా జనన మరణాదుల నుండి శాశ్వతముగా విముక్తి పొందుట. కర్మ సిద్ధాంతము సత్య సంపూర్ణము. పురాకృత కర్మల ననుసరించియే ఉత్తర జన్మలో మానవుడు శుభాశుభములు పొందగలుగుచున్నాడు. లోభమును విడనాడుటయు, ప్రేమ నలవరచుకొనుటయు, విజ్ఞానము నార్జించుటయు సత్కర్మకు ముఖ్య హేతువులు. వీటిని సాధించి జీవితము గడిపినచో, అది దుఃఖ భూయిష్ఠముగా ఉండదు.''

## సిలప్పదిగారం (మంజీర మహిమ)

తమిళ సాహిత్యంలో వెలసిన నీత్యుద్బోధక గ్రంథాలు కోకొల్లలు. వాటిలోనే కాక తమిళ సాహిత్యంలోనే ఉత్కృష్టమైన రచనగా తిరుక్కురళ్ భావించబడుతున్నది. ఇందులో చెప్పబడిన విషయాలు సార్వకాలికములు, సహృదయ రంజకములూను. ఈ ఉద్గ్రంథమును వెలయించిన మహాకవి తిరువళ్ళువర్ సహధర్మచారిణిని గురించి చెపుతూ ఇలా అన్నాడు :

'దెయ్‌వన్ తొళా అళ్ కొళు నట్రెళుత్తుళువాళ్
పెయ్యెన పెయ్యు మళై.'
(పరదైవముల వీడి పతిగొల్చు చాన
కురియు మన్నంతనే కురియదే వాన.)

ఈ కురళకి లక్ష్యప్రాయంగా వెలసిన జీవితం పతివ్రతా తిలక మైన కణ్ణకిది సతీదేవి అని వినుతి కెక్కిన ఆమె కథ సాహిత్యంలోనే కాక తమిళ ప్రజల హృత్సీమలలోనూ నేటికి నెలకొని వుండడం పేర్కొన దగిన అంశం. తమిళనాడులోనూ శ్రీ లంకలోనూ ఆమెకు ఆలయాలు వెలసినవి. తమిళనాడులోని మారియమ్మన్ కోవెలలు కణ్ణకి దేవాలయములని భావిస్తున్నారు ఆలాగే శ్రీలంకలోని కణ్ణకి గుడిని పత్ని ఆలయమని వ్యవహరిస్తున్నారు. 1

---

1. శ్రీలంకలోని కణ్ణకి గుడిని క్రీ. పూ. 176 లో గజబాహువు అనే రాజు నిర్మించినట్లు తెలియ వస్తున్నది.

భర్తృ మరణానంతరం విరక్త హృదయ అయిన కణ్ణకి మధుర నుంచి పధ్నాలుగు రోజులు ప్రయాణం చేసి ఒక కొండను సమీపించినట్లు సిలప్పది

కణ్ణకి కథను ప్రప్రథమంగా కమనీయ కావ్యంగా తీర్చిదిద్దిన కవివరేణ్యుడు ఇళంగో అడిగళ్. ఇళంగో అనగా యువరాజని అర్థం. అడిగళ్ అంటే పూజ్య పాదుడని అర్థం. చేరదేశపు మన్నీడు సెంగుట్టువనుకి సోదరుడు ఇళంగో. భ్రాతృ గౌరవం కొద్దీ ఆయన రాజ్యాధికారాన్ని సహర్షంగా త్యజించి సన్న్యాసాశ్రమం స్వీకరించాడు. అందువల్ల ఆయన్ని అడిగళ్ (పూజ్యపాదుడు) అని వ్యవహరించ సాగారు. ఇళంగో అడిగళ్ అనే వ్యవహార నామం తప్ప ఆయన నిజ నామధేయ మేమిటో చరిత్రకు నేటికీ తెలియ రాలేదు.

సిలప్పదిగారం అనే మాటకు మంజీర ప్రభావం అని అర్థం. అందెను (మంజీరము) తమిళంలో సిలంబు అంటారు అదికారం అనగా ప్రభావ మని అర్థం. అందెకు ప్రాధాన్యం కల కథ కనుక ఈ కావ్యానికి సిలప్పదిగారం అని సహేతుకంగా పేరు పెట్టబడింది.

సిలప్పదిగార కావ్య కథా కాలం నాటికి దక్షిణాపథంలో చేర, చోళ, పాండ్యము లనే రాజ్యాలు వర్ధిల్లేవి. వాటిని తమిళ రాజ్యత్రయ మని వ్యవ హరించే వారు.

చోళుల రాజధానీ నగరం పుహార్ అనే నామాంతరం కల కావేరీపూం పట్టణం ఆ నగరంలో మానాయకన్ (మహానాయకుడు) అనే వణిక్ప్రముఖుడు 2

---

గారంలో అభివర్ణితం ఆ తర్వాత చేరభూపతి సెంగుట్టువన్ ఆ కొండమీద కణ్ణకికి ఒక గుడి నిర్మించాడు. మధుర జిల్లాలోని కంబం—మేలై (పడమటి) కూడలూర్ గ్రామంలో నిర్మితమైన యీ గుడిని 1963 లో నవంబరు 17 న పురాతత్వ శాస్త్రజ్ఞులూ ప్రముఖ తమిళ పండితులూ మన్మిత్రులూ అయిన ఆచార్య సి. గోవిందరాజన్‌గారు గుర్తించారు,

సెంగుట్టువన్ కేరళలోని కొడంగళూర్‌లో కూడా కణ్ణకి దేవ్యాలయం నిర్మించినట్లు తెలియ వస్తున్నది. ఇది నేడు భగవతి ఆలయంగా ప్రసిద్ధి కెక్కింది.

2. సిలప్పదిగారం కావ్యంలో వణికన్ అనే శబ్దం ప్రయుక్త మయింది. వణికన్ అనగా వర్తకు డని సామాన్యార్థం. కాని వైశ్య కులస్థునికి కూడా వణిక శబ్దం ప్రయుక్తం. కాగా, వణికన్ అనగా వైశ్యు డని అర్థం చెప్పవచ్చు. Tamil Lexicon లో 'వణికన్' శబ్దానికి Person belonging to the Vaisya caste, వైసియ చాతియాన్ అని అర్థాలు చెప్పబడ్డాయి, అందువల్ల కణ్ణకి కోవలుడు మొద లైన వారు వైశ్యు లని భావించడంలో విప్రతిపత్తి లేదు.

ఉండేవాడు. ఆయన ధనికుడే కాక దాన నిరతుడు కూడా! ఆయన కుమార్తె పేరు కణ్ణకి. పదమూడవ యేట ఆ అందాల బరిణకు కోవలుడు అనే యువకునితో వేదోక్తంగా వివాహం జరిగింది. అతడు మాశాత్తువాన్ (మహాసత్త్వుడు) అనే వర్తక శ్రేష్ఠుని కుమారుడు. కోవలుడు సంగీత శాస్త్ర మర్మజ్ఞుడు, వైణికుడు. భరత శాస్త్రం కూడా అతనికి పరిచితమై ఉండెనట! పెళ్ళినాటికి కోవలుడు పదహారేళ్ళు నిండిన యువకుడు.

వివాహానంతరం, వంశానుగతంగా వస్తున్న ఆచారం ననుసరించి, ఆ నవ దంపతుల్ని మహాసత్త్వుడు ఒక ప్రత్యేక భవనంలో నివసింపజేశాడు అలా చేయడంవల్ల నవదంపతుల మధ్య సన్నిహిత సంబంధం సంఘటిల్లి, తత్ఫలితంగా వారి ప్రేమ వల్లరి నిరాఘాటంగా పెరిగి పెద్ద దవుతుందని ఆనాటి పెద్దల ఆశయం. కొంత కాలంపాటు కణ్ణకి కోవలుల సాంసారిక జీవితం పెద్దలు ఆశించినట్లే సౌఖ్యావహంగా సాగింది. ఆ తర్వాత దురదృష్ట వశాత్తూ కణ్ణకి జీవితాకాశాన్ని కారుమబ్బులు కమ్మివేశాయి.

ఒకనాడు కరికాల చోళ మహారాజు కొలువుకూటంలో మాధవి అనే నర్తకి నాట్య ప్రదర్శన ఏర్పాటు చేయబడింది ఆహ్వానితులలో కళారాధకు డైన కోవలుడూ ఉన్నాడు. తొలుత దేశి నాట్యం, పిదప ఆర్య నాట్యం చేసి లావణ్యలతిక అయిన మాధవి సభాసదుల్ని సంభ్రమాశ్చర్యాలలో ముంచివేసింది. అందరితోపాటు కోవలుడూ ఆమె ప్రతిభకు జోహారులు అర్పించాడు, కాని అతని హృదయ రంగస్థలం మీద మాత్రం ఆమె నాట్యం చేస్తూనే వున్నది.

చివరికి కోవలుడు మాధవీ మందిరం చేరుకున్నాడు. అతనికి ఆమెయే సర్వస్వ మయింది బంధు మిత్రాదులతో పాటు కణ్ణకిని కూడా విస్మరించాడు. వ్యాపారం మూలబడింది. కొన్నాళ్ళకు మాధవి కడుపు పండింది. కోవలుడు తండ్రి అయినాడు. వారి ముద్దుల కుమార్తె పేరు మణిమేఖల.

రోజులు గడుస్తున్నవి. ఋతువులు మారుతున్నవి. ప్రతి సంవత్సరమూ మహావైభవంగా జరుపుకునే ఇంద్రోత్సవం ఆ యేడూ వచ్చింది. కావేరీపూంపట్టణం కన్నుల పండువగా అలంకరించబడింది.

సముద్ర తీరాన ఇసుక తిన్నెలమీద ఆసీనులై మాధవీ కోవలులు వీణాగానం చెయ్యసాగారు. ఆనాటి పాటలలో ఇద్దరికీ అపశ్రుతులే వినిపించాయి, వారు

ప్రారంభించిన ప్రణయ గీతాలు ప్రళయ గీతాలుగా పర్యవసించాయి. తన మీద మాధవికి మోహం తగ్గినట్లూ ఆమె మనస్సు మరొకని మీద లగ్నమైనట్లూ కోవలుడు అనుకున్నాడు. అప్పు డతని కంటికి కణ్ణకి తప్ప మరెవ్వరూ కనిపించలేదు.

సరిగ్గా ఆ సమయాన కణ్ణకి ప్రియసఖి, బ్రాహ్మణి, శాత్తన్ (శాస్త) దేవాలయంలోని అర్చకురాలూ అయిన దేవంతి ఆమెకు దుఃఖోపశమనం కలిగించేలా హితోక్తులు వివరిస్తూ వుంది. కావేరీ ముఖ ద్వారంలోని సోమకుండం, సూర్య కుండం అనే తీర్థ రాజాలలో స్నానంచేసి కామదేవుణ్ణి కనక ఆరాధిస్తే నీ కష్టము లన్నీ తీరిపోగలవు—అని దేవంతి హితవు చెప్పింది స్నేహితురాలికి. అందుకు కణ్ణకి యిలా బదులు చెప్పింది : "తీర్థ స్నానం శ్రేయోదాయకమే. అయినా భర్తను దైవంగా భావించి నిష్కల్మషంగా జీవించే స్త్రీకి తీర్థస్నానాలు అంత ముఖ్యం కావు. అదీకాక పతిని కాక పర దైవములను సేవించడం మా వంశాచారమూ కాదు" తర్వాత దేవంతి తన యింటికి వెళ్ళిపోయింది.

చాలా కాలానికి తర్వాత ఆనాడు కోవలుడు మళ్ళీ తన యింట్లో కాలు పెట్టాడు. పతివ్రత అయిన కణ్ణకిని కళ్ళారా చూశాడు. తాను చేసిన తప్పు తలుచుకుని అతడు కంట తడి పెట్టాడు.

బ్రతికి చెడిన ఊరిలో తిరిగి వ్యాపారం చేయడానికి కోవలుడికి మనస్కరించలేదు. కణ్ణకిని సంప్రదించి, అతడు పాండ్య రాజ్యమునకు రాజధాని అయిన మధురా నగరానికి బయలుదేరాలని అభిలషించాడు. అ విషయం పరిచారక వర్గమునకు కూడా తెలియదు.

ఒకనాటి ఉదయం మూడవ కంటికి తెలియకుండా కణ్ణకి కోవలులు మధురకు ప్రయాణ మైనారు. దారిలో కౌంతి అనే జైనయోగిని కనిపించింది. వారు ముగ్గురూ నడక సాగించారు. కొన్నాళ్ళకు వారు మధురా నగరం పొలిమేర చేరుకున్నారు. అక్కడ యోగిని శిష్యురాలయిన మాధురి అనే ఆమె కనిపించింది. కణ్ణకి కోవలుల్ని ఆమెకు ఒప్పజెప్పి యోగిని తన ఆశ్రమానికి వెళ్ళిపోయింది,

మాధురి కణ్ణకి కోవలులకు ఒక బస యేర్పాటు చేసింది. వారికి కావలసిన ఆహార పదార్థాలు కూడా సమకూర్చింది. భోజనానంతరం కోవలుడు మధురకు దారి తీశాడు భార్య యిచ్చిన మంజీరమును తగిన వెలకు విక్రయించి, అందువల్ల లభించే ద్రవ్యంతో గౌరవంగా మళ్ళీ వ్యాపారం చెయ్యాలని అతని ఉద్దేశం.

ఎన్నో వీధులు దాటి దాటి, కోవలుడు చివరికి స్వర్ణకారులు నివసించే వీధి చేరుకున్నాడు. అతడు ఆస్థాన స్వర్ణకారుడు; మహా మాయావి! తన వద్ద ఉన్న మంజీరమును అతనికి చూపించి 'దీనికి తమరు వెల కట్టగలరా ?' అని కోవలుడు ప్రశ్నించాడు. దాన్ని చూడగానే అతని కళ్ళు తిరిగాయి. అటువంటి అందెను అంతకు మునుపెన్నడూ అతడు చూడలేదు. 'దీన్ని మా మహారాణిగారు తప్ప మరెవ్వరూ ధరించడానికి అర్హులు కారు, ఈ సంగతి మా ప్రభువులకు తెలియజేసి వస్తాను ' అంటూ ఆ స్వర్ణకారుడు అంతఃపురానికి పరుగు తీశాడు. తన అదృష్టం పండిందనుకున్నాడు కోవలుడు

అంతకు క్రితం ఆ స్వర్ణకారుడు రాణి నగల పెట్టెలో ఉన్న ఒక మంజీరమును తస్కరించి దానిని ఒక విదేశీ వర్తకుడికి విక్రయించాడు తాను చేసిన దొంగతనాన్ని ఇప్పుడు కోవలుడికి అంటగట్టాడు. పాండ్య మహీపతి నెడుంజెలియన్ ధర్మ ప్రభువే; అయినా రాణిని తృప్తిపరచాలన్న ఉబలాటం కొద్దీ, దొంగనైనా చూడకుండానే కోవలుణ్ణి కఠినంగా శిక్షించవలసిందిగా ఆజ్ఞాపించాడు. తమ స్వర్ణకారుడు మంచివాడనే గుడ్డి నమ్మకంతో రాజు అలా అనాలోచితంగా ప్రవర్తించాడు

రాజాజ్ఞను శిరసావహించి రాజభటులు కోవలుణ్ణి నిలుచున్న చోటనే వధించారు.

పిడుగువంటి ఆ వార్త కణ్ణకి చెవుల పడింది. తస్కరుడా నా భర్త ! తస్కరుడా నా భర్త ! అంటూ దిక్కులు దద్దరిల్లేలా గర్జించింది. తనవద్ద మిగిలి వున్న మంజీరమును చేత పట్టుకుని ఆమె పట్టణానికి బయలుదేరింది. దారిలో తన భర్త మృత శరీరంమీద పడి కన్నీరు మున్నీరుగా విలపించింది

ఆ తర్వాత కణ్ణకి తన మంజీరంతో రాజభవనానికి వెళ్ళింది. నెడుంజెలియన్ మహారాజుని దర్శించి జరిగిన విషయాన్ని వివరించింది. రాజు మొదట్లో కణ్ణకి మాటలు నమ్మలేదు "నీ భర్త దొంగ కాదని ఎలా నిరూపిస్తావు ?" అని ఎదురు ప్రశ్న వేశాడు.

"నిజం నిరూపించాలనే నే నిక్కడికి వచ్చాను. నా మంజీరంలో మణులున్నాయి మరి మీ మంజీరంలో ?" అని ప్రశ్నించింది కణ్ణకి.

"ముత్యాలు" అని రాజు బదులు చెప్పాడు. ఆ తర్వాత కోవలుడి వద్ద నుంచి గ్రహించబడిన మంజీరమును కణ్ణకికి ఇచ్చారు. అది తనదే అని ఆమె గుర్తు పట్టింది. ఆ అందెను బద్దలు కొట్టింది. మణులు.....మణులు.....

వెంటనే నెడుంజెలియన్ న్యాయ దండం వ్రాలింది; శ్వేతచ్ఛత్రం ఒరిగింది. సింహాసనం నుంచి క్రింద పడిపోయి రాజు విగత జీవు డయ్యాడు. ఆ తర్వాత మహారాణి అసువులు వీడింది ఒక్క క్షణంలో కల కల లాడుతూ వుండిన సభా భవనం వెల వెల పోయింది.

అయినా కణ్ణకి కోపం చల్లారలేదు. "ఈ అంతఃపురం కూడా నశించు గాక" అంటూ ఆమె పట్టణంలోకి వెళ్ళింది. రాజభవనం పరశురామ ప్రీతి అయింది. కోపం తగ్గని కణ్ణకి తన వామకుచం ఊడబెరికి మధుర మీదికి విసురుతూ "నేనే కనక పతివ్రతనైతే నా భర్తను హతమార్చిన దుష్టులకు నిలయమైన ఈ నగరం కూడా నశించు గాక" అని శపించింది. వెంటనే అగ్నిదేవుడు ప్రత్యక్ష మయ్యాడు; "అగ్నిదేవా ! న్యాయశీలురు, బ్రాహ్మణులు, గోవులు, పతివ్రతలు, వృద్ధులు, బాలురు—వీరిని విడిచిపెట్టి దుష్టుల్ని హతమార్చు" అని కణ్ణకి అర్థించింది

మధురా నగరం మంటల పాలయింది. అలా తాను ప్రవర్తించినందుకు పశ్చాత్తాపం చెందింది కణ్ణకి. అయినా ఆమెకు మనశ్శాంతి కరువయింది. మధురలో ఉండడానికి బుద్ధి పుట్టలేదు. మళ్ళీ నడక మొదలు పెట్టింది. పధ్నాలుగు రోజుల తర్వాత ఆమె చేర దేశంలోని తిరుచ్చెంకుంద్రు అనే కొండను చేరుకుంది. అప్పు డొక విమానం వచ్చింది దేవలోకం నుంచి. అందులో కోవలుడు ఉన్నాడు. ఆ విమానం ఎక్కి కణ్ణకి దేవలోకానికి వెళ్ళిపోయింది.

ఆ అద్భుత దృశ్యాన్ని తిలకించిన కురవలనే కొండజాతివారు వెంటనే ఆ విషయం తమ రాజుకి విన్నవించారు. సతీదేవి అయిన కణ్ణకికి ఆలయం నిర్మించే పనిలో నిమగ్ను డయ్యాడు రాజు.

కోవలుని దుర్మరణ వార్తను విన్న అతని అత్తమామలూ, జననీ జనకులూ దుఃఖార్ణవంలో మునిగి పోయారు. మహాసత్త్వుడు తన సిరిసంపదల్ని పేదసాదులకు దానంచేసి బౌద్ధ మతం స్వీకరించాడు మహానాయకుడు ఆజీవకమతం స్వీకరించాడు. మాధవి బౌద్ధ భిక్షుకి అయింది. ముక్కు పచ్చలారని మణిమేఖల తల్లితోపాటు బౌద్ధ సంఘారామంలో నివసించసాగింది. మాధురి ఆత్మహత్య చేసుకుంది. కౌంతి యోగిని ప్రాయోపవేశం చేసింది.

చోళ దేశంలో ప్రభవించి, పాండ్యమండలంలో పాతివ్రత్యం వెలయించి,

చేర దేశంలో భౌతికమును చాలించిన కణ్ణకి దివ్య చరిత్రను ఇలా సిలప్పదిగార కావ్యకర్త అభివర్ణించాడు.

కణ్ణకి జీవితం తమిళ నారీలోకం మీద చెరగని ముద్రవేసినట్లు పండితులు భావిస్తున్నారు. కోపావేశంతో కణ్ణకి మధురను దగ్ధం కావించిన రోజు శుక్రవారం. కనుక ఆ రోజు స్త్రీలకు పవిత్ర మైనది. కణ్ణకిని సతీదేవిగా సంభావించడంవల్ల స్త్రీలు బంగారు ఆభరణాలు కాళ్ళకు ధరించడం మానివేశారు.

కణ్ణకి జీవితంలో గొప్ప మార్పు ఆడి నెలలో (ఆషాఢ మాసం) శుక్రవారం నాడు సంభవించడం వల్ల తమిళనాడులోని మారియమ్మ (మారెమ్మ) గుళ్లలో ఆడి నెలా, శుక్రవారాలూ పరమ పవిత్రములుగా భావించబడుతున్నవి. మారియమ్మకు జరిగే వేడుకలలో అందెకు ప్రాధాన్యం ఉండడం గమనించదగిన విషయం

ఇంతకూ మానవ స్త్రీగా జన్మించి, దైవత్వం సంతరించుకున్న కణ్ణకి కథ అందరికీ ఆదర్శప్రాయమైనది; ఆనందదాయకమైనది !3

3. ఈ కావ్య ద్వయాన్ని యశశ్శరీరులు పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు తెలుగు చేశారు. కథల వివరాలు కోరేవారు నా తమిళ పంచకావ్య కథలను కూడా చూడవచ్చు.

# భారతి కవిత – ఒక పరిశీలన

తమిళ సాహిత్యంలో నవయుగం మహాకవి సుబ్రహ్మణ్య భారతితో ప్రారంభ మయింది. నిజానికి ఆధునిక తమిళ సాహిత్యం అనగానే అయన పేరు స్ఫురణకు వస్తుంది. ఇది భారతి యుగమన్నా సాహసం కాదు.

గేయ కవిగా, జాతీయ కవిగా, అభ్యుదయవాదిగా, మానవతావాదిగా సుప్రసిద్ధుడైన భారతి సామాన్యుడికి సైతం అర్థమయ్యే శైలిలో రచనా వ్యాసంగం చేసి సంప్రదాయ బద్ధమైన తమిళ సాహిత్యంలో కొత్త పుంతలు వేశాడు. చివరికి జటిలములైన తాత్త్విక రహస్యాలను కూడా సుందరమూ సుబోధకమూ అయిన వ్యావహారిక భాషలోనే వివరించాడు. అందువల్ల ఆయన రచనలకు ప్రచుర ప్రచారం లభించింది. తమిళం, సంస్కృతం, ఆంగ్లం మొదలైన వాఙ్మయాలలో గాఢమైన పరిచయం ఉండడం వల్ల, ఆయన రచనలలో సంప్రదాయపు బరువుతోపాటు నవ్యత కూడా కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. నవ్యత పేరుతో సంప్రదాయాన్ని నిరసించని వాడు కనుకనే, భారతి ఎంత నవీనుడో, అంత ప్రాచీనుడు. పాత కొత్తల మేలి కలయికకు ఆయన రచనలు, ముఖ్యంగా కవితలు, మణిదర్పణాలై ప్రతిభాసిస్తున్నాయి ఆధునిక యుగం వచన యుగమనీ, అందులోనూ వాడుక భాషకు ఎంతో ప్రాధాన్య మున్నదనీ గ్రహించిన భారతీయ రచయితలలో భారతి ప్రముఖుడు. ఆయన వచన కవితలు కూడా వెలయించాడు. నేటికీ తమిళ రచయితలు పలువురు ఆయన వేసిన బాటలలో పయనించటం గమనించ దగిన అంశం. విప్లవ కవిగా (పురట్చి క్కవిజర్) పేరు పెంపులు గడించిన భారతిదాసన్ ఆయన అనుయాయుడు! భారతి తమిళ నవయుగ ప్రవక్త!

భారతిది మానవతా దృష్టి కనుకనే, పామరులు సైతం చక్కగా అర్థం చేసుకునేలా, ఆయన తన భావాలను వ్యక్తం చేశాడు. విజ్ఞాన ప్రధానంగా కథలూ వ్యాసాలూ సంతరించాడు వాటిలో కొన్ని ఉబుసుపోకకు చెపుతున్నట్టుగా కనిపించినా, వాస్తవానికి అవి అలాంటివి కావు. పామరుల మనోభావాలకు అవి ప్రతిబింబాలు తమిళ భాషా శక్తి సంపన్నత ఆయనకి బాగా తెలుసు. సూటిగా, స్పష్టంగా ఉండే శైలిలో ఆయన రచనలు కావించాడు. అస్పష్టత, డొంక తిరుగుడు

మొదలైనవి ఆయన ప్రకృతికి విరుద్ధం. ఆయన వ్యక్తిత్వంలా, భావ వ్యక్తీకరణ పద్ధతి కూడా మనస్సుకి హత్తుకునేలా ఉంటుంది.

భారతి కవితల్ని దేశభక్తి కవితలు లేక జాతీయగీతాలు, స్తోత్రగీతాలు' తాత్త్విక గీతాలు, ఇతరములు అని స్థూలంగా విభజించవచ్చు. వాటికి గేయాంశం జీవం పోసింది. వందేమాతరం, స్వాతంత్ర్య దాహం, తమిళ భాషాస్తవం, ఛత్రపతి శివాజీ, గురుగోవిందుడు, బాలగంగాధర తిలక్ మొదలైనవి జాతీయ గీతాలలోని కొన్ని కవితలు. వినాయకస్తవం, మురుగస్తవం, శివశక్తి, ప్రళయ తాండవం, నందలాలా, యేసుక్రీస్తు, అల్లా మొదలైనవి స్తోత్రగీతాలు. తాత్త్విక గీతాలలో భయం లేదు, జ్ఞానమే దైవం, ఆత్మజయం మొదలైనవి ఉన్నాయి. బాలగీతం, స్త్రీ స్వాతంత్ర్యం, కొత్త రష్యా మొదలైనవి యితరములు. ఇవికాక శక్తి, గాలి, సముద్రం మొదలైన వచన కవితలూ ఉన్నాయి ఆయన ప్రకృతిని ప్రశంసించాడు; పరాశక్తిని ప్రస్తుతించాడు. సంఘంలోని వివిధ వర్ణాలవారికీ స్వాతంత్ర్యం కావాలన్నాడు స్త్రీలను నీచంగా చూసే మౌఢ్యాన్ని దుయ్యబట్టాడు. మనలో నెలకొన్న అంధవిశ్వాసాలను తూర్పారపట్టాడు.

భారతి మున్ముమ్మూర్తులా జాతీయ కవి. దైవస్తుతి కావించినా అందులోనూ ఆయన దేశాభిమానమూ మానవతా ద్యోతకం కానవస్తాయి. 'ఎన్డ్రు తణియు మింద సుదందిర దాహం ...' మొదలైన సుప్రసిద్ధ పాదాలు కృష్ణస్తోత్రంలోనివే. వాటిని పరికించండి.

'ఎప్పుడు తీరు నీ స్వాతంత్ర్య దాహం
ఎప్పుడు మడియు మా అడియరి మోహం
ఎప్పుడు మా తల్లి సంకెల లూడిపోవు
ఎప్పుడు మా యిక్కట్టులన్నీ తీరిపోవు ?'

అలాగే విఘ్నేశ్వర స్తోత్రంలో తన జీవిత లక్ష్యాలను ఆయన ఇలా తెలియజేశాడు :

'కవిత, దేశసేవ, క్షణకాలమైనను
బద్ధకమ్ములేమి—పను లనంగ
ఇవియె నాకు మనస! ఈ మూడు చేయుము—
అపుడు సదయుడగును ఆ గణపతి!'

పర్యాప్తంగా పరిశీలించాలిగాని, భారతి వెలయించిన వివిధ కవితలలో విభిన్న విషయాలు గోచరిస్తాయి. వస్తువైవిధ్యం కల భారతి సాహిత్యంలో కాన వచ్చే జాతీయతా దృక్పథం, ప్రకృతి ప్రశంస, పరాశక్తి ప్రశంస, వేదప్రశంస, ఆంధ్ర ప్రశంస మొదలైన వాటిని పరిశీలిద్దాం.

## 2

భారతి ప్రదర్శించిన దేశాభిమానం విస్మరించరానిది. పెద్దల నుద్దేశించి కవిత చెప్పినా పిల్లలకోసం పాట పాడినా, ఆయన ప్రతి రచనలోనూ దేశాభిమానం, మానవతాదృష్టి ప్రధానంగా కనిపిస్తాయి. ఆ జాతీయకవి దృష్టిలో కన్యాకుమారి మొదలుకొని కాశ్మీరం దాకా విస్తరిల్లిన యీ ప్రాచీన మహాదేశం-భారతదేశం-ఒక్కటి ఈ సువిశాల దేశంలో నివసించే విభిన్న భాషలవారు, వివిధ మతాలవారు, వివిధ ప్రాంతములవారు ఒక్క జాతికి—అనగా భారతజాతికి-చెందినవారు. ఇంత విశాలమైన దృక్పథాన్ని ప్రదర్శించిన హేతువువల్ల, ఆయన రచనలు నలుగురికీ శిరోధార్యము లైనాయి. కనుకనే జన్మించి నూరేళ్ళయినా, ఆయన నేటికీ ఆదరపూర్వకంగా సంస్మరించ బడుతున్నాడు. ఆయన ఒకచోట అన్నాడు గదా: 'క్రైస్తవులైనా, పార్శీలయినా, మహమ్మదీయులైనా, ఎక్కడి నుంచి వచ్చి యే దైవాన్ని పూజించినా భారతదేశంలో పుట్టి, పెరిగి, యీ దేశాన్నే నమ్ముకున్నవారి నందరినీ భారతీయులుగానే భావించాలి, ఇది ఏక జాతి ; విభజించరానిది ; నాశనం లేనిది.'

ప్రగాఢమైన యీ అభిప్రాయం కలవాడు కనుకనే, భారతదేశపు వ్యవహారాలలో ఇతరుల ప్రమేయాన్ని భారతి గర్హించాడు. మనలో ఐకమత్యం ప్రధానంగా నెలకొనాలని ఘోషించాడు

'వందేమాతరం' అన్న గీతంలో భారతి యిలా స్పష్టం చేశాడు :

'ఇచట కలవు జాతులెన్నో, అయినా
ఇతరులు చొచ్చుట ఏమి న్యాయం?
ఒక తల్లి కడుపున ఉదయించిన వారు
కలహించుకొనగా, కారా సోదరులు?
కలిసి వున్నప్పుడే కలదు జీవితం

కలియక తిరిగితే కలుగుతుంది పతనం
నెలకొనాలి యీ భావం స్థిరంగా
వలయునే ఆ తర్వాత వేరొకటి ?'

భారతి పేర్కొన్నట్లుగా, జాతీయ సమైక్యానికి ఐకమత్యం ఎంతైనా అవసరం, అవసరమే కాదు అభిలషణీయం కూడా. మన మందరం అన్నభావం నెలకొన్నప్పుడే ఒక జాతి ప్రగతిపథంలో పయనిస్తుంది. బహుశః ఈ భావాన్ని మనస్సులో ఉంచుకుని కాబోలు పిల్లలకోసం వ్రాసిన 'పాప్పా పాట్టులో' భారతి ఇలా అన్నాడు :

'పరిగెత్తి ఆడాలి పాపా-నువ్వు
బద్ధకం మానాలి పాపా
కలిసి మెలిసి ఆడాలి పాపా-ఎవ్వ
రిని ఏమి అనబోకు పాపా.'

పరుగులు తీస్తూ, గంతులు వేస్తూ ఆడడం బాలబాలికలకు అలవాటే. అయితే కలిసిమెలిసి ఆడాలి; ఆర్థికపరమైన, కులమత పరమైన హెచ్చుతగ్గులు పూర్తిగా మరిచిపోయి కలిసిమెలిసి ఆడాలి, అనగా, భేదభావాలు విస్మరించి అందరితో కలిసిమెలిసి ఆడాలి. అప్పుడే ఆడే ఆటలో హాయి ఉంటుంది. అటువంటి ఆటలవల్ల జాతీయతా దృష్టి యేర్పడుతుంది.

ఈ పిల్లల గేయంలో కూడా మనదేశం అఖండ భారతదేశం అన్న భావాన్ని భారతి స్పష్టంగా తెలియజేసిన తీరు మెచ్చుకోదగింది.

'వేదం వెలిసినదేశం-వీర
వరులూ ప్రభవించిన దేశం
అఖండ హిందూస్థాన మిది-దైవ
మనీ సేవించుము పాపా.
జాతులు లేవే పాపా-మరి
కులభేదా లెంచుట కడుపాపం
విద్యాబుద్ధులు నీతి ప్రేమా
కలవారే అధికులు పాపా.'

బాలబాలికలలో ఇలాంటి ఉన్నత భావాలు ఏర్పడాలని ఆ నాళ్లలోనే ఆశించిన భారతి నిజంగానే అభ్యుదయవాది. జాతి మత భేదాలను ఎంచడం మహా పాపమని చెప్పడంతోపాటు మన దేశం అఖండ భారతదేశం అనే అంశాన్ని సమయం వచ్చినప్పుడెల్ల ఆయన గుర్తుచేస్తూ వుండడం పేర్కొనదగినది.

'భారత జాతి వర్ధిల్లాలి
ముప్ఫయికోట్ల జన సమూహం
సమగ్రత కిది ప్రతిరూపం
సాటి యెరగని జన సమూహం
జగతికే యిది అపురూపం !
.... .... ....
అందరూ భారతదేశీయులు
అందరూ సమానులు, సమధర్ములు
అందరూ ఈ దేశపు రాజులు
మన మందరం ఈ దేశపు రాజులం.... '

అని 'భారత జాతి' అనే గేయంలో భారతి పేర్కొన్నాడు, ఎప్పటికైనా భారత దేశంలో ప్రజాస్వామ్యం నెలకొనగలదని విశ్వసించాడు కనుకనే, ఆయన 'మనమందరం ఈ దేశపు రాజులం' అని సహేతుకంగా పేర్కొన్నాడు. ఈ గేయంలో కూడా ఆయన అఖండ భారతాన్నే ఊహించాడు (ఆయన రోజుల్లో మన దేశపు జనాభా ముప్ఫయికోట్లు, తెలుగు జాతీయ కవులు కూడా తమ గేయాల్లో ముప్ఫయికోట్లనే ఉదాహరించారు). బంకించంద్ర చటోపాధ్యాయ వ్రాసిన వందేమాతరం గీతాన్ని భారతి జాతీయగీతం అనే పేరుతో తమిళం చేశాడు. వంగమూలంలో ఏడుకోట్లమంది అని ఉండగా, భారతి దాన్ని ముప్ఫయి కోట్లుగా మార్చాడు. ఏడుకోట్లు అన్నప్పుడు వంగదేశాన్ని మాత్రమే తెలియజేసినట్లవుతుంది ముప్ఫయికోట్లు అని భారతి తన అఖండభారత వాదాన్ని మరో సారి బలపరిచాడు

బహుభాషా నిలయమైన మన దేశంలో వివిధప్రాంతాలవారు ఎలా కలిసి మెలిసి సంచరించాలో, ఎలా ఒకరి నొకరు గౌరవించుకుంటూ జీవించాలో

ఆ వైనం మధురమనోజ్ఞంగా తెలియ జేశాడు భారతి 'భారతదేశం' అనే సుప్రసిద్ధ గీతంలో.

'సింగళదీవికి సేతువు కట్టేము
సేతువు నేమో వీధిగ తిర్చేము
వంగదేశపు మిగులు నీటితో
మధ్యదేశంలో పైరు చేసేము.
సింధునదిని పండు వెన్నెలలో
చేరదేశపు వయసు కన్నెలతో
తేట తెలుగున పాట పాడుతూ
పడవ నడిపీ తిరిగి వచ్చేము.
గంగాతీరపు గోధుమ పంటకు
కావేరి తమలపాకులు ఇచ్చేము
సింహతుల్యులు మహారాష్ట్రుల కవితకు
చేరదేశపు దంతం బహూకరించేము.
కాశీ పండితులు చేసే చర్చలు
కంచిలో వినిపించేలా చేసేము
రాజపుత్ర వీరాగ్రణులకు
కన్నడపు బంగారం కానుక ఇచ్చేము.

.... .... ....

ఆ నాళ్ళలో భారతిలా ఈ విధంగా భావించిన మరో కవి లేడనడం అతిశయోక్తి కాదు. కన్యాకుమారి నుంచి కాశ్మీరం అనే మధురభావాన్ని ఇలా కవితామయంగా చేసి చెప్పిన ఖ్యాతి భారతికే దక్కుతుంది. ఆ మహాకవి దృష్టిలో అఖండ భారతమే తప్ప అన్యం లేదు. ఏ ప్రాంతంలో లభించే సంపద ఆ ప్రాంతానిదే అన్న సంకుచితమైన తత్త్వం అవలంబించ లేదు. నా చిన్నిబొజ్జకు శ్రీరామరక్ష అనే మనస్తత్వానికి ఆయన ప్రకృతి పూర్తిగా విరుద్ధం. ఈ రోజుల్లో మనం అదేపనిగా జాతీయసమైక్యం, భావసమైక్యం అంటూ వేదికలమీద ఘోషిస్తున్నాము. ఆచరణలో అంతగా స్పష్టం కాక పోయినా. కాని భారతి ఈ భావాన్ని రసబంధురంగా, మధురమోహనంగా తెలియజేశాడు. మనమందరం అన్నభావం నాడూ నేడూ ఎన్నటికీ కూడా మనకందరికీ తారకమంత్రం.

సుబ్రహ్మణ్యభారతి, మామూలు కవులవలె, ఊహాప్రపంచంలో విహరించినవాడు కాదు. యధార్థ ప్రపంచాన్ని గుర్తించినవాడు. అందువల్లనే ఆనాటి రాజకీయచైతన్యం ఆయన నరనరాలలోనూ వ్యాపించింది. తత్ఫలితంగా స్వాతంత్ర్యేచ్ఛ, దేశాభిమానం సహజంగా కల భారతివంటి విప్లవకవి నిమ్మకు నీరెత్తినట్లుగా కూర్చోలేకపోయాడు. దేశభక్తి ప్రబోధాత్మకములైన గీతాలు సంతరించాడు. స్వాతంత్ర్యం మానవుని జన్మహక్కని లోకమాన్య బాలగంగాధర్ తిలక్ వంటి మహనీయుడు చేసిన సింహగర్జన భారతి హృత్సీమలో ప్రతిధ్వనించింది. ఆయన రాజకీయ భావాలకు స్పష్టమైన ఒక ఆకృతిని కల్పించిన కర్మవీరుడు లోకమాన్యుడు. ఆయన్ని 1907 లో భారతి సందర్శించాడు.

ఇలా ఉండగా, ఆ నాటి ప్రభుత్వం పంజాబు కేసరిగా పేరు పెంపులు గడించిన లాలా లజపతిరాయిని బర్మాకి పంపించింది. స్వాతంత్ర్యం జన్మహక్కని ఘోషించిన తిలక్ మహాశయుని కారాగృహంలో బంధించారు. ఓడ నడిపిన తమిళుడుగా ప్రథితయశస్కుడైన వ. ఉ. చిదంబరం పిళ్లైని చెరసాలలో బంధించారు. ఈ జాతీయనాయకులంటే భారతికి మహాగౌరవం. కాగా, గోపాలకృష్ణగోఖలే, చిదంబరం పిళ్లై, తిలక్, లజపతిరాయి మొదలైన ప్రముఖుల్ని గురించి భారతి చక్కని కవితలు వెలయించాడు.

గాంధీజీని ప్రస్తావిస్తూ 'మహాత్మాగాంధి పంచకం' వ్రాశాడు భారతి. అస్వతంత్రమైన భారతాన్ని బ్రతికించడానికి అరుదెంచిన మహాత్మా! నువ్వు వర్ధిల్లాలి - అంటూ ఆయన ప్రశంసించాడు. గురు గోవిందసింహుని గురించి 204 పాదాల దీర్ఘ కవిత వ్రాశాడు. గాంధీజీని గురించి గేయాలూ కవితలూ వెలయించిన కవులు ప్రతి భాషలోనూ ఉన్నారుగాని, గురుగోవింద సింహుని ప్రతిభా విశేషాదికాన్ని గుర్తించి ప్రస్తుతించిన కవులు మాత్రం తేరసవచ్చు. నాలుగు వృత్తాలలో దాదాభాయ్ నౌరోజీని ప్రశంసించాడు.

ఇలా జాతీయ నాయకుల ఘనతను గుర్తించడమేకాక, మన జాతీయ గౌరవాన్ని ఇనుమడింపజేసిన ఛత్రపతి శివాజీ వంటి ప్రముఖుల్ని ప్రస్తుతించాడు భారతి. వివేకానందస్వామి, సోదరి నివేదితాదేవి, తాయుమానవర్ వంటి మహనీయులకు నివాళు లర్పించాడు. నవ్యాంధ్ర నిర్మాతలలో ప్రముఖుడైన కందుకూరి వీరేశలింగం పంతులుపట్ల ఆదరభావం ప్రకటించినట్లే, సుప్రసిద్ధ

చిత్రకారుడైన రవివర్మను ఆయన బహుధా ప్రశంసించాడు. ఇలా వివిధ ప్రాంతాలకు చెందిన ఆనాటి మహనీయుల్ని తన రచనలలో ప్రశంసించిన భారతిలో నెలకొన్న జాతీయతాదృక్పథం ఎంతైనా కొనియాడదగింది. ప్రసిద్ధ దేశభక్తుడూ తమిళ విద్వాంసుడూ అయిన వ ఉ. చిదంబరం పిళ్లై, సంగీత శాస్త్రజ్ఞుడూ ఆంధ్ర ద్రవిడ భాషాపండితుడూ అయిన సుబ్బరామదీక్షితర్, 'తమిళతాత'గా ప్రసిద్ధికెక్కిన మహామహోపాధ్యాయ ఉ వే సామినాధయ్యరు, ఎట్టయపురం జమీందారూ సారస్వత లోలుడూ అయిన వెంకటేశ రెట్టప్ప భూపతి మొదలైన తమిళ ప్రముఖుల్ని కూడా భారతి సముచితరీతిని ప్రస్తుతించాడు

భారతిలో అన్యమత సహనం కూడా అతి స్పష్టంగా కనిపిస్తుంది జాతీయతా దృక్పథంవల్ల ఆయనలో కలిగిన సత్ఫలితంగా దీన్ని అభివర్ణించవచ్చు. పరాశక్తినీ కాళినీ కన్నయ్యనూ ఆయన బహువిధాలుగా కీర్తించాడు. కన్నయ్యనైతే తన తల్లిగా, తండ్రిగా, మిత్రునిగా ప్రియునిగా చివరికి ప్రేయసిగా-ఇలా బహురూపాలలో భావించుకుని చవీ చక్కనా కల ఎన్నో గీతాలు ఆలపించాడు. అలాగే యేసుక్రీస్తునీ అల్లానీ ఆయన భక్తిపూర్వకంగా స్మరించాడు. సిక్కుమత స్థాపకుడైన గురుగోవిందసింహుని ప్రస్తుతిస్తూ ఆయన జ్ఞానసింధువనీ మధుర గాయకుడనీ, మిన్నువిరిగి మీద పడినా చలించని వీరవరేణ్యుడనీ వర్ణించాడు. ధరణిని కాపాడిన గురుగోవిందసింహుడనీ వర్ణించాడు. ఆయనపట్ల భారతికి అపారమైన ఆదరభావం ఉన్నట్లు ఈ కవిత స్పష్టం చేస్తుంది,

తమిళ భాషాసాహిత్యాలంటే భారతికి ఎనలేని ఆదరాభిమానాలు ఉండడం సహజం. అయితే ఆ అభిమానం అన్యభాషాద్వేష రహితమయింది, అందువల్లనే ఆయన జాతీయతాదృక్పథంలో మచ్చ యేర్పడలేదు తెలుగు భాషను 'సుందర తెలుంగు' అని అభివర్ణించాడు. అందమైన తెలుగని ఆయన అభిప్రాయం. మరాఠీ కవితను గ్రహించి, అందుకు బదులుగా వారికి కేరళదేశంలోని ఏనుగుదంతాలను బహూకరించాలని అన్నారు. ఇలా ఇతర భాషలలోని మాధుర్యాన్ని గ్రహించి, దాన్ని నలుగురికీ తెలియజేయడానికి భాషాసహనం కావాలి. అది భారతిలో పుష్కలంగా ఉన్నది.

భారతి దృక్పథం సువిశాలమయిందని చెప్పడానికి మరొక ప్రబల సాక్ష్యం ఆయన రష్యాను గురించీ బెల్జియం గురించీ కవితలు వ్రాయడమే. ఆ రోజుల్లో అంతర్జాతీయ విషయాలను గురించి కూడా రచనలు చేసిన కవుల్ని దృష్టిలో

ఊంచుకుని చూస్తే, భారతి విశిష్టత ప్రస్ఫుట మవుతుంది. అలా రచనలు చేసిన వారి సంఖ్య అత్యల్పం. ప్రపంచంలో ఏ మూల ఎవరు స్వాతంత్ర్యం సంపాదించినా, అది చూసి ఎంతగానో మురిసిపోయాడు భారతి ఆయన హృదయం అహర్నిశలూ స్వాతంత్ర్య దాహంతో నిండివుండేది.

స్వాతంత్ర్యం కోసం ఇంతగా పరితపించిన భారతికి రష్యాదేశపు జార్ చక్రవర్తి పతనం ఎంత సంతోషం కలిగించిందో మనం ఊహించుకోవచ్చు పుదియ రుషియా (క్రొత్త రష్యా) అనే కవిత ఒకటి ఆయన వ్రాశాడు. జార్ చక్రవర్తి మూఢుడనీ, అతను హిరణ్యకశిపుని వంటి వాడనీ భారతి పేర్కొన్నాడు. 'ఇమ్మెన్నాల్ సిరైవాసం, ఏనెన్నాల్ వనవాసం' (అంటే కారాగారవాసం, ఎందుకని ప్రశ్నిస్తే వనవాసం) - అలా సాగిందట ఆ దుష్ట ప్రభువు పరిపాలన. బెల్జియం స్వతంత్రదేశ మైనప్పుడు, దాన్ని ఆశీర్వదిస్తూ 'బెల్జియం నాట్టిర్కు వాళ్త్తు' అని 38 పాదాల కవిత చెప్పాడు భారతి

పాత కొత్తల మేలికలయికను వాంఛించిన భారతిలోని దేశాభిమానం నిరుపమానం. ధారుణిలో మంచిదేశం మన భారతదేశం అని ఆయన అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని ఆయన కొన్ని కవితలలో వ్యక్తం చేశాడు కూడా. 'మనదేశం' అనే కవితలో చోటు చేసుకున్న భారతి అభిప్రాయాన్ని పరిశీలిద్దాము :

'భారత వీరులు వరలిన దేశం
మునులెందరో నివసించిన దేశం
నారదగానం వినిపించిన దేశం
మంచిని ఎప్పుడు పెంచే దేశం
తీరని జ్ఞానం భాసించిన దేశం
బుద్ధుని కరుణా పొంగిన దేశం
భారత మెంతో పురాతన దేశం
పొడెద మెప్పుడు దాని ప్రశస్తిని.'

కాగా, సుబ్రహ్మణ్య భారతి ప్రదర్శించిన జాతీయతా దృక్పథం విశాలమైనదనీ, ఆయన స్వభాషాభిమానం అన్యభాషా దూషితం కాదనీ, అలాగే ఆయన చూపిన పరమత సహనం ప్రశంసార్హమనీ చెప్పడం చర్విత చర్వణమే అవుతుంది.

# 3

భారతి రచనలలో ప్రకృతి ప్రశంస బహుధా కనిపిస్తుంది. కొండలు, కోనలు, పురుగులు, పులుగులు, మానవజాతి - అన్నీ ఒక్క కుటుంబానికి చెందిన వని ఆయన పేర్కొన్నాడు. ఆయన ప్రకృత్యుపాసకుడు. ప్రకృతి రామణీయ కాన్ని చూసి ఆనందపారవశ్యం చెందే అమృత హృదయుడు ప్రకృత్యారాధకుడు కావడంలో ఆశ్చర్యం లేదు.

ప్రకృతిలో కానవచ్చే ప్రతి వస్తువూ భారతికి పరమ ప్రీతి పాత్రం. అంతే కాదు. ఆయన దృష్టిలో ప్రకృత చైతన్యపు ముద్ద. ఒక గేయంలో ఆయన అన్నాడు గదా:

'ప్రపంచంలో జడపదార్థ మన్నది లేదు
మట్టీ రాయీ జడములు కావు
.... .... ...
పాడూ పల్లె దైవం
ఎడారీ కడలీ దైవం
ఏడు లోకాలూ దైవం
ప్రతిదీ దైవం, ప్రతిచోటా దైవం
.... — ....'

ప్రకృతిలో కనిపించే ప్రతి వస్తువూ చైతన్యవిలసితమూ దైవతుల్యమూ అని భారతి చెప్పడం ఆయన హృదయ వైశాల్యాన్ని తెలుపుతుంది. ప్రతి వస్తువునీ ఆయన దైవ స్వరూపంగా భావించగలిగాడు. కనుకనే, కాకి నలుపురంగు కూడా ఆయనకి కనులపండువు చేసింది. ఆ నల్లని నలుపులోనే ఆయన దివ్యత్వాన్ని దర్శించగలిగాడు. ఈ క్రింది గేయం అందుకు మరో నిదర్శనం,

కాకి రెక్కలలో నందలాలా-నీ
నల్లనిరూపు పొడసూపు నందలాలా
చెట్టుచేమలలో నందలాలా-నీ
శ్యామలవర్ణము కనిపించు నందలాలా
వినవచ్చే ధ్వనులన్నిట నందలాలా-నీ

గానమె వినిపించు నందలాలా
నిప్పున వేలుంచిన నందలాలా-నీ
స్పర్శాసౌఖ్యము తెలిసెను నందలాలా
[నందలాలా అనగా నందకిశోరా అని అర్థం]

సూర్యాస్తమయవేళలో కానవచ్చే ఆ సౌందర్యమును వివరిస్తూ భారతి ఒక వ్యాసం వ్రాశాడు, పరిశీలించండి. ప్రకృతి దృశ్యాలు ఆయన్ని ఎంత గాఢంగా ఆకట్టుకున్నాయో వ్యక్తమవుతుంది.

"ప్రకృతి రామణీయకమును తమిళులు పరిశీలించడం లేదు. శనివారం నాడు సాయంసమయాన చెరువుదగ్గరికి వెళ్ళి గరుడ దర్శనం చెయ్యమంటే అక్కడికి తండోపతండంగా మనవాళ్ళు వెడతారు కాని సూర్యుడస్తమించేవేళ ఆకాశవీధిలో కనిపించే అత్యద్భుత దృశ్యాలను పరిశీలించేందుకు ఎవ్వరూ ముందడుగు వెయ్యరు. ఆకాశంలో ఇంద్రజాల మహేంద్రజాలాదులు జరిగేవేళ సాయంసమయమంటే, ఈక్షణం కనిపించే దృశ్యం మరుక్షణం కనిపించదు. ప్రపంచంలోని ధనమునంతా ఖర్చుపెట్టి వర్ణప్రదర్శనలు ఏర్పాటుచేసినా, వాటిలో సూర్యుడస్తమించేటప్పుడు అంబరవీధిలో కనిపించే ఆ వివిధ వర్ణాలలో, కోటిలో ఒక్కవంతుకూడా, ఆ ప్రదర్శనల్లో చూడలేము. బాణాసంచా కాల్చడంకోసం ఒక శ్రీమంతుడు పదివేల రూపాయలు ఖర్చుపెడతాడు ఆ వేడుక చూసి నిర్ధనులు సంతోషిస్తారు. సోదరుడా! సూర్యాస్తమయ వేళలో కానవచ్చే ఆ సౌందర్యాన్ని దర్శించు; సూర్యుణ్ణి చూడడం కళ్లకు మంచిదికాదనే అంధుల విశ్వాసాన్ని సరకు సేయకు సూర్యుణ్ణి చూడడం పాపమనే మూర్ఖుల శాస్త్రాన్ని కన్నెత్తి అయినా చూడకు.

మన దేశంలో వేదకాలపు ఋషులు ప్రకృతి రామణీయకమును చూసి, ముగ్ధులై, ఆనందపరవశులై అద్భుతములైన కవిత లెన్నో వెలయించారు. ప్రకృతి సౌందర్యమునకు ముగ్ధులైన కాళిదాసాది మహాకవులు కమనీయ కవితలు సంతరించారు. ఈ రోజుల్లోనే మన దేశంలో ఆకాశమును సరిగా చూడనైనా చూడని అంధులు కవులమని చెప్పుకుంటున్నారు.

సూర్యాస్తమయంలోని అనిర్వచనీయమైన సౌందర్యాన్ని మనస్సుకి హత్తుకుపోయేటట్లు వ్రాయడం నా తరం కాదు పోనీ దగ్గరుండి చూపించినా, సూర్యుణ్ణి చూసి కళ్ళు గుచ్చుకుంటున్నవి-అనడం ఒక్కటే తెలుసు మన వాళ్ళకి.

అసలు విషయం మాత్రం అర్థం కాదు. సోదరా! నీ అంతట నువ్వే వెళ్ళి కొన్ని రోజులపాటు ఆకాశాన్ని చూడడం నేర్చుకో. ఆ తర్వాత ఆ దివ్యాకృతిలోని ప్రాశస్త్యం నీకే క్రమక్రమంగా తెలియవస్తుంది. ఎండదొర ఉదయించేటప్పుడూ, అస్తమించేటప్పుడూ అంబరవీధిలో జరిగే ఆ ఇంద్రజాలం, క్షణక్షణానికి గోచరించే ఆ కొత్త వింతలూ కాక మరో విషయం కూడా తెలుస్తుంది నిన్న ఉన్నట్టుగా నేడు ఉండదు. గగనమార్గం నేటిలాగే రేపు ఉండదు. ప్రతిరోజూ ఎన్నెన్నో అద్భుతాలు, వేర్వేరు లోకాలు, వింత వింతలు, అవన్నీ అనిర్వచనీయాలు

కొన్నాళ్ళకు మునుపు ఒకరోజు సాయంకాలం నేను చూసిన అద్భుత దృశ్యాలను ఇక్కడ మనవి చేస్తాను.

పడమటి దిక్కున సూర్యబింబం ధగధగ మంటూ ప్రకాశిస్తున్నది. ఇరవై కోట్ల మెరుపులతో కనుక ఒక చక్రం తయారుచేసి, దానిని గిరగిర తిప్పగలిగితే, ఎలా వుంటుందో అలా వున్నది సూర్యబింబం. మొదట్లో కళ్ళు గుచ్చుతున్నాయి. కాని దీక్షగా కొంత సేపు చూస్తే, ఆ తర్వాత కళ్ళు గుచ్చుకోవు, వలయాకారంగా ఉండే రెండు పళ్ళెములు ఒకదానిమీద మరొకటి తిరుగుతూ వున్నట్లు కనిపిస్తుంది. కింది పళ్ళెం స్వచ్ఛమైన మెరుపుల పళ్ళెం. పైది మరకతములు పొదిగిన పళ్ళెం. ఇది అత్యద్భుతమయింది. పళ్ళెములు తిరిగేటప్పుడు, కిందవున్న మెరుపుల పళ్ళెం పూర్తిగా అదృశ్య మవుతూ వుంటుంది. కాని మధ్య మధ్య మెరుపుల పళ్ళెపు వజ్రతుల్యములైన కిరణాలు కళ్ళమీద పడుతూ వుంటాయి.

చూడు. సూర్యుని చుట్టూ మేఘములన్నీ నిప్పులో మండుతున్నట్లు కనబడతాయి. ఆహా! ఎన్ని రంగులు! రకరకాల రంగులు! ఎన్నెన్ని ఆకృతులు! ఎన్ని వేల మిశ్రమాలు? అగ్నిప్రవాహం! బంగారం పోతపోసిన పడవలు! మండుతున్న బంగారు దీవులు!

నీలసరోవరాలు! నల్లని భూతాలు. ఆ నీలవర్ణం ఎన్నెన్ని రకరకాలని! ఎరుపులో ఎన్నిరకాలు! రకరకాల పచ్చని నలుపు రంగులు. నీల సరోవరంలో తేలియాడే బంగారు పడవలు. మండుతున్నట్టుగా బంగారు జరీయంచువేసిన నల్లని శిఖరాలు. బంగారు తిమింగలాలు ఈదే నల్లని సముద్రం ఎక్కడ చూసినా వెలుగు వెల్లువే! రంగులవుట్ట. వెళ్లు. వెళ్ళి చూడు, ఇక ఆ దృశ్యాన్ని వర్ణించడం నాతరం కాదు."

'జ్ఞానరథం' అనే ప్రశస్త రచనలో భారతి చేసిన ప్రకృతి ప్రశంస పరిశీలనార్హం. ప్రకృతిని ఆయనలా అనుభవించి ఆనందించిన కవులు అంతగా లేరనవచ్చు.

ఆనాళ్ళలోనే సుబ్రహ్మణ్యభారతి కొన్ని వచన కవితలు వెలయించాడు. వాటిలో గాలిని గురించి వ్రాసిన కవిత పేర్కొనదగినది. ఇందులోంచి ఒక భాగమును యథాతథంగా ఉదాహరిస్తున్నాను.

"వర్షాకాలము

సంధ్యాసమయము

చలిగాలి వీస్తున్నది

వ్యాధిగ్రస్తుడు శరీరం కప్పుకుంటున్నాడు.

లాభం లేదు.

గాలికి భయపడితే, లోకంలో సుఖంగా జీవించలేము.

ప్రపంచం వాయుమయం. కాగా గాలికి భయపడి, మనుగడ సాగించడమా ? గాలి మనలను స్పృశించుచు వీచును గాక :

అది వ్యాధులనుంచి మనలను కాపాడుగాక ;

కొండగాలి మంచిది.

కడలిగాలి మందు.

ఆకాశంనుంచి వచ్చేగాలి మంచిది.

మానవులు ఊరిగాలిని తమ శత్రువుగా మార్చుకుంటున్నారు. వారు వాయుదేవుని ప్రత్యక్షంగా ఆరాధించడం లేదు. అందువల్ల గాలిదొర ఉగ్రుడై వారిని నశింపజేస్తున్నాడు.

వాయుదేవుని సేవిద్దాము.

అతడు విజయంచేసే దోవలో రొచ్చు ఉండకూడదు. దుర్వాసన ఉండకూడదు. పురుగులు కారుతూ కుళ్ళిపోయిన వస్తువులు ఉండకూడదు. ఎటువంటి మాలిన్యమూ ఉండకూడదు.

వాయుదేవుడు వస్తున్నాడు.

అతడు వచ్చేదారిని శుభ్రంచేసి, దారంతటా మంచినీళ్లు చల్లుదాం.

అతడు వచ్చేదోవలో నందనోద్యానాలు కల్పిద్దాం. కర్పూరాది సురభిళ ద్రవ్యాలను వెలిగించి వుంచుదాం.

అతడు దివ్యౌషధమై అరుదెంచునుగాక; ప్రాణమై అరుదెంచునుగాక!

వాయుదేవుని సేవిద్దాం.

అతడు శక్తి కుమారుడు, మహారాణిగారి ముద్దుల కొమరుడు. అతనికి స్వాగతం చెపుదాము.

"వాయుదేవుడు వర్థిల్లుగాక!"

'కాకి పిచ్చుకలు మన నేస్తములు
భీకర జలధీ ఉన్నత శైలం
ఏక కుటుంబం మన దంతా.'

అని ఘోషించిన సుబ్రహ్మణ్యభారతి వివిధ రచనలలోనూ ప్రకృతి ప్రశంస కనిపిస్తుంది. ప్రకృతిలోని దివ్యసౌందర్యమును ఆ మహాకవి తనివితీరా దర్శించగలిగాడు. ముద్దులు మూటగట్టే రచనలు చేయగలిగాడు.

## 4

"సర్వమూ నీవయై-కాళి
సర్వత్ర నిండియున్నావు
మంచి సెబ్బరలు-కాళి
దైవలీలలు కావా?
భూతపంచకమైనావు-కాళి
పంచేంద్రియాలైనావు
జ్ఞానమై వెలిగేవు-కాళి
ఇంద్రియాతీతవై నిలిచావు.
ఆనందరూపమైనావు-కాళి
నాలో ప్రవేశించావు
నీవు కనుక లేకుంటే-కాళి
నేనుమాత్రం ఉండగలనా?

ప్రేమ అనుగ్రహించావు-కాళీ
పౌరుషం ప్రసాదించావు.
దుఃఖం కాల్చివేశావు-కాళీ
కష్టం రూపుమాపావు.”

కాళికాదేవిని గురించి భారతి సంతరించిన పెక్కు కవితలలో ఇది ఒకటి.

భారతి దృష్టిలో పరాశక్తియే దైవం, దేశం, తల్లి, తండ్రి. సంగ్రహంగా చెప్పాలంటే శక్తియే సర్వమూను. శక్తి స్వరూపిణినే ఆయన జగన్మాతగా భావించాడు. శక్తి సంహారకశక్తి కాదు; సృజనాత్మకశక్తి. శక్తి ప్రళయకారిణి కాదు; మంగళప్రదాయిని శివంతో కలిసిన శక్తినే ఆయన శక్తిగా పేర్కొన్నాడు. శివరహితమైన శక్తి శక్తి కాదు, ఆ శక్తిని ఆయన కాళి అన్నాడు; పరాశక్తి అని ప్రశంసించాడు, ముత్తుమారి అని కీర్తించాడు. ఆయన వెలయించిన స్తోత్ర గీతాలలో శివశక్తి, మహాశక్తికి విన్నపం, మహాశక్తి వెణ్బా (వృత్తభేదం), ఓంశక్తి, శక్తి తాండవం, శక్తికి ఆత్మ సమర్పణం, శక్తి ప్రశంస, శివశక్తి ప్రశంస, మహాశక్తి, కాళిస్తోత్రం, మహాశక్తి ప్రశంస-అని యిలా పరాశక్తి ప్రశంసకు సంబంధించిన కవిత లెన్నో ఉన్నాయి. వీటిని పురస్కరించుకుని పరిశీలిస్తే, భారతికి పరాశక్తిపట్లగల అవిరళ భక్తి విశ్వాసాలు వ్యక్తమవుతాయి. చివరికి రష్యన్ విప్లవ శక్తిలో కూడా ఆయన పరాశక్తినే సందర్శించగలిగాడు!

మహా క్రూరుడైన జార్ చక్రవర్తి పతనానికి, దేశంలో సుస్థిరమైన ప్రజాస్వామ్య పరిపాలనకి దారితీసిన ఆ మహావిప్లవం ప్రపంచ చరిత్రలోనే ఒక ప్రముఖ ఘట్టం. ఆ విప్లవ ప్రాధాన్యాన్ని గ్రహించడమేకాక, దాన్ని ప్రశంసిస్తూ కవితాగానం చేసిన భారతీయ కవుల్లో సుబ్రహ్మణ్య భారతే ఆద్యుడవడం సత్య సన్నిహితం. పైకి సంప్రదాయ విధేయుడుగా కనిపించే భారతి నిజంగా ప్రగతి వాది! పైకి శక్త్యుపాసకుడుగా గోచరించే భారతి నిజానికి విప్లవ కవి. ‘పుదియ రుష్యా’ అనే **24** పాదాల కవిత వెలయించి, ఆయన సంప్రదాయ విధేయతకూ ప్రగతిశీల చింతనకూ మధ్య వంతెన నిర్మించాడు. పాత కొత్తల కలయికకు మేలిబాట వేశాడు. భారతి సంభావించిన పరాశక్తి రష్యాలో విప్లవ శక్తిగా దర్శనమిచ్చింది. ఈ క్రింది పాదాలు పరిశీలించండి:

"మహాకాళి పరాశక్తి
కడగంట చూసింది రష్యాని
ఆహా అనేలా అప్పు డక్కడ
ఆవిర్భవించిం దొక విప్లవం
పరమ క్రూరుడు పతన మయ్యాడు.
.... .... ....
.... .... ....
ఆఁ అంటే కారాగృహ వాసం
ఎందుకని ప్రశ్నిస్తే వనవాసం
నీతి అంతా నేల పాలై
దౌష్ట్యం ధర్మపథమై
దేశం అలమటించే తరుణాన
దేవి కరుణించి కడగంట చూసింది
సత్య సంధుల్ని సాదరంగా చూసింది
పతన మయ్యాడు పాపాత్ముడు
.... .... ....
అంతరించింది ఘోర కలి
కృతయుగం వెలుగు చూడాలి!"

కరుణా తరంగిణి అయిన కాళికాదేవి కడగంటి చూపులు పడడంతో విప్లవం ఆవిర్భవించిందట! క్రూర చక్రవర్తి పరిపాలనలో రష్యనులు అనుభవించిన యమయాతనాల్ని చూడలేక పోయింది ఆ జగన్మాత ఆమె కరుణా కటాక్ష ఫలితంగా ఆ దేశంలో నెలకొన్న ఘోర కలి మటుమాయమయింది. కృతయుగం వెలుగు చూడాలి! అంటాడు కవి. అనగా క్రౌర్యం, దౌష్ట్యం నశించి నీతి న్యాయం ధర్మం మొదలైనవి నెలకొనాలని భారతి ఆశయం!

అలాగే బెల్జియం స్వతంత్ర దేశమైనప్పుడు, ఆ సందర్భాన్ని పురస్కరించుకుని భారతి బెల్జియం వర్ధిల్లాలి అంటూ కవిత వ్రాశాడు. ఆ సందర్భంలో పరాశక్తి వీరరసం మూర్తీభవించిన ఒక మహిళగా గోచరిస్తుంది; చేటతో పులిని తరుమగొట్టిన కొరవజాతి నెలతగా గోచరిస్తుంది.

నిజానికి భారతి భావించిన శక్తి స్త్రీరూపం ధరించింది కూడా కాదు. బుద్ధి బలానికి లోబడేదీ కాదు. ఆ శక్తి మహాసత్త్వసంపన్న; సృష్టికర్త నీతి ధర్మం నెలకొనేందుకు ఆశక్తి అనుగ్రహం అవసర మంటాడు భారతి, ఒక కవితలో.

"మోహం చంపివేయుము-లేకుంటే
శ్వాస నిలిపివేయుము,
బంధం తెంపివేయుము-లేకుంటే
బరువు దించివేయుము.
చింతన చక్కచేయుము-లేకుంటే
దేహం రూపుమాపుము
యోగనిష్ఠ కలిగించుము-లేకుంటే
అంగములను తొలగించుము.

అని భారతి ఒక గీతంలో పేర్కొన్నాడు.

శక్తి కేదయినా భారతి ఒక నిర్వచనం చేశాడా? అని ఎవరైనా ప్రశ్నిస్తే, అందుకు శక్తి అనే శీర్షికతో ఆయన వ్రాసిన యీ కవితను సమాధానంగా చూపవచ్చు.

'దుఃఖరహిత స్థితియే శక్తి
మూతపడని కంటి చూపే శక్తి
ప్రేమ పూరిత కరుణమే శక్తి
పరిపూర్ణమౌ పౌరుషమే శక్తి
భావ మందలి ఆర్తియే శక్తి
కంటి ముందరి వృత్తియే శక్తి
మోక్షమార్గపు కొసయే శక్తి
అలసత్వం పోగొట్టునదే శక్తి
మాటలో వెలిగే కాంతియే శక్తి
పండులోని కమ్మదనమే శక్తి
దైవ పరమైన తలపే శక్తి
పాముని చంపే బలమే శక్తి

కవితలోని మాధుర్యమే శక్తి
భసిత పూడు కైలాసవాసి
పరమశివుని ప్రేమాగ్నియే శక్తి
మనుగడ పెంచే జ్ఞానమే శక్తి
దేశమును కాపాడే జ్ఞానమే శక్తి
నైచ్య నివారణోపాయమే శక్తి
చంచలత్వం తొలగించే తపస్సే శక్తి
పతనాన్ని నిరోధించే పౌరుషమే శక్తి
గగన వైశాల్యాన్ని కనుగొన్నదే శక్తి
కర్మను తొలగించే ఉన్నతియే శక్తి
గుండెలో వెలిగే జ్యోతియే శక్తి.

భారతి భావించిన శక్తి స్వరూప మిది! ఆయన దృష్టిలో సర్వమూ పరాశక్తి స్వరూపం!

భారతి కవితల్ని పరిశీలించేటప్పుడు, ఇతర విషయములతో పాటు చాలా చోట్ల ఆయన వేద ప్రశంస చేసినట్టు తెలియ వస్తుంది, మన దేశపు మహైశ్వర్యంగా వేదాన్ని ఆయన సంభావించాడు వేద విజ్ఞానం సర్వోత్కృష్టమని ఆయన అభిప్రాయం ఆయన సంతరించిన 'భారతదేశం' అనే గేయం ఇలా మొదలవుతుంది.

జ్ఞానత్తిలే పరమోనత్తిలే-ఉయర్
మానత్తిలే అన్నదానత్తిలే
.... .... ... .... .... .. .... .... .... ....
జ్ఞానంలో మరి మౌనంలో
మానంలో అన్నదానంలో-

మనది ఎంతో ప్రసిద్ధికెక్కిన దేశం, ఆధ్యాత్మిక జ్ఞానఫలం మౌనం,

మౌనంగా ఉండడం చాలా కష్టం. తత్సాధనకు ఆధ్యాత్మికోన్నతి అవసరం. తమిళ భక్తకవి అయిన తాయు మానవర్ 'ఊరక ఉన్నప్పుడు సౌఖ్యము కలుగును' అని సెలవిచ్చాడు.

పరిపూర్ణమైన జ్ఞానము ప్రతిభాసించిన దేశం (పూరణజ్ఞానం పొలిన్ద నన్నాడు) అని ఆయన 'మన దేశం'లో పేర్కొన్నాడు. వేదకాలపు ఋషుల కవిత ఆయన్ని బహుధా ఆకర్షించింది, ఆ శీర్షికతో ఆయన ఒక వ్యాసం వెలయించాడు. అందులో ఇలా అన్నాడు:

'మరణం లేని యీ హైందవ నాగరికత అనే కల్పవృక్షానికి మొదట్లో విత్తనం నాటిన వారు వేదకాలపు ఋషులు ... ...మనస్సు అడుగు భాగంనుంచి బహిర్గత మవుతున్న ప్రార్థనకు మంత్రమని పేరు, అది ఫలిస్తుంది. కాని అక్కడి నుంచి ప్రార్థన వెలికి రావడం సులభం కాదు.

ఋషులు మనో నైర్మల్యం సాధించినవారు. అందువల్ల మనస్సు అడుగు దాక వెళ్ళి అక్కడి నుంచి మంత్రములు తీసుకు వచ్చారు. ఆ మంత్రాలకు దేవతలు స్వాధీనులవుతారు వట్టిమాటకు ఆ శక్తి లేదు ఆ మాట మనశ్శక్తిని గ్రహించినట్లయితే, అప్పుడు దానికి మహిమ కలుగుతుంది ...ఇంద్రుడు అనబడే విజ్ఞాన శక్తిని వేదఋషి శక్తివంతములైన మంత్రాలతో స్థాపన చేశాడు. ఆ మంత్రాలు కవితలుగా భాసిస్తున్నవి. ఋగ్వేదం లోని ఋషుల కవితలను చదివేటప్పుడు మన మనస్సులో తేనె ప్రవిస్తుంది, జ్ఞానం దైవమయమవుతుంది ....'

వేదం మంత్రయుక్తమనీ, ఆ మంత్రాలలోని మాటల వలె కవిత ఉండాలనీ భారతి అభిప్రాయం. అనగా అర్థపుష్టీ అక్షరరమ్యతా సమపాళ్ళల్లో ఉండా లన్నమాట మంత్రాల లోని శబ్ద మాధుర్యం కవితలో నెలకొని ఉండాలి. 'మందిరం పోల్ వేణ్డుమడా సొల్లిన్బం' అని ఆయన పేర్కొన్నాడు ఆయన తన కవితకు దీనినే లక్ష్యంగా గ్రహించినట్లు విజ్ఞుల విశ్వాసం.

జయభేరి (జయభేరి గై) అనే కవితలో భారతి అన్నాడు గదా:

'భయమనే పిశాచిని పారదోలినాము
అబద్ధ మనే పాముని చీల్చి అసువులు తాగినాము
వసుధ నంతా సుధగా తలచే

వేదపథం చేబట్టినామని
జయభేరి కొట్టరా-కొట్టరా
జయభేరి కొట్టరా'

బాలబాలికల్ని ఉద్దేశించి భారతి సంతరించిన గీతంలో కూడా వేద ప్రశంస కనిపిస్తుంది.

'వేదం వెలిసిన దేశ మిది-వీర
వరులూ ప్రభవించిన దేశం
అఖండ హిందుస్థాన మిది-దైవ
మనీ సేవించుము పాపా'

వే[illegible]లూ వీరవరేణ్యులూ అవతరించిన దేశానికి చెందిన వారమని భారతి గుర్తుచేస్తు[illegible] పిల్లలకి. వేదమార్గమే మార్గం అని కూడా ఆయన పేర్కొన్నాడు. [illegible]న్నవారు చెడరు నాలుగు వేదముల తీర్పిది – అన్నాడు మరో చోట.

స్త్రీలను ఉద్దేశించి వ్రాసిన ఒక గీతంలో ఆయన

'వేదం సృష్టించగ న్యాయం చేయగ
ప్రార్థించేమని గుమ్మి కొట్టు'

అన్నాడు. ఆయన చెప్పిన సుభాషితాలలో 'వేదం పుదుమై సెయ్' ఒకటి. అనగా వేదం కొత్తది కల్పించమని అర్థం.

మొత్తం మీద, భారతి వేద ప్రియుడనీ, మంత్ర శబ్దాల వలె కవిత ఉండాలని ఆయన ఆశించాడని చెప్పవచ్చు.

# 6

"వర్ధిల్లాలి వర్ధిల్లాలి తమిళం
వర్ధిల్లాలి నిరంతరం"

అని తమిళభాష వర్ధిల్లాలంటూ ప్రప్రథమంగా చెప్పిన తమిళ కవి సుబ్రహ్మణ్య భారతి. ఆయనే "వాళియ బారత మణి త్తిరునాడు" (వర్ధిల్లాలి శ్రీలుపొంగే

భారతం) అని కూడా అన్నాడు. అఖండ భారత దేశాన్నే భావించిన భారతి ఇతరులను, ఇతర భాషలను ఆదర పూర్వకంగా అభిమానించడంలో ఆశ్చర్యం లేదు. అన్యభాషా ద్వేషంలేని ఆ జాతీయ కవి చేసిన ఆంధ్ర ప్రశంసను పరిశీలిద్దాం.

భారతి దృష్టిలో తెలుగు సుందరమైన భాష. "భారతదేశం" అనే 13 చరణాల గేయంలో తెలుగుభాషా సౌందర్యాన్ని ఇలా ప్రశంసించాడు

"సింధు నదియిన్ మిశై నిలవినిలే
చేర నన్నాట్టిళం పెణ్‌గళుడనే
సుందర తెలుంగినిల్ పాట్టిశైత్తు
త్తోణిగళోట్టి విళై యాడివరువోం."
సింధునదిని పండు వెన్నెలలో
చేర దేశపు వయసు కన్నెలతో
తేట తెలుగులో పాట పాడుతూ
పడవ నడిపి తిరిగి వచ్చేము.

భారత దేశపు పతాకాన్ని ప్రస్తుతిస్తూ ఆయన "తాయిన్ మణిక్కొడి పారీర్" (మాతృ పతాకను పరికించండి) అనే పది చరణాల గేయంలో ఇలా పేర్కొన్నాడు.

"చెందమిళ్ నాట్టు ప్పొరునర్-కొడుం
తీక్కణ్ మఱవర్‌గళ్, చేరన్దన్ వీరర్
చిందై తుణిన్ద తెలుంగర్-తాయిన్
సేవడిక్కేపణి సెయ్‌దిడు తుళువర్"
పాండ్యదేశపు వీరయోధులు
అరుణనేత్రులు చేరవీరులు
స్థిరచిత్తులు తెలుగువారును
మాతృసేవకు కదిలివచ్చిరి.

1916 జులై 10 న "కాళిదాసన్" అనే నామాంతరంలో భారతి "సిలకవియరశర్" (కొందరు కవిరాజులు) అనే ఒక చక్కని వ్యాసం వ్రాశాడు. అందులో ఆంధ్ర మహాభాగవతకర్త అయిన బమ్మెర పోతనను ఉదాహరించాడు.

ఆ భక్త కవితోపాటు కవి చక్రవర్తి బిరుదాంకితుడు కంబ కవిని, తమిళ వేదకర్త తిరువళ్ళువరుని, తమిళ కావ్య పంచకంలో ఒకటైన "సిలప్పదికారం" వ్రాసిన ఇళంగో అడిగళుని (పూజ్యపాదులు) ఉదాహరించాడు.

తమిళ భాషను కొనియాడుతూ ఒక గేయంలో ఆయన ఇలా అన్నాడు. 'మే మెరిగిన కవులలో కంబడు, వళ్ళువరు ఇళంగోలవంటి కవులు లోకంలో మరెచ్చటా ప్రభవించలేదు" అని.

అలాంటి భారతి తాను మెచ్చిన తమిళ కవులవరుసలో తెలుగు కవి పోతనను చేర్చడం గమనించదగిన విషయం.

"తెలుంగ మగాసబై" అనే శీర్షికతో 1917 జూన్ 9న "శక్తిదాసన్" అనే లేఖినీ నామంతో ఒక ప్రశస్త వ్యాసం వ్రాశాడు భారతి. రాజనీతి శాస్త్రంలో ఘటికులైన తెలుగువారిని ఆయన కొనియాడిన తీరు ముఖ్యంగా పరిశీలించ దగింది. తెలుగువారంటే ఆ మహాకవికి ఎంత సదభిప్రాయం వుండేదో ఆ వ్యాసం స్పష్టం చేస్తుంది. అందులోనుంచి కొన్ని భాగాలు యథాతథంగా ఉదాహ రిస్తున్నాను.

"గత శుక్రవారంనాడు (జూన్ 1) నెల్లూరులో జరిగిన ఆంధ్ర మహాసభా సమావేశంలో సభాధ్యక్షులు శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులు చేసిన ఉప న్యాసం గమనించదగింది. రాజనీతి శాస్త్రంలో తెలుగువారికి గల ప్రావీణ్యం బహు ప్రాచీనమయింది. పాటలీపుత్ర నగరంలో వర్ధిల్లిన ఆంధ్ర రాజ్యమూ, తరువాతి కాలంలో తమిళనాడును పరిపాలించిన విజయనగర సామ్రాజ్యమూ పేర్కొనదగినవి. తెలుగువారు తమిళుల్ని పరిపాలించిన చిహ్నాలు మన భాష లోనూ, నిఘంటువులలోనూ చెరగని ముద్రలుగా నిలిచిపోయాయి. మన సంగీత నాట్య శాస్త్రాలు కూడా నేటివరకు తెలుగులోనే మునిగివున్నాయి మన గాయ కులు పాడే కీర్తనలలో ఉత్తమమైనవి తెలుగు కీర్తనలే.

దేవదాసీలు నాట్యం చేసేటప్పుడు పాడే వర్ణములూ, జావళీలు మొదలైన వాటిలోకూడా రుచికరమైనవి తెలుగు భాషలోనివే. మన గ్రామాలలో నివసిస్తున్న తెలుగు రెడ్లు, నాయుళ్ళు, తెలుగు బ్రాహ్మణ పురోహితులు తెలుగు దేవదాసీలు రాయలవారి కాలంలో ఇక్కడికి వచ్చి స్థిరపడినవారే.

మన వివాహ సమయాలలో పాడే పాటా లాలీ మొదలైనవన్నీ కూడా తెలుగు వారి సంప్రదాయానికి చెందినవే....

తెలుగు వారి యేలుబడిలో తమిళదేశంలో అధర్మం అన్నది లేదు తమిళులకు ఒక న్యాయమని, తెలుగువారికి మరొక న్యాయమని వుండేదికాదు. తెలుగు జాతి రాజనీతిశాస్త్రంలో ఆరితేరిన జాతి -- తెలుగు వారికి తాము తెలుగు భాషకు చెందిన వారమనే నిజమైన అభిమానం వున్నట్టుగా తమిళులలో తమిళంపట్ల ఆ అభిమానం లేదు ...పాఠశాలల్లో బోధించబడే అన్ని విషయాలు తమిళంలో బోధించేందుకు ప్రయత్నం చేసేవాడే తమిళభాషాభిమాని....'

భారతి చంద్రికైయిన్ కదై (చంద్రిక కథ) అనే అసంపూర్ణ రచన చేశాడు. ఇది సాంఘిక నవల. ఇందులో నవ్యాంధ్ర నిర్మాత కందుకూరి వీరేశలింగం పంతులూ, ఆయన సహధర్మిణి రాజలక్ష్మమ్మ ప్రముఖ పాత్రలు.

బాల వితంతువైన విశాలాక్షి చెన్నపట్టణంలో ఆనాటి ప్రముఖుల్లో ఒకరైన జి. సుబ్రహ్మణ్య అయ్యర్ సహాయాన్ని అర్థిస్తుంది. మళ్ళీ వివాహం చేసుకోవాలనే వుద్దేశంతో అయ్యరుగారు తమిళ దినపత్రికలలో మొట్టమొదటిదైన "సుదేశమిత్రన్" స్థాపకులూ, సంపాదకులూను. వీరేశలింగం పంతులుగారి సహాయం కోరవలసిందిగా ఆయన విశాలాక్షికి చెబుతూ ఇలా అన్నాడు: "రాజమహేంద్రపురంలో నా స్నేహితుడు ఒకాయన వున్నాడు. ఆయన పేరు వీరేశలింగం పంతులు. విధవా వివాహాల విషయంలో ఆయన శ్రద్ధగా కృషి చేస్తున్నారు."

వీరేశలింగం పంతులు ఇంట్లో విందు—అనే అధ్యాయంలో కందుకూరి దంపతులు ప్రముఖంగా కనిపిస్తారు. కథలో పంతులుగారి ప్రశంస క్కడక్కడ కనిపిస్తుంది. కాగా, కందుకూరివారంటే భారతికి ఎనలేని ఆదరభావమనవచ్చు. "మీకు తెలుగు వచ్చునా?" అని పంతులుగారు తెలుగులోనే విశాలాక్షిని అడిగినట్టుగా కూడా భారతి ఒకచోట పేర్కొన్నాడు.

తిరునెల్వేలి జిల్లాలోని ఎట్టయపురంలో జన్మించిన సుబ్రహ్మణ్య భారతికి తెలుగు వచ్చునని చెప్పవచ్చు. ఎట్టయపురం మహారాజు అయిన జగదీశ్వర రామకుమార ఎట్టప్ప హూణాంధ్ర ద్రవిడ భాషలలో అతి సమర్థులు. ఆయన ప్రోత్సాహంతో ప్రసిద్ధ సంగీత శాస్త్రజ్ఞులు సుబ్బరామదీక్షితులు కవిత్రయంవారి

భారతాన్ని తమిళం చేశాడు. దీక్షితులపట్ల భారతికి అపారమైన గౌరవం. అది పురస్కరించుకుని భారతి "సుబ్బరామ దీక్షితర్" అనే ఒక కవిత వెలయించాడు. ఆయనవద్ద భారతి తెలుగు నేర్చుకుని వుండవచ్చు.

1921 సెప్టెంబరు 11 న భారతి కాలధర్మం చెందాడు.

ఆయన దహనసంస్కారం గురించి ఒక తమిళ రచయిత ఇలా వ్రాశాడు. "భారతి మరణవార్త తెలియగానే శ్రీయుతులు పుదుచ్చేరి శ్రీనివాసాచారి, తిరుమలాచారి, హరిహరశర్మ ప్రభృతులు ఆయన ఇంటికివచ్చారు. దహన సంస్కారం జరిగేందుకు ముందు శ్రీయుతులు శర్కరై సెట్టియార్, కృష్ణస్వామి శర్మ, రామచంద్ర అయ్యర్ ప్రభృతులు తమిళంలోను, సురేంద్రనాథ్ ఆర్యా తెలుగులోను ఉపన్యసించారు. ఆ తర్వాత భారతి రచించిన గీతాలు ఆలపించారు .. '

తెలుగు భాషా సాహిత్యాలను, తెలుగువారిని ఎంతగానో అభిమానించిన జాతీయ కవి సుబ్రహ్మణ్య భారతి. భాషాభేదాలు, ప్రాంతీయ భేదాలు మొదలైనవి నానాటికీ ఎక్కువవుతున్న ఈ రోజులలో భాషాదురభిమానం మచ్చుకైనా లేని భారతి ఆదర్శపురుషుడనడం అత్యుక్తికాదు!

మన సాహిత్య చరిత్రలోనేకాక దేశచరిత్రలోనూ స్థానం సంపాదించుకున్న ఆ మహాకవికి జోహారులు అర్పించడం మన ధర్మం!

తమిళ వాఙ్మయ సుందరోద్యానమందు
నీవు నాటిన మొక్కలు నేడు కల్ప
తరువులై తనరారుచు మరులుగొలుపు
చున్న యవి; నిక్కువంబిది-సుకవి నీవు,

బాల గీతాలలో భద్రపరిచి తీవు
పది కాలములు నిల్చు భాషితములు
కోయిల కవితలో తీయని భావాలు
సవరించుకొనె అందచందములును
కన్నయ్య పాటలన్ కరుడుగట్టెను మాట
మాటను చిక్కని మధుర భక్తి
పాంచాలి శపథాన భరతవీరుల కథ
కొక క్రొత్త రూపమ్ము నొసగినావు

దేశభక్తి, దేవదేవుని యందు న
చంచల మగు భక్తి, సర్వమత స
హనము, ద్వేషరహితమైన భాషాభిమా
నమ్ము — నీ కవితకు సొమ్ము లయ్య !
పాత పుంతలు వీడి చేపట్టవలెను
నూతన పథము లంచును నుడివితీవు ;
భారతీ, నవ్యదీధితీ ! తారకల వి
ఖాతి వెలుగొందు నయ్యా నీ కైతలెల్ల !

# రాజాజీ తమిళ సాహిత్యసేవ

రాజాజీగా, సి. ఆర్. గా విశ్వవిఖ్యాతి గడించిన శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలాచారి అటు రాజకీయరంగంలోనూ, ఇటు సాహిత్యక్షేత్రంలోనూ సమప్రజ్ఞ ప్రదర్శించిన సవ్యసాచి. ఆయన ప్రముఖ రాజనీతివేత్త; ప్రసిద్ధ రచయిత. అయితే రాజకీయంగా ఆయన ఉన్నతశిఖరాలు అధిరోహించిన అంశం అందరికీ తెలిసిందే రచయితగా ఆయనకు గల ప్రతిభ అనిర్వచనీయం. కాని యిది కొందరికే తెలిసిన విషయం. ఆయన రాజనీతి ప్రతిభ ముందు ఇది కొంత వరకూ మరుగున పడిపోయిందేమో అనిపిస్తుంది. మొత్తం మీద ఉజ్జ్వలంగా ప్రతిభాసించే జాతిరత్నం రాజాజీ!

భారతీయ రచయితలలో కూడా రాజాజీకి విశిష్టస్థానం లేకపోలేదు. మాతృభాష అయిన తమిళంలో ఆయన వైపు వాటమ్ము తెలిగిన రచయిత; అలాగే పరభాష అయిన ఆంగ్లంలోనూ, పిల్లల కథలను ఎంత రమణీయంగా తీర్చిదిద్ద గలడో, అంత రమణీయంగానూ పెద్దలకు సైతం కథలు చెప్పగలిగిన మహిత శక్తి ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. బి.సి.జి. టీకాలు మొదలుకొని బ్రహ్మ విద్యవరకూ గల వివిధ విషయాలను చవులూరే విధంగా చెప్పగలిగిన అద్భుత శక్తి ఆయనకు పెట్టని భూషణం, ఆయన కమ్మని కథానికలు వెలయించారు; గోరుముద్దలవంటి నీతికథలు సంతరించారు తనకే సొంత మనదగిన ఒక విలక్షణమైన పద్ధతిలో రామాయణ భారతాలు రచించి ఆధునిక పాఠక లోకంలో వాటికి ప్రచుర ప్రచారం కల్పించారు. వ్యాఖ్యానాలు వెలయించారు. తమిళంలోనూ ఆంగ్లంలోనూ చక్కని అనువాదాలు చేశారు. ఇక వివిధ పత్రిక లకూ ఆయన వ్రాసిన వ్యాసాలు చుబ్బన చూరలు. ఆయన లేఖినినుంచి వెలువడిన లేఖలేమో అసంఖ్యాకములు. కాని ఈ లేఖావళిని సమగ్రంగా సేకరించడం జరగ లేదు. చివరికి ఆయన ఆంగ్లంలో ఒక గేయం కూడా వెలయించారు. అయితే విచిత్ర మేమిటంటే, రచయితగా పేరు పెంపులు గడించాలనే అభిలాషతో ఆయన రచనా వ్యాసంగానికి దిగలేదు. తమిళంలో తగినంత పాండిత్యం గడించినా, ఆయనకి మొదట్లో సంస్కృతం అంతగా తెలియదు. యాభయ్యోయేట సంస్కృతం

అభ్యసించారు చివరికి సంస్కృతంలోనూ పాండిత్యం గడించారు. ఆంగ్లభాష మీద ఆయనకి గల అధికారం అపూర్వమయింది. కాగా రాజాజీ నిత్య విద్యార్థి అన్నా సాహసం కాదు. బహుకార్యనిమగ్నులైనా, షేక్స్పియర్ నాటకాలను ఆయన ప్రతినిత్యమూ చదివేవారని అభిజ్ఞులు చెబుతారు.

అయఃపిండం వంటి విషయాన్ని కూడా అమృతతుల్యంగా మలచగల నైపుణి రాజాజీని ఒక విశిష్టరచయితగా రూపొందించింది ఆయన రచనలను అలవోకగా పరిశీలించినా ఈ విషయం కొట్టవచ్చినట్లు తెలియవస్తుంది. ఎంతటి జటిల విషయాన్ని కూడా నలుగురికీ తెలిసేలా విపులించడంలో ఆయన అందె వేసిన చెయ్యి! అయోమయత్వం కాని అస్పష్టత కాని ఏమాత్రమూ లేని ఆయన సరళసుందరమైన శైలి అందుకు బహుధా తోడ్పడింది చాలామంది తమిళ రచయితలవలె, రాజాజీ గ్రాంథిక భాషావాది కాదు నూటికి నూరుపాళ్ళూ ఆయన వ్యావహారిక భాషావాది. కనుకనే ఆయన వ్రాతలలో వ్యవహారంలో ఉన్న సంస్కృత శబ్దాలు అరమరిక లేకుండా చోటు చేసుకున్నాయి. ఈ విషయాన్ని రాజాజీ మాటలలోనే వివరిస్తాను

"ఏ భాషదయినా సరే, ప్రచారంలోకి వచ్చి తమిళరూపం పొంది, అందరూ అర్థం తెలుసుకునే మాటగా ఉంటే, దాన్ని సందర్భానికి తగినట్లు వాడినప్పుడు తప్పు ఏమీ ఉండదు. ఛాందసులు సైతం ఆక్షేపించరు."[1]

రాజాజీ వాక్యనిర్మాణం క్లిష్టంగా ఉండదు; సరళంగా సాఫీగా సాగుతుంది. అది స్పష్టంగా సూటిగా చదువరి హృదయాన్ని హత్తుకునేలా ఉంటుంది. ఆయన భావాలలోనూ భాషలోనూ అస్పష్టత లోపించడం వల్ల, ఆయనశైలి పైకి సరళంగా ఉన్నట్లు కనిపించినా అది మహాశక్తిమంత మయింది భావ గాంభీర్యమూ భాషాసారళ్యమూ రాజాజీ రచనలకు జీవం పోశాయి

మరొక విశిష్టత కూడా రాజాజీ శైలిలో గోచరిస్తుంది. ప్రతికారచన కావించినా, పుస్తకం వెలయించినా, లేఖ సంతరించినా, ఆ రచనలలో ఒకే రకమైన శైలి కనిపిస్తుంది. అనగా, రాజాజీది సమత గల శైలి అనడం నిర్వివాదం.

---

1. కట్టురైగళ్, రెండో ముద్రణ, పుట 14.

రాజాజీ ఏమి వ్రాసినా, దానికి ఒక నిర్దిష్ట ప్రయోజనం ఉంటుంది. ఇది ఆయన కథలకేకాక అనువాదాలకూ అనుకరణలకూ కూడా వర్తిస్తుంది. భగవద్గీతలో తనకు నచ్చిన 200 శ్లోకాలకు ఆయన చక్కని లఘు వ్యాఖ్య వెల యించారు ఈ పుస్తకం పేరు కణ్ణన్ కాట్టియ వళి (కన్నయ్య చూపిన దోవ). సంస్కృతం తెలియని తమిళుల్ని ఉద్దేశించి తాను ఈ వ్యాఖ్యానం వెలయించి నట్లు ఆయన స్పష్టం చేశారు. "శంకరుడు, రామానుజుడు, మధ్వాచార్యులు మొదలైనవారు సంస్కృతంలో భాష్యాలు వ్రాశారు. సంస్కృతం తెలియనివారికి అవి జ్ఞాన మనే బంగారు గనుల్లా ఉన్నాయి ఆ భాష్యాల ముందు ఈ కాలం వారు సంతరించే వ్యాఖ్యానాలు సత్తువ లేని తవుడువంటివి "1

గీతాప్రాశస్త్యం మొదలైన పెక్కు అంశాలను గురించి కూడా ఆయన ఈ 142 పుటల పుస్తకంలో ముచ్చటించారు. ఆయన అభిప్రాయాలు సహృదయ రంజకములు కాబట్టి, వాటిలోంచి కొన్నిటిని యథాతథంగా ఉదాహరిస్తున్నాను,

"భగవద్గీతను పఠించేటప్పుడు భారతకథను మరచిపోవడమే మంచి దని నా అభిప్రాయం. గీతలో చెప్పబడిన సత్యాలూ ఉపదేశాలూ ఏ కాలాని కైనా ఏ సందర్భానికైనా తగినవి కనుక, యుద్ధరంగంలో అర్జునుడికి ఏర్పడిన మనోవైకల్యానికి తగిన మందు గీతావాక్యాలలో కనిపిస్తుం దనడంలో సందేహం లేదు. అయినప్పటికీ, ఒక ప్రత్యేక పరిస్థితికి సంబంధించిన అంశాలను ప్రమా ణంగా గ్రహించి ఒక ధర్మశాస్త్రమును పరిశోధించడం అనుచితమైన విధాన మవుతుంది."2

"దొంగను వెతికి పట్టుకునేందుకుగాను ఇంటిని గాలించే నిమిత్తం లోపలికి వచ్చే పోలీసువాని మనస్తత్వంతో గీతనుగాని, ఇతర మతస్థులు సమా దరించే మార్గదర్శక గ్రంథాలనుగాని చదవడం వల్ల లాభంలేదు. అలా చదవనూ కూడదు. మార్గదర్శక గ్రంథాలను పఠించేటప్పుడు తనయుడు తండ్రిపట్ల సంచ రించేలా భక్తి ప్రేమలు కలిగివుండాలి."3

---

1. కణ్ణన్ కాట్టియ వళి, 5వ ముద్రణ, పు. 7.

2. కణ్ణన్ కాట్టియ వళి, 5వ ముద్రణ పు. 10.

3. కణ్ణన్ కాట్టియ వళి, 5వ ముద్రణ, పు. 18

రాజాజీది ప్రధానంగా ధార్మిక దృష్టి. ఆయన రచనలే యిందుకు సాక్ష్యం. ఔచిత్యం, సునిశితమైన హాస్యం మొదలైనవి ఆయన రచనలకే కాక ప్రసంగాలకు కూడా వన్నె చిన్నెలు సమకూర్చాయి. సమయస్ఫూర్తి ఆయనకి ఉగ్గుతో అల వడిందనడం అత్యుక్తి కాదు. ఈ సందర్భంగా మదరాసులో జరిగిన ఒక ముచ్చటను ప్రస్తావించకుండా వుండలేకపోతున్నాను.

సముద్రతీరాన ఒక సభ జరుగుతోంది. వక్తలలో రాజాజీ ఒకరు. ఆయన ప్రసంగిస్తూ వుండగా, ఒకతను వేదికమీదికి రాళ్ళు రువ్వాడు. సభలో గందర గోళం మొదలయింది. వెంటనే సభికుల్ని ప్రశాంతంగా ఉండవలసిందని అర్థిస్తూ "మనవాళ్ళకి గురిచూసి మనిషిని కొట్టడం తెలీదు. అలా తెలిసివుంటె, తెల్లవాడు యీపాటికి ఎప్పుడో మనకు స్వాతంత్ర్యం యిచ్చి వుండేవాడు" అన్నారు. అంతే. సభలో ఒకటే నవ్వు. ఆ తర్వాత ప్రశాంతంగా సభ జరిగింది, ఆయన ప్రసంగమూ కొనసాగింది

తాత్త్విక దృష్టి కల రచయిత అయినప్పటికీ, రాజాజీ ప్రధానంగా ఉత్తమ కథకుడు అందులోనూ ప్రతి విషయాన్ని నిశితంగా, గాఢంగా పరి శీలించే స్వభావం కల రచయిత. అందువల్ల సర్వసామాన్యంగా కనిపించే విష యాలు సైతం ఆయన కథల్లో ప్రముఖంగా కనిపిస్తాయి. రాజాజీ కథానికలను, ఇతర రచనలను పరిశీలించేందుకు ముందు. తమిళంలో ఆయన వెలయించిన రచనలను తెలుసుకోవడం సముచితం.

వియాసర్ విరున్దు
చక్రవర్తి తిరుమగన్
కణ్ణన్ కాట్టియ వళి
వళ్లువర్ వాచకం
తిరుమూలర్ తవమొళి
ముదల్ మూవర్
కై విళక్కు
ఆత్మచింతనై
భజ గోవిందం
అభేదవాదం

నిరంతరచ్చెల్వం
చిత్తైయిల్ తవం
ఉపనిషద ప్పలకణి
వేదాంత దీపం
ముత్తుక్కువియల్
మణి మొళిగళ్
మణి వాచకం
తిణ్ణై రసాయనం
ఉవమైగళ్
సోక్రతర్
తావరంగళిన్ ఇల్లఱం
రామకృష్ణ ఉపనిషదం
రాజాజీ కదైగళ్
పిళ్లైయార్ కాప్పాట్రినార్
కట్టు రైగళ్
పాఱ్కడల్
కర్పనైక్కాడు (లేక) కుళందైగళుక్కాన కుట్టిక్కదైగళ్
అచ్చమిల్లై
పోట్టి ఒళిగ
మెయ్ ప్పొరుళ్

రాజాజీ ఎన్నో రచనలు చేసినా, రామాయణ భారతాలు వ్రాయడం వల్ల కలిగిన తృప్తి ఆయనకి మరొక రచనవల్ల కలుగలేదనడం అతిశయోక్తి కాదు. ఆయనే యిలా పేర్కొన్నారు. "దేశానికి నేను ఎంతో సేవ చేసినట్లు మిత్రులు నన్ను ప్రశంసించడం కద్దు. వ్యాసర్ విరున్దు, చక్రవర్తి త్తిరుమగన్-ఈ రెండూ వ్రాసి ముగించడం మిన్నగా భావిస్తున్నాను. అన్నిటికంటె ఈ రచనలే నా మనస్సుకి సంతోషమూ ప్రశాంతతా ప్రసాదించాయి.[1]"

---

1. చక్రవర్తి త్తిరుమగన్ (1958). పు. 4

కేంద్రసాహిత్య అకాదెమీ బహుమతి పొందిన చక్రవర్తి తిరుమగన్ వాల్మీకి రామాయణాన్ని అనుసరించి సంతరించబడిన ప్రశస్త రచన. బాలబాలికలనూ స్త్రీలనూ ఉద్దేశించి తాను ఈ రచన చేసినట్లు రాజాజీ పేర్కొనడం ఆయన వినమ్రతకు తార్కాణ[1] కాని నిజానికి ఈ రచన ఎందరెందరినో ప్రభావితుల్ని చేసింది. చివరికి రామాయణం పట్ల అంత ఆదరభావం లేనివారు కూడా కొంతవరకూ ప్రభావితులు కాగలిగారని చెప్పవచ్చు. ఈ సందర్భంలో ఒక విషయాన్ని మనవి చేయడం అప్రస్తుతం కాదు.

ఒక రాజకీయ సభలో ప్రసంగిస్తూ 'రాముడంతటివాడు తన శత్రువుని జయించడానికి వానర వీరుల సహాయాన్ని అర్థించవలసి వచ్చింది' అని రాజాజీ పేర్కొన్నారు. ఆ నాళ్లలో ఆయన ద్రావిడ మున్నేట్ర కళగం వారిని సమర్థిస్తూ వచ్చారు, ఆ మరునాడు ప్రముఖ నాయకులలో ఒకరైన ఇ.వి. రామస్వామి (నాయకర్)గారు ఇలా అన్నారు: డి.యం.కె. వారిని వానరులతో పోల్చారు రాజాజీ. ఈ విషయాన్ని ఇప్పటికైనా వారు గ్రహించడం మంచిది—అని. ఆ తర్వాత డి.యం.కె. నాయకులూ, అప్పటి తమిళనాడు ముఖ్యమంత్రి అయిన సి.యన్. అణ్ణాదురై రామాయణంలో వానర వీరులకు గల ప్రాధాన్యమును వివరిస్తూ ద్రావిడనాడు అనే తమ పత్రికలో ఒక ప్రశస్త వ్యాసం వ్రాశారట[2].

వైష్ణవ సమయాచార్యులు రాముడికి పెట్టిన పేరు చక్రవర్తి తిరుమగన్. అనగా చక్రవర్తి తనూజుడని అర్థం. వాల్మీకి కృతిని ఆధారంగా చేసుకుని రాజాజీ రామకథను రచించినా, కొన్ని చోట్ల కంబమహాకవి కృతిని కూడా సంప్రదించారు. రామ జటాయు సమావేశాన్ని వాల్మీకి సంగ్రహంగా చెప్పగా, కంబర్ ఆ ఘట్టాన్ని కొంచెం విపులీకరించారు. ఈ విపులీకరణను రాజాజీ సమర్థించారు. ఆయన దృష్టిలో రాముడు కావించిన వాలివధ సమర్థనీయం కాదు వాలివధం

---

1. చక్రవర్తి త్తిరుమగన్ పు. 397

2 రాజాజీ అంతరంగిక కార్యదర్శీ, తమిళ రచయితా అయిన శ్రీ యస్.వి.యస్ (యస్. వెంకట సుబ్రహ్మణ్యం) చెప్పగా నేనీ విషయం తెలుసుకున్నాను, ఆయనకి నా కృతజ్ఞత.

అనే ఏకాంకిక ఆయన వ్రాశారు నాటిక చివరలో ఆయన రామ లక్ష్మణులచే. ఇలా పలికించారు 1

"రాముడు : లక్ష్మణా! ఇంతవరకూ ఇతరులు చేసిన పొరపాట్లవల్ల నువ్వూ నేనూ దుఃఖం అనుభవించాము. ఇప్పుడు మన పొరపాటువల్ల మనం దుఃఖం అనుభవిస్తున్నాము. దీన్ని భరించడం చాలా కష్టం.

లక్ష్మణుడు : అన్నయ్యా! విధిని ఎవ్వరూ తప్పించ లేరు. నాకూ జ్ఞానం వచ్చింది విధివిలాసం కాకపోతే, నా తల్లి జానకి నన్నిలా కసిరి పంపించి వుండేదా? (విలపిస్తాడు)"

ఈ సందర్భంగా, కవితలకు వెలయించే వచనానువాదములను గురించి రాజాజీకి గల అభిప్రాయములు తెలుసుకోవడం సముంజసం.

"కంబర్ కవితను గాని భారతియార్ కవితను గాని వచనంలోకి మారిస్తే, జీవంలేని శరీరమే మిగులుతుంది వస్తువుకి నాశ మన్నది లేకపోయినా, వచనం లోకి మార్చబడిన కవిత జీవంలేని జంతువులా ఉంటుంది. దానితో పాటు టీకా తాత్పర్యాలు, వ్యాకరణ విశేషాలు కూడా జోడిస్తే ఆ రచన శవపరీక్షా కేంద్రంగా మాత్రమే ఉపకరిస్తుంది. శవపరీక్ష విజ్ఞానాభివృద్ధికి తోడ్పడుతుంది. కాని అందులో సౌందర్యం లేదు .. కాలానికి పరిస్థితులకూ తగినట్లుగా నిజమైన కవులు వ్రాయగలుగుతారు కాని కేవల శుష్కపరిశోధనల్ని కవితలుగా మలచరు."

107 శీర్షికలలో రాజాజీ రచించిన వ్యాసర్ విరున్దు (మహాభారతం) కూడా పేర్కొనదగిన రచన వ్యాసుని భారతమును అద్భుతాలలో కల్లా అద్భుతంగా ఆయన అభివర్ణించారు. భారత కథాశ్రవణం వల్ల విజ్ఞానమూ వినమ్రతా ఆత్మశక్తి లభించగలవని ఆయన విశ్వాసం. ఆశాద్వేషములూ, ఈర్ష్యాక్రోధములూ కల మనుగడ లాభరహిత మనే అంశమును స్పష్టం చేసేందుకు భారతకథ తప్ప మరొకటి తోడ్పడదనీ ఆయన నమ్మకం, వ్యాసుని రచనను ప్రశంసిస్తూ ఆయన యిలా పేర్కొన్నారు. "మహాభారతమూ రామా

1. పాఙ్కడల్ (1960). పుటలు 111-120.

యణమూ తెలియనివాడు మన దేశంలో ఎవ్వరూ ఉండరు. అయినా, హరి దాసులు, సినిమావారూ, ముసలమ్మలూ చేర్చిన కొత్త సరుకులు కలపకుండా సరిగ్గా చదివి తెలుసుకున్నవారు చాలా కొద్దిమంది అనే నా అభిప్రాయం. కొత్త సరుకులు రసవంతంగా ఉండవచ్చు. కాని వ్యాసుని రచనలోని గాంభీర్యమూ లోతైన భావమూ ఇతరుల వ్రాతలలో లోపిస్తున్నాయి ''

పైకి ప్రాచీనుడుగా కనిపించినా, రాజాజీ నవ్యభావాలు సంతరించుకున్న రచయిత. ఇందుకు ఆయన వ్యాసాలు ప్రబల సాక్ష్యం విజ్ఞాన శాస్త్ర విషయాలకు సంబంధించిన రచనలు తమిళంలో వెలువడాలని ఆయన ఆశయం. వృక్షశాస్త్రం గురించి ఆయన 'తావరంగళిన్ ఇల్లఱం' అనే పుస్తకం 194, లో వ్రాశారు. వృక్షశాస్త్రాచార్యులైన కిడాంబి రంగాచార్యులకు అంకిత మీయబడిన ఈ రచనలో చెట్టుచేమల జీవన విధానానికి మన సాంసారిక జీవన విధానానికి సామ్య మున్నట్టు చెప్పబడింది. రసాయనశాస్త్రమునకు సంబంధించిన రచన (తిణ్ణై రసాయనం) కూడా చేశారు, కాదలుం కలియాణముం (ప్రేమా పెళ్ళి) అనే 17 పుటల వ్యాసంలో ఆయన ప్రేమవివాహాన్ని పూర్తిగా సమర్థించారు. ''ప్రేమ ఒక జ్వరమనీ, వివాహం దానికి మందనీ భావించకూడదు. అలా భావిస్తే, పెళ్ళి కాగానే జ్వరం తగ్గిపోతుంది — ప్రేమ అనేది ఒక జ్వరం కాదు. పుష్ప సౌరభంలా అది ఒక ప్రకృతి శక్తి; ఆరని శక్తి.'' అని ఆయన అన్నారు,1

ఇక రాజాజీ కథలను పరిశీలించడానికి ముందు, కథను గురించి ఆయనకి గల అభిప్రాయాలు తెలుసుకోవడం సముచితం.

రాజాజీ రచనలు లక్ష్యప్రధానములు. ఉబుసుపోకకు ఆయన ఎన్నడూ రచనలు చేయలేదు. ఏదో ఒక ప్రయోజనమును ఆశించే రచన చేశారు. 1929లో ఆయన 'విమోచనం' అనే ఒక మాసపత్రిక నడిపారు, సంపూర్ణ మద్యపాన నిషేధ ప్రచారం కోసం అది స్థాపించబడిందన్నా అత్యుక్తి కాదు ''నాకు కాల క్షేపం కథలు (ఉల్లాస కథలు) వ్రాయడం తెలీదు ఏవైనా కొన్ని అభిప్రాయాలనో, లక్ష్యాలనో పురస్కరించుకుని కథలు వ్రాయడం తెలుసు '' అని ఒకచోట ఆయన తెలియజేశారు ''2

1. కట్టురైగళ్, పు, 84

2 పాటుక్కడల్ (1960), మున్నుడి,

చిలుకదై అనే శీర్షికతో రాజాజీ కథానికను గురించి తొమ్మిది పుటల వ్యాసం వ్రాశారు. ఇందులో తమ అభిప్రాయాలను ఆయన నిర్దిష్టంగా వెల్లడి చేశారు. వాటిలో కొన్నిటిని యథాతథంగా ఉదాహరిస్తున్నాను : "కథానికకు జీవం అందులో వ్యక్తం చేయబడే సందేశం...చిన్న కథలో ఏదైనా ఒక సందేశం లేదా మనోభావం అంతర్వాహిని కాకుండా వట్టి కథ మాత్రమే చక్కగా చెప్ప బడితే అది చాలదు. సందేశం అంటే ప్రచారం కాదు; నీతి వాక్యాలూ కాదు. సౌందర్యం, ప్రేమ, అనుకంప, ఉదాత్తత, ఆనందం, ద్వేషం, దుఃఖం, కోపం, తాపం, ఆశ, దిగులు మొదలైన వాటిలో ఏదో ఒక మనోభావమో జీవనతత్త్వమో కథలో అంతర్లీనమై వుండాలి. జీవితంలో ఉన్నది వున్నట్లుగా చిత్రించడమే సాహిత్యపద్ధతి. అయితే జీవితంలో మంచీ వుంది; చెడూ వుంది. అందమూ వుంది అవలక్షణమూ వు ది లాభించేదీ వుంది లాభించనిదీ వుంది. అన్నిటినీ సరిగా పరిశీలించి గ్రహించడంలోనే రచయితల కళాత్మకశక్తి యిమిడివుంది, కళలో నిజం ఉండాలి, నిజం లేకుండా కళ లేదు. అయితే నిజమంతా కళ కాదు సంఘటనలనూ సంభాషణలనూ ఒక క్రమంలో కూర్చినంత మాత్రాన సాహిత్యం కాదు. ఏది కళకు తోడ్పడుతుందో దాన్ని గ్రహించి దానికి సాహిత్య స్వరూప మిస్తే అది కళ అవుతుంది."

"అనుచితమైన ప్రేమను గ్రహించి చిత్రించడం సులభం కథ కూడా ఆకర్షకంగా వుంటుంది. అయితే అది జనులకు ఉపయోగపడదు. కార్యకారణ పద్ధతి జీవితంలో ఎలా పనిచేస్తుందో, ఆ విషయాన్ని స్పష్టం చేసేందుకు అనుచిత మైన ప్రేమను గురించి కథలు వ్రాయవచ్చు. కాని విషం కలిసిన మందులా, దాన్ని అతి జాగ్రత్తగా వాడవలసి వుంటుంది.

"ఇప్పుడు వెలువడుతున్న కొన్ని చిన్న కథలను కనక చూస్తే, మిత్రులు తమ భార్యలను ఘోషాలోనే వుంచి కాపాడవలసిన అవసరమున్నట్లు కని పిస్తోంది. ఆడా మగా కలిసి మాట్లాడడమే అనర్థదాయక మనిపిస్తోంది. కథలో ఒకడు ఏకాంతమెను కలుసుకోవడం తరువాయి ధర్మహాని కలుగుతోంది. ఇటువంటి సాహిత్యాన్ని సృష్టించడం సులభం; అమ్మడమూ సులభమే. జాజిచెక్కతో వడ్రంగం చెయ్యడం సులభం. కాని ఆ సామాన్లకి గట్టి తక్కువ అందువల్ల లాభమూ లేదు, అపమార్గంలో పయనించే ప్రేమను చిత్రిస్తూ త్వరత్వరగా

వ్రాసే కథలూ యిలాగే లాభరహితము లవుతాయి. అంతే కాదు, సాహిత్యమన్న పేరుతో వంచించి సమాజానికి విషం పెట్టినట్లవుతుంది."

"మంచి కథానికకు గుర్తు ఒకటే. అది చదివి ముగించేసరికి సహృదయు లకు సంతోషంతోపాటు మనోవికాసమూ కలుగుతుంది."[1]

రాజాజీ కథలు అయిదు సంపుటాలుగా వెలువడినాయి. అవి యివి: కణ్ణనై క్కాడు, నిరంతర చ్చెల్వం, రాజాజీ కదైగళ్, పిళ్లైయార్ కాప్పాట్రినార్, పాఱ్కడల్. కణ్ణనైక్కాడు బాలబాలికల కోసం చెప్పబడిన నీతికథా సంపుటి. కడమ సంపుటాలలోని కథలు కనుక చదివితే, ధైర్యం, ఉపకారవాంఛ, జాలి, ప్రేమ, ప్రయత్నం మొదలైనవి మానవుడిలో నెలకొనాలన్న రాజాజీ ఆకాంక్ష వ్యక్తమవుతుంది. మద్యపాన నిషేధావశ్యకతను తెలియజేస్తూ, ఆయన చక్కని కథలు వ్రాశారు. జాతి భేదాలవల్ల కలగుతున్న యిబ్బందులను కొన్ని కథలలో వివరించారు. సాంఘికంగా హరిజనులు ఎదుర్కొంటున్న కష్టనష్టాలను కథలలో తెలియజేశారు. వస్తు వైవిధ్యంతో పాటు రాజాజీ కథలలో సాంఘిక దృక్పథం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది అనాటి సమస్యల తీవ్రత ఈనాడు కొంతవరకూ తగ్గి నప్పటికీ, సాంఘిక దృక్పథంలో మలచబడినవి కనుకనూ, సందేశాత్మకములు కనుకనూ రాజాజీ కథలు ఎప్పుడు చదివినా మనోహ్లాదమూ మనోవికాసము కలుగుతాయి.

ఇక కొన్ని కథలు పరిశీలిద్దాము :

చేనేత వస్త్రాల వ్యాపారం పడిపోవడంలో ఒక సాలె కుటుంబం ఏ విధంగా చితికిపోయిందీ 'దేవానై' అనే కథలో రాజాజీ చిత్రించిన తీరు కఠిక గుండెను కూడా కదిలిస్తుంది.

సేలంలో ఒక పేద కుటుంబం ఉండేది. ఆ కుటుంబంలోని తల్లీ, కొడుకూ (వైయాపురి), కూతురూ (దేవానై) ముగ్గురూ కష్టపడి పనిచేసేవాళ్ళు. అయినా అతికష్టం మీద రోజులు గడిచేవి అలా వుండగా, చేనేత వ్యాపారం పడి పోయింది. కూలి తగ్గు ముఖం పట్టింది. తత్ఫలితంగా చేనేత పారిశ్రామికులు అగచాట్ల పాలయ్యారు

1. కట్టురైగళ్, 2వ ముద్రణ (1947), పుటలు: 215-223

వైయాపురి స్వస్థలం విడిచిపెట్టి బెంగుళూరు వెళ్ళాడు. అక్కడ ఒక మిల్లులో చేరాడు. దురదృష్టవశాత్తు మిల్లులో సమ్మె జరిగింది. ఆ సమ్మెతో సంబంధం ఉన్నదన్న నెపంతో వైయాపురిని పనిలోంచి తీసేశారు తర్వాత అతను మదరాసు చేరుకున్నాడు కష్టపడగా పడగా ఒక మిల్లులో ఉద్యోగం దొరికింది శ్రమను మరిచిపోయేందుకు తాగుడు అలవాటు చేసుకున్నాడు. క్రమక్రమంగా జూదానికి కూడా తల ఒగ్గాడు. ఈ అలవాట్లు పెరిగేకొద్దీ బాకీలు గూడా పెరిగినాయి. ఇంటికి డబ్బు పంపించడం మానివేశాడు, పై పెచ్చు దేవానై కూడా మదరాసులోనే ఏదో ఒక మిల్లులో పని చెయ్యవచ్చునని యింటికి జాబు వ్రాశాడు.

అన్నగారి మాట విని దేవానై మదరాసు చేరుకుంది. ఆమెకు ఒక మిల్లులో పని దొరికింది. అక్కడ ఆడ కూలీల మీద అజమాయిషీ చేసే మేస్త్రీ మంచివాడు కాదు. అతను ఆమె శీలాన్ని హరించాడు. ఆమె గర్భవతి అయింది. తన పరిస్థితిని అన్నగారికి కూడా తెలపడానికి దేవానై భయపడింది. చివరికి ఒక స్నేహితురాలి సలహా మీద ఆమె ఒక 'పరోపకారి' ముసలమ్మను ఆశ్రయించింది. ఆమె పురుడు పోసింది, దేవానై బిడ్డతల్లి అయింది. ఆ పరోపకారి ముసలమ్మ మంచిది కాదనే విషయం ఆ తర్వాతనే ఆమెకు తెలియవచ్చింది. అనాథలైన యువతులను అడ్డం పెట్టుకొని ఆ ముసలమ్మ అవినీతికరమైన వృత్తి సాగిస్తోంది. దేవానై ఆ విష వలయంలోంచి ఎలాగో బయటపడి, బిచ్చగత్తెగా మారింది. చివరికి దేవానై ఏమయిందో ఎవరికి తెలియదు

చేనేత పారిశ్రామికుల స్థితిగతులు, మిల్లుల్లో నిస్సహాయలైన స్త్రీలకు జరిగే అవమానాలు, అటువంటివారిని అపమార్గంలో ప్రవర్తింపజేసే కొందరి అవినీతి చర్యలు మొదలైనవాటిని రాజాజీ చిత్రించడంవల్ల, ఈ కథానికను చదువుతున్నప్పుడు పేద కుటుంబానికి చెందిన ఒక అభాగ్యవతి దయనీయ జీవితం మన కళ్ల యెదుట మసలుతూ వుండడంలో ఆశ్చర్యం లేదు

మద్యపానం వల్ల పండంటి సంసారాలు ఎలా పాడయిపోతున్నాయో జయరామన్, దిక్కుట్ర పార్వతి మొదలైన కథలలో రాజాజీ చక్కగా తెలియజేశారు. జయరామన్ కథా సంగ్రహం ఈ దిగువ పొందుపరుస్తున్నాను

ఒక రోజు జయరామన్ అనే తొమ్మిదేళ్ల కుర్రవాడు బడిలో కొత్తగా చేరుతాడు. చేరింది ఒకటో తరగతి. అతన్ని ఏడిపించడానికి తగినంత అవకాశం దొరుకుతుంది ఇతర విద్యార్థులకు అందుకు తోడు అతని తండ్రి సుబ్బయ్యనాయుడు తాగుబోతుకావడంవల్ల కుర్రవాడికి 'సారాయి సుబ్బయ్య కొడుకు' అనే పట్టం అనాయాసంగా వచ్చింది. సహవిద్యార్థులు అతన్ని బాగా ఏడిపిస్తారు. బడిలో చేరిన ఆ తొలిరోజే అతనికి దుర్భర మనిపించింది. అణుచుకున్నా, దుఃఖం అణుచుకోలేకపోయాడు అంతే. ఇంటికి పారిపోయాడు. బడి అంటే భయం వేసింది. ఆ మధ్యాహ్నమే బడికి ఎగనామం పెట్టాడు బడికి రమ్మని ఉపాధ్యాయుడు ఒక కుర్రవాణ్ణి జయరామన్ యింటికి పంపించాడు. తల్లి కూడా వెళ్ళమంది. అయినా సరే, జయరామన్ బడికి పోనంటే పోనన్నాడు.

సుబ్బయ్యనాయుడు ధనిక కుటుంబంలో పుట్టినా, దుష్ట సహవాసాల వల్ల, చిన్నప్పుడే చెడిపోయాడు తాగుడు అలవాటువల్ల సిగ్గుమాలిన పనులు చేసేవాడు. చివరికి అప్పులు కూడా అతని మెడకు చుట్టుకున్నాయి. తాగివచ్చి, భార్యనూ కొడుకునీ చావ చితక బాదేవాడు.

జయరామన్ బడికి వెళ్ళిన సంగతీ, అక్కడ తనను అందరూ పరిహసించిన సంగతీ నాయుడు తెలుసుకున్నాడు. ఇంటికి వచ్చి రావడంతోనే కొడుకుని ఒక తన్ను తన్నాడు అడ్డం వచ్చిన భార్యను చెంపదెబ్బ కొట్టాడు. అయినా అతని కోపం చల్లారలేదు. పక్కనే వున్న రోకలి తీసుకున్నాడు. మళ్ళీ కోపం కొద్దీ కుర్రవాణ్ణి కొట్టాడు. అతను కింద పడిపోయాడు. ఇంతటితో చుట్టుప్రక్కల వున్న అమ్మలక్కలు నలుగురూ అక్కడికి చేరారు. బలంకొద్దీ అతను రోకలిని భార్యవైపు విసిరివేశాడు. అది గోడకు తగలడంవల్ల, ఆమె బతికిపోయింది. ఏదో వాగుతూ అతను బయటికి వెళ్ళిపోయాడు. కథ యిలా అంతమవుతుంది.

"త్రాష్టుడు! ఇలా కొట్టవచ్చా ?" అన్నారు వచ్చిన అమ్మలక్కలు.

దిక్కుమాలిన యీ కల్లుదుకాణాలు ఎందుకుపెట్టారో" అంది ఒకామె

ఒక్క క్షణంలో కుర్రవాని కాళ్లూ చేతులు చల్లబడిపోయాయి. "అయ్యో! ఎంత పని జరిగింది." అంటూ తల్లి కెవ్వుమని కేక పెట్టింది. ఈ దుఃఖపు గూటి నుంచి విముక్తి చెంది ప్రేమే మూర్తీభవించిన ఆ తల్లి ఒడిలోకి వెళ్ళిపోయాడు జయరామన్, ఇంక వాడికి బడులతో ఏముంది అవసరం ?

మాతృప్రేమకు నోచుకోక, సవతితల్లి పెట్టే హింసలకు గురి అయిన వెంకటరామయన్ అనే బ్రాహ్మణ బాలుడు క్రైస్తవ మతంలో చేరి రాయప్ప అయిన వృత్తాంతం రాయప్పన్ అనే కథలోని ప్రధాన విషయం. కథాంతంలో రచయిత అన్నమాట లివి :

"కన్నతల్లి ప్రేమ ఒక్కటే సహజమైన ప్రేమ ఇతర ప్రేమలకు అదే ఆదర్శమవుతుంది.... పెరిగే పిల్లవాడికి నెయ్యి కావాలి పిల్లవాని పెరిగే మనస్సుకి ప్రేమే నెయ్యి. అది కనక లభించకపోతే మనస్సు ఎండిపోతుంది."

నిజమైన ప్రేమ శారీరకలోపాన్ని లక్ష్యపెట్టదనే అంశాన్ని రాజాజీ గూనిసుందరి కథలో వ్యక్తం చేశారు. శారీరకమైన రూపారూపాలు వివాహమయ్యేంతవరకే ననీ, వివాహానంతరం స్త్రీ పురుషుల మనస్సులు ఏకమైనప్పుడు ముఖమూ శరీరమూ మరుగున పడిపోతాయనీ ఆయన పేర్కొన్న విషయం గమనించదగింది. ఈ కథలో మదరాసు వీరేశలింగం హాస్టలు విద్యార్థినులు కీలకమైన పాత్ర వహిస్తారు. మదరాసులో వీరేశలింగం పంతులుగారి పేరున విద్యార్థినుల వసతి గృహం లేకపోయినా, స్త్రీ జాతికి మహోపకారం చేసిన పంతులుగారి పేరున విద్యార్థినుల వసతి గృహాన్ని వ్యవహరించడంలో రాజాజీ ప్రదర్శించిన ఔచిత్యం నిరుపమానం వీరేశలింగం పట్ల ఆయనకు ఆదరభావం ఉన్నదనడానికి ఇది ఒక నిదర్శనం

ముకుందన్ ఒక చిత్రమైన కథ, మొదట్లో ఇది 'ముకుందన్ మాలవాడైన కథ' అని ప్రచురించబడింది.

ముకుందన్ బ్రాహ్మణ కుటుంబంలో పుట్టి పెరిగినవాడు, చిన్నతనంలో అతన్ని కోతుల బెడదనుంచి యిద్దరు హరిజన బాలురు[1] కాపాడతారు. అందుకు వాళ్లకి కృతజ్ఞత చెప్పడానికి మారుగా ముకుందన్ తల్లి వాళ్లను కొట్టింది, యింట్లోకి వచ్చినందుకు.

పెద్దవాడయ్యాక ముకుందన్ డాక్టరవుతాడు. ఒకరోజు అతని వద్దకు గాయాలతో బాధపడుతున్న ఒక యువతిని తీసుకువస్తారు. ఆమెకు చికిత్స చేస్తాడు. ఆమెను చూడగానే చచ్చిపోయిన తన తల్లి పునర్జన్మ యెత్తినట్లు

1. రాజాజీ హరిజన శబ్దం వాడలేదు, మాల అని అర్థమిచ్చే పరైయన్ శబ్దమును ఉపయోగించారు.

భావిస్తాడు డాక్టర్ ముకుందన్. ఆ యువతి తనను చిన్ననాడు కాపాడిన ఆ హరిజనుల్లో ఒకడైన మారి భార్య, ముకుందన్ మారితో ఇలా అంటాడు. "ఇలా నీచమైన జీవితం సాగించేలా మిమ్మల్ని యితరులు అణచి వుంచడం మహా పాపం, అందుకే నే నీ నోము పడుతున్నాను" చివరికి మారీ, అతని తల్లీ భార్యా ముకుందన్ యింట్లో నివసిస్తారు. ఆనాటి నుంచీ ముకుందన్ ఊరి వారి దృష్టిలో మాలవాడై పోయాడు. అయితే అతని మనస్సుకి శాంతి లభించింది.

తన హరిజన స్నేహితుడికి కూడా తన కిచ్చినట్లుగా బొబ్బట్లు మొదలైనవి యిమ్మనీ, అతన్ని యింట్లోకి రప్పించమనీ తల్లిని వేధించుకుతిన్న ఒక బ్రాహ్మణ బాలుడి ఔదార్యాన్ని ఆధారం చేసుకుని రాజాజీ 'ఇటియా కు ళంద్రై' అనే కథ వ్రాశారు.

సాంఘికంగా హరిజనులు పడుతున్న యిబ్బందుల్ని పరోక్షంగా చిత్రించే మంచి కథ 'జగదీశశాస్త్రిగారి కల'.

వంట బ్రాహ్మణుడుగా రంగూను వెళ్ళిన జగదీశశాస్త్రి కాలక్రమాన ధనికుడయ్యాడు. తన యాభై రెండో యేట స్వగ్రామం చూడాలనే అభిలాష ఆయనకు కలిగింది. అవివాహితుడైన ఆయన ఒక కుర్రవాణ్ణి దత్తు తీసుకుని ప్రశాంతంగా కాలక్షేపం చెయ్యాలనుకున్నాడు. కాని తీరా స్వగ్రామం చేరుకున్న తర్వాత, కథ కొత్త మలుపు తిరిగింది. నాగేశ్వర అయ్యర్ అనే ఆయన కుమార్తెను పెళ్ళి చేసుకుని జగదీశ్వర శాస్త్రి మళ్ళీ రంగూను వెళ్ళిపోయాడు,

శాస్త్రికి ఒక కుమారుడు కలిగాడు. పేరు రామచంద్రన్. కాని ఒక రోజు ఆయన భార్య నగానట్రుతో లేచిపోయింది

భార్య లేచిపోయిన దుఃఖాన్ని ఎలాగో మరిచిపోయి కొడుకు చదువు విషయంలో శాస్త్రి తగు శ్రద్ధ వహించాడు. అతను బాగా చదువుకున్నాడు. బి.యే. అయ్యాడు. మళ్ళీ శాస్త్రి స్వదేశం తిరిగివచ్చాడు,

రామచంద్రన్‌ని అల్లుడుగా చేసుకోవాలని సీతారామయ్యర్ అనే ప్రసిద్ధ మదరాసు న్యాయవాది అనుకున్నాడు. అంతే కాదు, తన సొంత ఖర్చు మీద అతన్ని సీమకు పంపించి, ఐ.సి.యస్.గా చెయ్యాలనీ అనుకొన్నాడు కొడుకు

సీమకు వెళ్ళిన తర్వాత, శాస్త్రి రంగూను వెళ్లాడు. కాని మనశ్శాంతి ఆయనకి కరువయింది. అందువల్ల అనారోగ్యం ఆవహించింది. డాక్టరు సలహా మీద స్వదేశానికి ప్రయాణ మయ్యాడు ఆఖరుసారిగా. తలవని తలంపుగా ఓడలో శాస్త్రికి లేచిపోయిన తన భార్య కనిపించింది. మదరాసు చేరుకున్న తర్వాత, ఆయన ఆమె యింటికి వెళ్ళాడు ఆమె చెప్పిన విషయాలు విన్న పిమ్మట ఆయనకు జీవితమంటేనే విరక్తి కలిగింది

శాస్త్రి మామగారు నాగేశ్వరయ్యరు నిజానికి బ్రాహ్మణుడు కాదు, ఇదీ మరికొన్ని విషయాలు కనుక బయటికి పొక్కితే తన కుమారుడికి సంఘంలో నిలవ నీడ ఉండదనే భయం కలిగింది శాస్త్రిగారికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలని ఆయన కాశికి బయలుదేరాడు, రైల్లో రాత్రి పూట కల వచ్చింది తన కుమారుణ్ణి అందరూ చాలా నీచంగా చూడసాగారు. చివరికి రైల్వే పోర్టరుగా నైనా అతను ఉద్యోగం చెయ్యలేక పోయాడు. దానికి్కూడా అతని సంకరజాతి అడ్డు నిలిచింది. ఆశ్చర్యం; అతని మీద శాస్త్రికి గల ప్రేమ అగ్గలమయింది,

కాని చివరికి జరిగిందేమిటంటే : ఐ.సి యస్ పరీక్షలో కృతార్థుడై రామచంద్రన్ సీమ నుంచి వచ్చాడు కర్నూలులో అసిస్టెంటు కలెక్టరుగా నియమితు డయ్యాడు జగదీశశాస్త్రిగారు కాశిలో సన్న్యాసం తీసుకున్నారని కొందరూ, అక్కడే గంగాస్నానం చేస్తూ మరణించారని కొందరూ అనుకున్నారు, ఏమయితేనేం ఆయన యింటికి తిరిగి రాలేదు. ఆయన భార్య చెప్పిన విషయాలూ బయటికి పొక్కలేదు. సీతారామయ్యర్ అమ్మాయితో జె.ఆర్, చంద్రకి వైభవోపేతంగా వివాహం జరిగింది.

[శాస్త్రిగారి భార్య చెప్పిన విషయాలు ఏమిటంటే : నాగేశ్వరయ్యర్ నిజానికి బ్రాహ్మణుడు కాదు; మంగలి, అతని అసలు పేరు పరియారి నాగన్. కలకత్తాలో సెలూన్ పెట్టుకుని కాలక్షేపం చేసేవాడు. దిక్కులేని ఒక వితంతువుని పెళ్ళి చేసుకున్నాడు. మోసగాడు, ఏదో ఒక నేరం చేసిన కారణాన లాహోరు జైలులో 7 సంవత్సరాల శిక్ష అనుభవిస్తున్నాడు.]

ఎన్నికలలో డబ్బు వహిస్తున్న పాత్ర మొదలైన విషయాలను రాజాజీ 'ఒక ఎలక్షన్ కథ' ద్వారా వ్యక్తం చేశారు.

సప్లైయర్ సీరంగన్ (శ్రీరంగన్) హరిజనుడు. ఆ ఊళ్లో నివసించే తెల్ల వారికి కావలసిన సామాన్లు తెచ్చియిస్తూ అందువల్ల వచ్చే నాలుగు డబ్బులతో గౌరవంగా హాయిగా అతను కాలక్షేపం చేసేవాడు అతనంటే అందరికీ ఆదరమూ అభిమానమూను. అలా ఉండగా, ఆ ఊరి పురపాలక సంఘంలో ఒక హరిజన సభ్యుణ్ణి నియమించవలసి వచ్చింది. అందుకు సీరంగన్‌ని ఎన్ను కున్నారు. ఆ నాటినుంచీ సాఫీగా సాగే అతని జీవితం గతుకులబాట మీద పయనించసాగింది. చేస్తున్న పనిలో అతనికి శ్రద్ధ లోపించింది, అందువల్ల ఆదాయం తగ్గింది, అప్పులు ఎక్కువయ్యాయి. సంఘంలో అతనికి గల గౌరవమూ క్రమక్రమంగా తగ్గసాగింది.

ఉన్నట్టుండి పురపాలక సంఘాధ్యక్షుడు కాలధర్మం చెందాడు. కొత్త అధ్యక్షుణ్ణి ఎన్నుకోవలసి వచ్చింది. ఓట్ల వేట మొదలయింది ఒక సెట్టిగారూ ఒక ముదలియారుగారూ అధ్యక్షపదవికి పోటీ చేశారు. సెట్టిగారు ధనాశ చూపి సభ్యుల్ని తనవైపు తిప్పుకోవాలనుకున్నాడు. ధనాశ చూపడానికి మొదలియారు మొదట్లో సమ్మతించలేదు. కాని మిత్రుల ప్రోద్బలంవల్ల, అందుకు తల ఒగ్గక తప్పలేదు. చివరికి, సీరంగన్ ఓటు ఎవరికో నిశ్చయంగా తేలని పరిస్థితి యేర్ప డింది. అతని కోసం గాలించారు ముదలియార్ మనుషులు. అతన్ని సెట్టిగారి యింట్లో గుర్రపుశాలలో వుంచి తాళం వేశారు. చివరికి అతని జాడ తెలుసుకుని, అతన్ని సెట్టిగారి యింట్లోంచి బయటికి రప్పించి ముదలియార్ యింటికి తీసుకు వెళ్ళారు. అతనికి బాగా ధనాశ చూపారు. ఆ డబ్బు మూటను మౌనంగా చూస్తూ చూస్తూ సీరంగన్ అక్కడినుంచి కాళ్లకు బుద్ధి చెప్పాడు. అతన్ని పట్టుకోవాలని ప్రయత్నం చేశారు. లాభం లేకపోయింది. ఆ తర్వాత ఓటింగు జరిగింది. సెట్టి గారికే విజయం లభించింది. కథ యిలా ముగిసింది.

"లంచం! లంచం" అని ప్రత్యర్థులు కేకలు వేశారు. "సీరంగన్ ఒక్కడే నిజాయితీపరుడు" అన్నాడు ముదలియారు.

న్యాయమూర్తి జయరామయ్యర్ కథలో మనస్తత్వ చిత్రణకు ప్రాధాన్య మివ్వబడింది. ఒక చిన్న దొంగతనం నేరానికి జయరామయ్యర్ ఒకతనికి పెద్ద శిక్ష వేస్తాడు. అది పొరపాటనిపించి ఆ తర్వాత ఆయన మానసికంగా బాధ పడతాడు. తానూ చిన్నతనంలో ఒక చిన్న దొంగతనం చేశాడు. కాని అందుకు

తాను శిక్ష అనుభవించలేదు. అదీ ఆయన బాధ. అందుకు ప్రాయశ్చిత్తంగా తాను ఏ ఊరికి బదిలీ అయి వెళ్ళినా, దొంగతనాలు చేసి శిక్ష లనుభవించే వారి కోసం ప్రతినెలా యాభై రూపాయలు ఖర్చు చేసేవాడు న్యాయమూర్తి జయరామయ్యర్.

రాజాజీ కొన్ని పౌరాణిక గాథల్ని కొత్త దృక్పథంతో చక్కని కథలుగా సంతరించారు. ఇందుకు పశ్చాత్తాపం (పశ్చాత్తాపం) ఒక ఉదాహరణ. ఈ కథ అశోకవనంలో జరిగినట్లు చెప్పబడింది. ఆ రోజుల్లో సీతకు లక్ష్మణుని జ్ఞాపకం మాటి మాటికి వచ్చేదట. అనరాని మాటలు అని అతని మనస్సుకి బాధ కలిగించాను గదా అని ఆమె పరితపించేది. అయితే ఆమె పడ్డ బాధ ఎవరికీ తెలియదు, ఎవరితోనూ చెప్పుకోడానికి వీలులేని దుఃఖమని రాజాజీ కథాంతంలో పేర్కొన్నారు,

ఉదంకుడి కథను రాజాజీ 'పులైయన్ తణ్ణీర్' (మాలవాడి మంచి నీళ్ళు) అనే పేరుతో మనోజ్ఞంగా వ్రాశారు.[1] కథాంతంలో ఆయన అన్న మాట లివి.

"బీదవారిని నిందించడం తగదని ఈ భారత కథలోని ఉపదేశం. ఈ ఉపదేశాన్ని మనం ఎప్పుడూ మనస్సులో ఉంచుకుందాము."

సంవాదరూపంలో రాజాజీ కొన్ని కథలు సంతరించారు. నవీన ఉత్తర కాండం, వాలివధం, పార్కడల్ (పాలకడలి) మొదలైనవి యీ కోవకు చెందినవి.

నవీన ఉత్తర కాండంలో సీత పట్ల రాజాజీ ప్రదర్శించిన సహానుభూతి ప్రశంసార్హం. అగ్ని ప్రవేశానికి తర్వాత రాముడితో కలిసి జీవించడానికి సీత అంగీకరించదు. ఆమె యిలా అంటుంది: 'మీతో కలిసి జీవించే రోజులు పొయ్యాయి. యుద్ధం ముగిసిన తర్వాత మీ వద్దకు నన్ను రప్పించుకుని, ఒక పామరుడు మాట్లాడినట్లుగా మీరు మాట్లాడారు. ఆ తర్వాత మీతో కలిసి నేను జీవించడ మన్నది జరగని కార్యం." ఈ మాటలలో బహిర్గతమయ్యే సీత మనో వేదన మాటల కందనిది.

---

1. ఈ కథ రాజాజీ కట్టురైగళ్ (వ్యాసావళి) సంపుటిలో చేర్చబడింది.

రాముడు కావించిన వాలివధను రాజాజీ సమర్థించలేదని యింతకు ముందే మనవి చేశాను

ఇలా రాజాజీ కథలలో మనకు రకరకాల వ్యక్తులు కనిపిస్తారు కథలు చదువుతున్నంతసేపు వాళ్ళు మన కళ్ల యెదుట మసులుతూనే వుంటారు. అంత సహజంగా రాజాజీ పాత్ర సృష్టి చేశారు. ఆయా పాత్రల స్వభావంలో, మాటల తీరులో అసహజత కనిపించదు. ఈ సహజత్వంవల్లనే ఆయన కథలకు ఎక్కడ లేని సౌందర్యం కలిగింది. పైగా చాలా కథలు సామాజిక దృక్పథంతో వ్రాయ బడినవి. ప్రణయగాథలూ చారిత్రక గాథలూ ఎక్కువగా వెలువడుతున్న ఆ రోజులలో—అనగా సుమారు నలభై యాభై యేళ్ల క్రితం - సాంఘిక ప్రయోజ నాన్ని ఉద్దేశించి రాజాజీ కథలు వ్రాయడం గమనించదగిన అంశం. వివిధ కులాలకు చెందిన వ్యక్తుల్ని పాత్రలుగా చేసి ఆయన రచన సాగించడం కూడా గమనించదగిన విషయమే.

ఇక రాజాజీ చెప్పిన నీతికథలు అమృతతుల్యము లన్నా అతిశయోక్తి కాదు. ఇందుకు ఆయన కల్పనైక్కాడు (కల్పనాటవి) మంచి ఉదాహరణ ఆయా కథ లలో చోటు చేసుకున్న నీతులే కాక ఆ కథలు చెప్పిన తీరూ ఆ శైలీ మనోహ రంగా ఉంటాయి నదియిన్‌మోహం (నదీమోహం) అనే ఒక్క కథను మాత్రం ఇక్కడ ఉదాహరిస్తాను.

"అయ్యో! నాకు మరణం సమీపించింది" అని అవ్వలా అనుకుని ఒక నది కంట తడిపెట్టింది. అది పెద్ద నది.

ఎంత సంతోషంగా పెరిగాను. కొండమీదినుంచి దిగి, పరుగెత్తీ, గంతులు వేసీ నూర్లకొద్ది మైళ్ళుగా పెరిగి పెద్ద నయ్యాను ఇప్పుడు చావు దగ్గర పడిందే - అని విలపించింది. నదికి కన్నీళ్ళు కొరత లేదుగదా! సముద్ర తీరాన ఇలా విలపించింది. సముద్రంలో కలిస్తే తన జీవితం ముగిసిపోతుందని బాధపడింది.

ఈ నిమిషం ఉన్న నది మరునిమిషం లేదు. మనం నదిలో మునిగి స్నానం చేస్తున్నాము. నదిలో దిగినప్పుడు వున్న నీళ్ళు మరునిమిషం వుండవు. కొత్తనీరు వస్తుంది. మళ్ళీ కొత్తనీరు. ఇలాగే ఈ క్షణం కనిపించిన నీళ్ళు తరువాతి

క్షణంలో ఉండవు అయినప్పటికి స్థావర మనుకుని దానికి ఒక పేరు పెడుతున్నాము, పైన ఆకాశంనుంచి కిందికి జారే వానచినుకుల వంటిదే నదీను. వానకు మనం పేరు పెట్టడం లేదు అది కిందపడి కనుమరుగు కావడం మనకు స్పష్టంగా తెలుస్తోంది. నది కూడా అలాంటిదే ఈ క్షణం ఇక్కడున్న నీటి చుక్కలు మరుక్షణం అక్కడ ఉండవు. కాని నదీతీరం, ఇసుక, చెట్లు – మొదలైన వాటిని చూసి నది కూడా ఒక స్థావర మనుకుంటున్నాము: సముద్రతీరం చేరుకున్న నది కూడా అలాగే అనుకుంది. "అయ్యో! ఇక నా జీవితం ముగిసింది" అనుకొని విలపించింది.

మన జీవితమూ శరీరమూ నదుల వంటివి. నిన్న ఉన్నది నేడు లేదు. నేడున్నది రేపు లేదు. అయినా మన శరీరం నిత్యమనే నమ్ముతున్నాం ఇది పెద్ద విషయం. ఇక విలపిస్తున్న నదిని చూద్దాము.

నది సముద్రం చేరుకుంది. దాని వ్యక్తిత్వం ముగిసిపోయింది సముద్రాన్ని చేరుకుని, నీళ్ళల్లో నీళ్ళలా కలిసిపోయింది; చావలేదు, నది రూపం మాత్రమే మారిపోయింది. నీళ్ళు నీళ్ళలో కలిశాయి తాను మొదట ఎక్కడి నుంచి వచ్చిందో, అక్కడికి వెళ్ళి అందులో కలిసిపోయింది. మళ్ళీ సూర్యభగవానుడు తన ప్రేమ హస్తాలతో – వేలాది హస్తాలతో – ఆ నీటిని పైకి తీసుకువెళ్ళి, అక్కడినుంచి, కడుపు నిండగానే, ఫో అని మళ్ళీ కిందికి పంపిస్తాడు.

"నదీ, ఏడవకు" అని ధైర్యం చెప్పి మనమూ జ్ఞానవంతుల మవుదాము యముణ్ణిచూసి భయపడనవసరం లేదు. దుఃఖించనూ అవసరం లేదు. ప్రపంచ మంతటా వ్యాపించిన మహాసముద్రం వంటి వాడు భగవంతుడు. ఆ భగవంతుడిలో కలిసేందుకు మన మెందుకు భయపడాలి? ఎందుకు విలపించాలి?"

రాజాజీ వెలయించిన ఉపనిషద ప్పలకణి, భజగోవిందం, తిరుమూలర్ తవ మొళి, సోక్రతర్ (సోక్రటీసు), ఆత్మచింతనె మొదలైనవి ఆయన తాత్త్విక చింతనను వ్యక్తపరిచే రచనలు. వీటిలో కొన్ని వ్యాఖ్యానాలు; మరికొన్ని అనువాదాలు.

తమిళ సాహిత్యంలో తనకు నచ్చిన కొన్ని రచనలను రాజాజీ ఆంగ్లంలోకి అనువదించి తద్వారా వాటికి బహుళ ప్రచారం కల్పించారు. ఉదాహరణానికి ప్రసిద్ధ ప్రాచీన తమిళ కవయిత్రి అవ్వైయార్ వెలయించిన మవ్వపు సూక్తులను మూడు వ్యాసాలలో ఆయన ఆంగ్ల పాఠకులకు పరిచయం చేశారు. ఈ మూడు వ్యాసాలూ గాంధీజీ సంపాదకులుగా ఉండిన 'యంగ్ ఇండియా' పత్రికలో 1928 జూన్ 21, 28, జూలై 5 సంచికలలో అచ్చు పడి, తర్వాత 1968 లో పుస్తక రూపం దాల్చాయి. అలాగే, కంబరామాయణంలోని అయోధ్యాకాండను కూడా అనువదించారు.

రచయితగా పేరు పెంపులు గడించాలనే అభిలాషతో రచనా వ్యాసంగం చెయ్యని రాజాజీ చివరికి తమిళ సాహిత్య క్షేత్రంలో బంగారు పంటలు పండించారు నిర్దిష్ట ప్రయోజనం లేని రచన ఆయన చెయ్యలేదు. ప్రయోజన మున్న రచనే సాహిత్య మవుతుందని ఆయన విశ్వసించినట్లు పేర్కొనవచ్చు. ప్రయోజన రహితమైన రచన నిర్గంధ కుసుమం. ఉత్తమ కథా రచయితగా, ప్రశస్త వ్యాఖ్యాతగా, విశిష్ట అనువాదకుడుగా ఆయన సాహిత్య లోకంలో చిరంజీవి. పిన్నలకూ పెద్దలకూ ఉపకరించే రచనలు చేసిన రాజాజీ ఆధునిక తమిళ సాహిత్యమును సుసంపన్నం చేసిన మహనీయులలో ప్రముఖులు !

# విప్లవ కవి భారతి దాసన్

ఆధునిక తమిళ కవిత్వం అనగానే రెండు పేర్లు ప్రముఖంగా స్ఫురిస్తాయి. ఒకటి భారతి రెండవది భారతి దాసన్. సంప్రదాయబద్ధమైన తమిళ కవితకు వీరిద్దరూ నవ్యదృష్టి ప్రసాదించారు. భారతి తమిళ నవయుగ ప్రవక్తగా ప్రథితయశస్కుడు కాగా, భారతి దాసన్ విప్లవ కవిగా చిరకీర్తి సముపార్జించాడు.

ఈ కవు లిద్దరికీ తమిళ భాషా సాహిత్యములంటేనూ, తమిళదేశ మంటేనూ అపారమైన గౌరవం.

'కవితకు వార్త కెక్కిన తమిళనాడు' అనీ
'సెందమిళునాడని విననంతనే
తేనెలు స్రవించును శ్రవోయుగళిలో' అనీ

భారతి తమిళనాడని ప్రస్తుతించాడు. తమిళ భాషా మాధుర్యమున భారతిదాసన్ కొనియాడిన తీరుని పరికించండి.

'తమిళమునకు పేరు అమృతం-ఆ
తమిళం మాకు ప్రాణ సమానం.
తమిళమునకు పేరు వెన్నెల-ఆ
తమిళం మా కిచ్చును జీవం,
తమిళమునకు పేరు సౌరభం-ఆ
తమిళం మాకై వెలిసిన ఊరు.
తమిళమునకు పేరు మధువు-ఆ
తమిళం మా హక్కుల పైరుకి వేరు.

భారతి అనుయాయుడే అయినా, భారతిదాసన్ కవితలో విప్లవాత్మకధోరణి కొట్టవచ్చినట్టు కానవస్తుంది. బూజు పట్టిన ఆచార వ్యవహారాలు, గుడ్డి నమ్మకాలు మొదలైనవి తొలగిపోయి, నవసమాజం వెలుగు చూడాలని ఆయన ఆశించాడు.

మనస్సులో మెదిలిన భావాలను మొగమోటమిలేకుండా స్పష్టం చేశాడు. ఈ కవిత అందుకు ప్రబల సాక్ష్యం.

'జాతి మత భేదాలు
మూఢాచారాలు నిండిన
ఈ కయ్యాల జగతిని
గాలిలో ధూళిగాచేసి
అవల నిర్మూలింతము
నవ జగతిని నిర్మింతము.'

జాతి మత భేదాలతో మానవులు ప్రమగ్గకం మంచిదా లేక ఒకే జాతిగా మనుగడ సాగించుట మంచిదా అని సూటిగా ప్రశ్నించాడు, ఈ క్రింది కవితలో.

'శాంతితో లోకం వర్ధిల్లుట మంచిదా?
భేదాలతో సతమత మగుట మంచిదా?
మానవుల్ని జాతులుగా విభజించుట సరియా?
మానవు లందరు ఒకే జాతిగా మనుట సరియా?

పురట్చి క్కవిజ్ఞర్ (విప్లవ కవి)గా ప్రసిద్ధికెక్కిన భారతిదాసన్ మొదటి నుంచీ అభ్యుదయ భావాలు గల కవి. మత భేదాలు, కుల భేదాలు, మొదలైన వాటిని ఆయన నిరసించాడు. చదువు సంధ్యలు అందరికీ లభ్యం కావాలన్నాడు. సమత నెలకొనాలని పేర్కొన్నాడు. లక్ష్య సాధనకోసం కవిత చెప్పే స్వభావం ఆయనది పంజరంలో బంధించబడిన చిలుకను ఆధారం చేసుకుని, స్వాతంత్ర్యేచ్ఛను ఇలా ప్రకటించాడు.

'తినుటకు పెట్టెదరు తీయని పళ్ళు
ఇచ్చెదరు పప్పులు ఎన్నెన్నో నీకు.
అందాల కొలికి! అని నిన్ను పొగడేరు
చక్కని చిలుకా! ఒక్కసారి పరికించు
నీ తోబుట్టువుని నీ చిన్నక్కను.

ఆకాశవీధిలో అటూ ఇటూ తిరిగి
కొబ్బరి తోపుల్లో ఉయ్యాల లూగి
తోటల మేయుచు పేటల తిరుగుచు
మిన్నూ మన్నూ చేసుకుంది తన సొంతం.
వడ్రంగి చేసిన పంజరమే నీకు స్వర్గమా ?
అక్కయ్యా అక్కయ్యా అని అరిచావు
అక్కయ్య వచ్చి యిచ్చుటకు, చిలుకా!
స్వాతంత్ర్య మేమైన చారపప్పులా?

సొతంత్ర్యేచ్ఛ మిక్కుటంగా కలిసిన భారతిదాసన్ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనడంలో ఆశ్చర్యం లేదు. పత్రికలు నిర్వహించి, తన అభిప్రాయాలు పది మందికి తేటతెల్లం చేశాడు. ఆ రోజుల్లో ఆయన ఖద్దరు గురించి పాటలు వ్రాశాడు. అది రసవత్తరము లైనవని విజ్ఞులు చెపుతారు. తరువాతికాలంలో ఆయన భావాలలో స్పష్టమైన మార్పు వచ్చింది. తత్ఫలితంగా ద్రావిడకళగాన్ని అభిమానించాడు, ఆ పార్టీ ఆశయాలు వ్యక్తీకరిస్తూ ఆయన కవితలు వెల యించాడు.

ప్రకృతి సంపద, ప్రేమ, తమిళుడు, బిల్హణకవి మొదలైన పెక్కు విషయాలను గురించి భారతిదాసన్ కవితలు సంతరించాడు. కుటుంబ విళక్కు (కుటుంబ దీపం) అనే కవితా సంపుటి ఆయన రచనలలో బహు ప్రసిద్ధమైంది. ఆదర్శ గృహిణిని మనోజ్ఞంగా ఇందులో చిత్రించాడు ఆయన దృష్టిలో మంచి కుటుంబం విశ్వవిద్యాలయ తుల్యం. ఆయన కవిత ఉదాత్తభావ సమన్వితమే అయినా, నడుమ నడుమ హాస్యం తొంగి చూస్తూ వుండడం ఆయన కవితా విశే షాలలో ఒకటి. భాషమీద ఆయనకు గల అధికారం ఆశ్చర్యావహం, అందువల్ల ఆయన రచనలో భావగాంభీర్యంతోపాటు భాషా గాంభీర్యమూ చోటు చేసుకుంది.

లోకం నీది అనే కవిత ఆయన భావాలకు దర్పణం వంటిది.

'ఆకసమంటే కొండమీదికి ఎక్కి
అవలోకించు నలువైపులా-
చూడు ఈ లోకపు మనుషుల్ని
చూడు నీ సాటి మానవసంఘాన్ని

నా జాతి అనే భావనతో
మానవ సముద్రం చూసి సంతోషించు
జ్ఞానాన్ని విస్తృతం చెయ్యి. అఖండం చెయ్యి
విశాల దృష్టితో ఆకట్టుకో ప్రజను
మానవ సముద్రం నేనని చెప్పు.
చీలికలు లేవు భేదాలు లేవు.
లోకం తినగా తిను
ధరించగా ధరించు
సంపద సర్వజనుల దంటూ
సమష్టి భావనతో వ్యవహరించు.
ఆకాశంలా ప్రజను ఆదరించి
అమలమైన ఆదరభావంతో
అల్పబుద్ధులకు సైతం దీన్ని వివరించు.'

భారతి దాసన్ భావాలకు అద్దం పడుతున్న మరో కవిత కొట్టుమురసే. కొట్టుభేరీ.

'ఆనందం, అష్టైశ్వర్యాలు
అందరికి లభ్యమైనప్పుడు
కొట్టు భేరీ-జీవితంలో
పారతంత్ర్య తొలగిందని
కొట్టు భేరీ!
లేమి అనే వ్యాధి లేదనీ
అందరికి చదువు సంధ్యలు కావలెననీ
కొట్టు భేరీ-జీవితంలో
సెబ్బర తీరిపోయిందనీ
కొట్టు భేరీ!

కని, పెంచుట మాతృధర్మమనీ
కృషి చేయుట అందరి ధర్మమనీ
కొట్టు భేరీ-జీవితంలో
తేనె వాన కురిసెననీ
కొట్టు భేరీ!

ప్రకృతి సౌందర్యాన్ని భారతిదాసన్ ఇలా అభివర్ణించాడు, ఒక కవితలో.

'బాలభానుని లేత కిరణాలలో ఆమెను చూచితి
విశాల జలధిలో, వెలుగులో దర్శించితి
ఉద్యానవనము పూలలో పల్లవాలలో
తాకిన ప్రతిచోటా ఆమె కనిపించెను.
సాయం సమయాన పశ్చిమాద్రిని
అరుణకాంతులలో గోచరించెను
మర్రిచెట్టు కొమ్మ కొమ్మను నివసించే
చిలుకలకు ఆ సుందరి ప్రసాదించెను కవిత.'

తమిళనాడులో ఆయన్ని సన్మానించని సాహిత్య సాంస్కృతిక సంస్థ లేదనవచ్చు. నాలుగు దశాబ్దులపాటు తమిళ పండితుడుగా పనిచేసి, 1946 లో ఉద్యోగ విరమణ చేశాడు. 1955 లో పుదుచ్చేరి (పాండిచ్చేరి) శాసన సభా సభ్యుడయ్యాడు. ద్వితీయ ప్రపంచ తమిళ మహాసభలను పురస్కరించుకొని మదరాసులో (1968 లో) ఆయన శిలావిగ్రహం ఆవిష్కరించబడింది. ఆయన వ్రాసిన పిసిరాంద్రైయార్ అనే రచనకు 1969 లో కేంద్ర సాహిత్య అకాడెమీ వారి బహుమతి (మరణానంతరం) లభించింది. 1982 లో తిరుచిరాపల్లిలో నెలకొల్పబడిన విశ్వవిద్యాలయానికి భారతిదాసన్ పేరు పెట్టబడింది. ఆ విప్లవ కవిని తమిళ సంస్థలూ తమిళులూ ఆదరపూర్వకంగా సంస్మరిస్తున్నారనడానికి ఈ నిదర్శనాలు చాలు.

కుహనా సంప్రదాయాలకు వ్యతిరేకంగా నిలిచిన భారతిదాసన్ 1891 లో పుదుచ్చేరిలో జన్మించాడు. 1964 లో కాలధర్మం చెందాడు. తమిళ సాహిత్య చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయిన ఆయన అసలు పేరు భారతిదాసన్ కాదు. సుబ్బురత్నం! తొలినాళ్లలో ఆయన చెప్పిన కవితలలో భారతి ప్రభావం ప్రస్ఫుటంగా ఉండడంవల్లనూ, భారతి అనుయాయికావడం వల్లనూ ఆయన్ని భారతి దాసన్ (భారతి శిష్యుడు) అని వ్యవహరించసాగారు. భారతి అంటే ఆయనకు ఎనలేని గౌరవం. భారతి ప్రపంచ కవి అని ఆయన అభిప్రాయం!

# తమిళ మినీ కవితలు

ఒకనాడు మహా కావ్యాలు, ఆ తర్వాత ఖండకావ్యాలు సాహిత్య ప్రపంచంలో వెలుగులోకి వచ్చి ప్రచుర ప్రచారం గడించినట్టుగా, ఈనాడు మినీ కవితలు పత్రికా ముఖంగా నైతేనేమి పుస్తక రూపంగా నైతేనేమి పరశ్శతంగా వెలువడుతున్నాయి; పాఠకుల్ని అలరిస్తున్నాయి. ఒక సాహిత్య ప్రక్రియగా మినీ కవిత స్థిరపడింది.

తెలుగులోవలె, తమిళంలోనూ మినీ కవిత బాగా ప్రచారంలోకి వచ్చింది, ముఖ్యంగా పత్రికలు అందులోనూ చిన్న పత్రికలు, ఈ ప్రక్రియకు ప్రాముఖ్య మిస్తున్నాయి. ఇటీవల మినీ కవితల సంపుటాలు కొన్ని పుస్తక రూపంలో వెలువడడం గమనించదగిన అంశం

ఏక విషయాశ్రయమూ వ్యంగ్య ప్రధానమూ అయిన లఘు రచనను మినీ కవిత అనవచ్చు కనుక ఇందులో అప్రస్తుత విషయాల ప్రసక్తి వుండదు; డొంక తిరుగుడు ఉండదు. తాను చెప్పదలచిన విషయాన్ని కవి సూటిగా, సంగ్రహంగా స్పష్టంగా వివరిస్తాడు. సంక్షిప్తత మినీ కవితకు జీవం. కాగా అది పాఠకుణ్ణి అనాయాసంగా ఆకట్టుకుంటుంది. వ్యంగ్య ప్రధానం కావడంవల్ల, ఆలోచింప జేస్తుందికూడా. మలయాళంలో ఈ మధ్య కార్టూను కవితలంటూ వస్తున్నాయి, ఇవికూడా మినీ కవితలే. ఈ కోవకు చెందిన కవితలలో వ్యంగ్యానికి పైచెయ్యి ఒనే అంశాన్ని కార్టూను కవిత అన్న పేరు చెప్పక చెపుతున్నది. ఇక కొన్ని తమిళ మినీ కవితల్ని పరిశీలిద్దాము.

"రాత్రి వేళ వచ్చింది
ఇంకా తెల్లారనే లేదు."

మన స్వాతంత్ర్యం గురించి ఒక రచయిత చెప్పిన రెండే రెండు పాదాల కవిత యిది. మనం ఆశించినట్లుగా, స్వాతంత్ర్యానంతరం కూడా మనల్ని కమ్ముకున్న కష్టాల చీకట్లు తొలగ లేదనీ, సౌఖ్యమనే వెలుగు యింకా రాలేదనీ యీ రెండు పంక్తుల్లో కవి వ్యక్తం చేసిన తీరు బహుధా ప్రశంసార్హం.

బాలకుమారన్ అనే రచయిత నగరాన్ని యిలా దర్శించాడు.

"పక్షులు నివసించే
పెద్ద చెట్లు పడిపోగా
మనుషులు నివసించే
రాతి చెట్లు పెరిగిన అడవి."

ఆ మధ్య ఏ రోజు పత్రికలో చూసినా దొంగ రవాణాదార్లకు సంబంధించిన విషయాలు ప్రముఖంగా కనిపిస్తూ వుండేవి. ఆ విషయాన్ని ఒక రచయిత హితోపదేశం అనే యీ కింది కవితలో హృద్యంగా తెలియజేశారు.

"అలల కడలినైనా దాటి
అర్థం ఆర్జించమని
పెద్దలు సెలవిచ్చిన
హితోక్తి ననుసరించి
ఆర్జించాను అర్థం.
ఆర్జించిన అనంతరం
నాకు లభించాయి
దొంగ రవాణాదారు
అనే ఒక బిరుదూ
కారా గృహ శిక్షా."

అలల కడలినైనా దాటి అర్థం ఆర్జించుము-అని తమిళంలో రుచికరమైన సామెత ఒకటి నేటికీ వాడుకలో వుంది. ఈ సామెతను వ్యంగ్యంతో రంగరించి, సమాజంలో రూపుదాల్చిన ఒక చెడుని రచయిత తెలియజేసిన వైనం ఎంతైనా కొనియాడ దగింది.

గృహ యజమాని కోపతాపాలు ఎన్ని అవతారాలు ఎత్తుతుందో, ఆ విషయాన్ని తిరుమావళవన్ అనే రచయిత చేసిన తుఫాను హెచ్చరిక నుంచి అనాయాసంగా గ్రహించవచ్చు.

"హృదయార్ణవంలో
కేంద్రీకరించిన తుఫాను
భార్యాపుత్రుల వైపుగానో
ఆఫీసు అటెండరు, ఫ్యానుల వైపు గానో
వీయవచ్చు ...
తత్ఫలితంగా
ఫైళ్ళ ప్రాంతాలలో
ఉరుములతో కూడిన వానో
లేకపోతే
గాలితో కూడిన వానో
కురవ వచ్చు."

నేడు వెలువడుతున్న కొన్ని తమిళ మినీ కవితలలో ఇంగ్లీషు మాటలు కొంచెం ఎక్కువగా కనిపిస్తున్నాయి. అయితే, అవి దైనందిన జీవితంలో తరుచు వినిపించేవి కాబట్టి, ఆ మాటలు ఒక విధంగా ఆ కవితలకు జీవం పోసేవిగా వున్నాయి. మ. న. రామస్వామి వ్రాసిన 'నెపోటిజం' ఇందుకు చక్కని ఉదాహరణ.

"మన కమీషనరుగారు
ఐడియల్ వ్యక్తి.
ఆఫీసు కలంతో
సొంత వుత్తరం రాయరు,
సొంత కలంలో
ఆఫీసు సిరా పొయ్యరు,
సొంత వుత్తరం
రాయడం మాత్రం
ఆఫీసు టైములో."

కొబ్బరికాయ చాలా విచిత్రమైనదంటూ ఒక కవి యిలా చమత్కరించాడు.

"పూజా సమయంలో
కొట్టినప్పుడు

వంకరగానూ
పచ్చడికి మధ్యగానూ
పగిలే
విచిత్రమైన కాయ."

ఎన్నికల సమయంలో నాయకులు వాగ్దానాలు చెయ్యడం, ప్రజోపయోగార్థం కొన్ని మంచి పనులు చెయ్యడం మొదలైన వాటిని ఒక రచయిత (ఉళి) ఎన్నికలు రావాలి అనే కవితలో తేట తెల్లం చేశాడు.

"ఎన్నికల సీజన్లో
వేదిక 'సంత' నుంచి
ఒకాయన యిలా అన్నాడు—
ఈ నియోజక వర్గంలో
మంచినీళ్ళు కావాలంటే
వీధి దీపాలు వెలగాలంటే
రోడ్డు వసతి కలగాలంటే....
మధ్యలో ఒకడు
నిలబడి అన్నాడు గదా :
మాటిమాటికి ఎన్నికలు రావాలి."

వ్యంగ్య ప్రధానములైనా, తమిళ మినీ కవితలు చాలావరకు పరుషంగా వినిపించకపోవడం గమనించదగిన మరొక అంశం. నిజానికి కటూక్తులు కాదు, కమ్మని మాటలు వ్యంగ్యానికి జిగీ బిగీ చేకూరుస్తాయి. పరుషోక్తులు ఆవేశం కలిగిస్తే, లలితోక్తులు ఆలోచింపజేస్తాయి. కమలా మణాళన్ అనే రచయిత వ్రాసిన "ఇద్దరు పిల్లలు" కవితను పరిశీలిస్తే, యీ అంశం వ్యక్తమవుతుంది,

"భారత మాత
ఇద్దర్ని కన్నది
ఒకరు స్వాతంత్ర్యం
మరొకరు స్వార్థం.
పెద్దది స్వాతంత్ర్యం
ఇద్దర్ని కన్నది

ఒకరు ప్రజాస్వామ్యం
మరొకరు సోషలిజం
ప్రజాస్వామ్యమూ
ఇద్దర్ని కన్నది
ఒకరు వోటు
మరొకరు దొంగ వోటు.
పెద్దది సుందరి
చిన్నది కురూపి."

వ్యంగ్య వైభవం సంతరించుకున్న మరికొన్ని మినీ కవితలు :

వల్లకాటి చిచ్చు

"కాలం సగం
కామం సగం
దహించి వేశాక
శేషించిన యీ శరీరాన్ని
వల్లకాటి చిచ్చు
ఇంకేం దహిస్తుంది?"

—రొహాుల దాసన్.

అభివృద్ధి

"పత్రికలో పడిన వార్త:
దేశంలో వస్త్రోత్పత్తి
ఈ యేడు రెండింతలు
ఎక్కువయింది.
ప్రజలకోసం కాదు
పార్టీ జెండాల కోసం."

—కే. బాలు సామి.

## వేచివున్నారు

"బస్సు క్యూ మొదలుకొని
లిఫ్టు క్యూ దాకా
వేచి వుండి
ఉద్యోగంలో ఉన్నతికి
వేతనంలో ఉన్నతికి
రేషను సామాన్లకి
వేచి వుండి
వేచి వుండి
విసిగి వేసారి పోయి
ఇంటికి రాగానే
నా కోసమూ వేచివున్నారు
నా కుమారుడూ కూతురూను
ఉద్యోగం కోసమూ
ఉద్వాహ వేళకి."

—అ. ఆశీర్వాదం.

## గుడిసె గొంతు

"అధికారపు బొంగులు
మా జీవితంతో ఒరుసుకుంటాయి
అయితే
మండేవి బొంగులు కాదు
మా కడుపులు!"

—శా. మణి.

ఎందుకో

"మండు టెండలో
వరసలో నుంచుని
ఒళ్ళు వేడెక్కి కాళ్ళు పోట్లు పుట్టి
తీసుకువెళ్ళినా
ఆ బియ్యం మాత్రం
ఎందుకో ఉడకలేదు!"

—భక్తవత్సలం.

కడలీ ఒడలూ

"ఒడలూ ఒక విధంగా కడలే
ఎందుకంటే
ముత్యాలు యిస్తున్నది-చెమట
ముత్యాలు యిస్తున్నది.
కడలీ ఒక విధంగా ఒడలే
ఎందుకంటే
ఉప్పు యిస్తున్నది-చెమట
ఉప్పు యిస్తున్నది."

—నా. వేందన్.

ఇండియా

"చీకట్లో
అగ్గిపెట్టె వెతికి
కిందపడి
దీపం బద్దలుకొట్టి
గాయం పడడం కన్నా
ఇలాగే వుంటాను
తెల్లారదా యేమిటి!"

—రాయన్.

వరదక్షిణ (కట్నం)

"అద్దె కొంపలకోసం
అటూ యిటూ పరుగెత్తే
ఈ మనుషులు....
శాశ్వత గుహాలలో
నివసించేందుకు
గృహ యజమానినే
'అద్దె' అడుగుతున్నారు."

—శివకుమార్.

యాచకుడు

"దేవుడు
ఏమన్నా
రాయా రప్పా
కల్పనా కృతా!
కరుణా సింధువు!
కనుకనే
పొట్ట యిచ్చిన దేవుడు
అతనికి
కాళ్ళూ చేతులూ
కనికరించ లేదు."

—హాజీర్.

కత్తులు లేని నెత్తురు లేని

"గాడీ రంగరు కావించే
పవిత్ర యుద్ధంలో
కత్తులూ లేవు
నెత్తురూ లేదు!
అతను గ్రహించేది

సైకిలు గొలుసు మాత్రమే!
దెబ్బ తగిలిన చోట
ఎముకలే నుగ్గవుతాయి
నెత్తురు రాదు!"

—శక్తిక్కనల్.

శకునం

ప్రొద్దున లేచిన నల్లని పిల్లి
ఆహారం కోసం
బయటికి వెళ్ళింది....
అడ్డంగా మనిషి రావడం చూసి
దిగులు పడింది నల్లనిపిల్లి.
'వెడుతున్నపని
అవుతుందో అవదో
పాడు మనిషి
అడ్డంగా వచ్చాడు.'

—అముద భారతి.

పౌరుషం

అనుకున్న ప్రకారం
అన్నీ అడిగి తీసుకుని
ఆ తర్వాతనే
అగ్ని ప్రదక్షిణంచేసి
మాంగల్యం కట్టడానికి
ముందుకు వచ్చిన
ఓ మహా పురుషుడా!

నిన్ను
చూడ లేక సిగ్గుపడే
తల వంచుకున్నాను.
లజ్జవల్ల మాత్రం కాదు !

మహాప్రభు.

## దేశభక్తి

మా కుటుంబంలో
కొదువ లేదు దేశభక్తికి
తాతయ్య యేమో
ఢిల్లీ .. ఢిల్లీ....
నాన్న యేమో
కేరళ ... కేరళ ...
అన్నయ్యయేమో
ఒరిస్సా... ఒరిస్సా....
అక్కయ్యయేమో
కర్ణాటక....కర్ణాటక....
తమ్ముడికేమో
ఉ.ప్ర....ఉ.ప్ర....
నేనూ అమ్మా తలా ఒకరం
ఒక్కొక్క రాష్ట్రం
లాటరీ టికెట్లు అమ్మడం
తమిళనాడులో నివసించే మాకు
కొదువలేదు దేశభక్తికి.

నిర్మల విశ్వనాథన్.

ఇంటర్వ్యూ

రెండు మండూకాలను
ఎన్నుకునేందుకుగాను
వందమంది మేధావుల్ని
బాధ పెట్టడానికి పేరు
ఇంటర్వ్యూ!

—చ. కల్యాణరామన్.

విస్మృతి

గతకాలపు స్మృతులై
కనిపించిన మోడుల్ని చూసి
కన్నీరు కార్చాను.
భవిష్యత్కాలపు మొగ్గల్ని
ఆత్మ ప్రత్యయంతో
బుజ్జగించాను
వర్తమానకాలపు పువ్వులోని
అనుభవ మధువుని మాత్రం
చవిచూడ మరిచాను.

కణైయాళి, దీపం మొదలైన పత్రికలలో వెలువడిన పై మినీ కవితలు తమిళనాడులోని సామాజిక పరిస్థితులకు మణిదర్పణాలు! తమిళుల ఆచార వ్యవహారాలు, విశ్వాసాలు మొదలైనవాటిని తెలియజేస్తున్నా, యీ మినీ కవితలు సాంఘిక రాజకీయ పరిస్థితుల్ని కళ్ళకు కట్టేలా తెలియజేస్తున్నవని చెప్పడం చర్విత చర్వణం. ప్రస్తుతం తమిళనాడులో పల్లెపట్టుల్లో పట్టణాలలో పాతుకు పోయిన లాటరీ వ్యామోహాన్ని దేశభక్తి కవిత తూర్పార పడుతోంది. కట్నకానుక లన్నీ గ్రహించిన తర్వాతనే మంగళసూత్రం కట్టడానికి ముందుకు వస్తున్న యువకుల్ని చూసి మానవతులైన, యువతులు పడుతున్న మానసిక క్షోభకు

'పౌరుషం' అద్దం పడుతున్నది. 'శకునం'లోని వ్యంగ్య ఆలోచనామృతం! ఆధునిక సమాజంలోని కొందరు సంఘవిద్రోహుల్ని రౌడీల రూపంలో 'కత్తురులేని నెత్తురులేని' కవితలో చూడవచ్చు. దేశంలో జరిగిన వస్త్రోత్పత్తి ప్రజలకోసం కాదట, పార్టీ జెండాల కోసమట! 'అభివృద్ధి' కవితలో ఈ అంశాన్ని కవి చమత్కారయుతంగా వివరించారు

పరిశీలించేకొద్దీ తమిళ మినీ కవితలలో ఇటువంటి అంశాలు ఎన్నెన్నో కానవస్తాయి. నేటి కవిలో సామాజిక స్పృహ పుష్కలంగా ఉందనీ, చాలా మంది దృష్టికి అతి సామాన్యంగా కనిపించే సన్నివేశాలను కూడా అతను కవితా దృష్టితో దర్శించగలుగుతున్నాడనీ, తాను చెప్పదలచిన విషయాన్ని కఠినంగా కాక కమ్మని మాటలతో సుస్పష్టం చేస్తున్నాడనీ చెప్పడానికి ఈ మినీ కవితలు ప్రబల సాక్ష్యాలు!

ఆధునిక తమిళ సాహిత్యంలో మినీ కవితా ప్రక్రియ సుస్థిరమైన స్థానం సంపాదించుకుంది.

# తమిళంలో బాల సాహిత్యం

తమిళంలో బాలసాహిత్యం బాగా అభివృద్ధి చెందినట్లు స్థూలదృష్టికి కూడా తెలియవస్తుంది. వికృతి తమిళ సంవత్సరాదిని, అనగా 1950 ఏప్రిలు 13 న మదరాసులో వెలుగులోకి వచ్చిన కుళన్దై ఎళుత్కాళర్ సంగం (బాలల రచయితల సంఘం) 1976 లో రజతోత్సవం జరుపుకుంది. ఆ నాడు కేవలం పదిహేడుగురు సభ్యులతో స్థాపించబడిన యీ సంఘం నేడు శాఖోపశాఖలతో విలసిల్లే వటవృక్షంలా వుంది. ఈ సంఘ సభ్యులు ఒక్క భారతదేశంలోనే కాక, శ్రీలంక, మలేషియా మొదలైన కొన్ని విదేశాలలో కూడా ఉన్నారు. బాల సాహిత్య నిర్మాతలను యథోచితరీతిని గౌరవించడం, బాలసాహిత్యం గురించి పరిశోధనలు జరిపించడం, బాలసాహిత్య మహాసభలు నిర్వహించడం మొదలైనవి ఈ సంఘ వివిధ కార్యకలాపాలలో కొన్ని. బాలసాహిత్య రచయితలు ఎవరెవరు?– అనే పుస్తకం కూడా ప్రకటించింది ఈ సంఘం. బాలవాఙ్మయ వికాసమునకు కృషి చేస్తున్న ప్రసిద్ధ కవి శ్రీ అళ. వళ్ళియప్ప ఈ సంఘమును స్థాపించారు.

తమిళ బాల వాఙ్మయ చరిత్రలో ఇటీవల మరొక మైలురాయి వెలిసింది. సుప్రసిద్ధ కవులైన శ్రీ మ. ప. పెరియసామి తూరన్ సంపాదకత్వాన పది సంపుటాలలో బాల విజ్ఞాన సర్వస్వం వెలుగులోనికి వచ్చింది. ఈ సంపుటాలలో మామూలువే కాక రంగు రంగుల చిత్రాలు కూడా అందాలు దిద్దుకోవడం ఒక విశేషం. బాల సాహిత్య చరిత్రను సవివరంగా తెలియజేస్తూ 'పూవణ్ణన్' (శ్రీ వి. డి గోపాలకృష్ణన్) ఒక ప్రశస్త రచన చేశారు. ఇవన్నీ చూసినప్పుడు బాల వాఙ్మయానికి ఇంకా ఉజ్జ్వలమైన భవిష్యత్తు కలదని స్పష్టమవుతుంది

కడమ భారతీయ భాషలలో వలె తమిళం లోనూ పిల్లల పాటలూ, పొడుపు కథలూ, పిల్లల్ని ఉద్దేశించి చెప్పబడే కథలూ చాలా ఉన్నవి.

'కాకీ!
కాకీ!
కళ్ళకి కాటుక తీసుకు రావే!

పిచుకా!

పిచుకా!

జాడలోకి

పువ్వులు తీసుకు రావే!

కొంగా!

కొంగా!

పాపకు

పాలూ తీసుకు రావే!'

వంటి పాటలు ఎన్నో నేటికి వాడుకలో ఉన్నవి. పై పాటలో ఉదాహృతములైన వన్నీ పిల్లలకు పరిచితమైనవే. నల్లని కాటుక అనకుండా, నల్లని రంగు కల కాకి అని పేర్కొనడం వల్ల ఆ భావం పరోక్షంగా వ్యక్తం చేయబడింది. పిచ్చుక మహా ఓపిగ్గా ఎక్కడెక్కడో తిరిగి రకరకాల వస్తువులు సమకూర్చుకుంటుంది, తన గూటి కోసం. అటువంటి పిచ్చుకయేమో రకరకాల పూలు తీసుకురావాలట! తెల్లని కొంగ యేమో, యిక, నల్లని పాలు ఎలా తీసుకువస్తుంది? ఇదీ యీ చిన్న పాట లోని విశేషం.

ప్రసిద్ధ ప్రాచీన కవయిత్రి అవ్వైయార్ చెప్పిన సూక్తుల్ని ఈనాటికీ తమిళ బాల బాలికలు ఆదరభావంతో వల్లెవేస్తూ వుంటారు.

తమిళంలో బాల సాహిత్య మన్నప్పుడు తమిళ నవయుగ ప్రవక్త సుబ్రహ్మణ్య భారతి పేరు స్ఫురణకు రాకతప్పదు. కవిత, వ్యాసం మొదలైన యితర ప్రక్రియలతోపాటు పిల్లల సాహిత్యాన్నీ ఆ మహాకవి ఆదరించాడు. ఆదరించడమే కాక నాలుగు కాలాలపాటు నిలిచే మంచి రచనలూ చేశాడు. పిల్లలకోసం ఆయన వ్రాసిన వాటిలో 'పాప్పా పాట్టు' చాలా ప్రసిద్ధమయింది. అందులోని కొన్ని పంక్తులు పరికించండి:

పరిగెత్తి ఆడాలి పాపా-నువ్వు

బద్ధకం మానాలి పాపా

కలిసి మెలిసి ఆడాలి పాపా-ఎవ్వ

రినీ ఏమి అనబోకు పాపా.

కెలుకుతూ తిరిగేటి కోడితో-నువ్వు
చక్కగా ఆడాలి పాపా
దొంగలా బతికేటి కాకినీ-నువ్వు
దయతోను చూడాలి పాపా.
కల్ల మాటలు విడిచిపెట్టాలి
సాడీలు మానాలి పాపా
దేవుడే మనకు దిక్కగును పాపా
కీడేమి రాబోదు పాపా
ఉత్తరాన హిమాలయం, దక్షిణాన
కన్యాకుమారీను పాపా
పెద్ద సముద్రాలు నువు చూసేవు
తూర్పునా పడమరా పాపా,

భారతి అనుయాయులలో ముఖ్యుడూ, కవిమణిగా ప్రథితయశస్కుడూ అయిన దేశిక వినాయకం పిళ్లై కూడా పిల్లలకోసం చక్కనీ చిక్కనీ పాటలు ఎన్నో వెలయించారు. ఆవుని గురించి ఆయన వ్రాసిన పాట చాలా ప్రసిద్ధి కెక్కింది. సారళ్యం ఆయన కవితకు పెట్టని భూషణం, 'ఆవు' పాటలోంచి కొన్ని పాదాలు :

'తియ్యని పాలూ యిచ్చేవు-పొలానికి
మంచి ఎరువూ యిచ్చేవు
బండిని లాగే ఎద్దుని-చక్కగ
పెంచీ పెద్ద చేసేవు
తల్లిలేని పసిపాపలకు-నీవేమో
తల్లి వయ్యేవు
జబ్బుతో బాధపడేవారికి-నువు
మందు వయ్యేవు.'

ఆనాటి రచయితలలో కా. నమశ్శివాయ ముదలియారు, మణి తిరునావుక్కరసు ముదలియారు, మయిలై శివముత్తు ప్రభృతులు పిల్లల పాటలు చాలా వ్రాశారు. ఇవన్నీ తమిళ వాచకాలలో కనిపిస్తూ వుంటాయి కూడా.

ఆధునికులలో చాలామంది పిల్లలకోసం పాటలు వ్రాసేవారున్నారు. పెరియసామి తూరన్, తణిగై ఉలగనాదన్, ఆర్. అయ్యాస్వామి, అళ. వళ్ళియప్ప, తిరుచ్చి భరతన్, తంబి శ్రీనివాసన్, నాగముత్తయ్య మొదలైనవారు కవితా సంపుటులు వెలువరించారు. పిల్లల కవిగా సుప్రసిద్ధుడైన శ్రీ వళ్ళియప్ప వెలయించిన కవితా సంపుటాలలో 'మలరుం ఉళ్ళం' ముఖ్యంగా పేర్కొనదగింది ఆయన వ్రాసిన 'నా దైవం'లోంచి కొన్ని పాదాలు :

'అమ్మా అమ్మా! నువు వచ్చేవు
ప్రేమను నాకు ముద్దిచ్చేవు
అమ్మా! నిను చూచుట తరువాయి
నా యేడుపు పొయ్యేను
అందాలొలికే చంద్రుణ్ణి
ఆకాశంలో చూపుతు
పాలూ పళ్ళూ పెట్టేవు
పాటలు కథలూ చెప్పేవు
నీలా నను పెంచేవారు
లోకంలో లేరెవరు
నన్ను పెంచే మా అమ్మా
నీవే నా దైవ మమ్మా!"

కవితలవలె కమ్మని కథలూ పిల్లలకోసం ఎన్నో వెలువడినవి. తి. జ. ర. (తి. జ. రంగనాధన్), యన్. నటేశన్ (రాజీ), వైత్తణ్ణా (వైద్యనాథన్) ఆర్వి (ఆర్. వెంకటరామన్), కె. జయలక్ష్మి, కామాక్షి శ్రీనివాసన్ ప్రభృతులు కథలెన్నో రచించారు. పిల్లలకి కథలు కమ్మగా చెప్పడం తి. జ ర. కి. వెన్నతో పెట్టిన విద్య. ఈ సందర్భంలో రాజాజీని గురించి చెప్పక తప్పదు. ఏ విష

యమునైనా సరే కథగా, మనస్సుని హత్తుకునేటట్లుగా చెప్పడ మనే కళ రాజాజీకి అబ్బినట్లుగా మరొకరికి అబ్బలేదు అనడం సాహసం కాదు. ఆయన కల్పనా కథలు సంపుటి 'కర్పనై క్కాదు' రాజాజీ కట్టుకథలు అనే పేరుతో తెలుగులో వెలువడింది. పిల్లలకోసం కొన్ని నవలలు కూడా వెలువడకపోలేదు. వాటిలో వళ్ళియప్ప వెలయించిన 'మణిక్కు మణి' అన్నది పేర్కొనదగినది. ఇది "చిట్టికి చిరుగంట" అనే పేరుతో తెలుగు చేయబడింది.

విజ్ఞానశాస్త్ర సంబంధము లయిన రచనలు కూడా ఎన్నో వెలువడడం హర్షించదగిన విషయం. ఈ రంగంలో కృషి చేస్తున్నవారిలో ముఖ్యులు శ్రీయుతులు పి యన్. అప్పుస్వామి, ఎం. యస్. శబరిరాజన్ ప్రభృతులు. పేనా అనే లేఖినీ నామంతో శ్రీ అప్పుస్వామి కొన్ని గేయకథలు కూడా వ్రాశారు. విజ్ఞానశాస్త్ర విషయాలను గురించి వ్యాసాలూ, పాటలూ ఆయన చాలా వ్రాశారు, జీర్ణకోశం గురించి చక్కని పుస్తకం (మన్తిర విద్దై) వ్రాశారు శ్రీ శబరిరాజన్. నాటినుంచీ నేటిదాకా వెలుగులోకి వచ్చిన రకరకాల గడియారములను గురించి శ్రీ కల్వి గోపాలకృష్ణన్ అనే ప్రసిద్ధ రచయిత 'మణి ఎన్న' అనే పుస్తకం వ్రాశారు. ఈ పుస్తకం గడియారం ఆకృతిలోనే అచ్చు కావడం ఒక విశేషం ఇది పిల్లలకు ఎంతో ఆసక్తిదాయకంగా ఉంటుందని వేరే చెప్పనవసరం లేదు.

పిల్లల్ని ఉద్దేశించి జీవితచరిత్రలు ఎన్నో తమిళంలో వెలువడినవి. ప్రసిద్ధ విద్యావేత్త అయిన శ్రీ నె. తు సుందరవడివేలు ప్రపంచ ప్రసిద్ధికెక్కిన ప్రముఖుల జీవిత విశేషాలను చక్కని కథలుగా సంతరించారు. శ్రీ కల్వి గోపాలకృష్ణన్ గాంధీజీ కథను 'వళి కాట్టియ ఉత్తమర్ గాంది యడిగళ్' అనే పుస్తకంలో పరమాద్భుతంగా చిత్రించారు. విశ్వకవి రవీంద్రనాథ ఠాకూరు జీవిత చరిత్రను శ్రీమతి తిలకవతి మనోహరంగా అభివర్ణించారు. "పెద్దలు పిన్నలుగా ఉండే రోజుల్లో" అనే శీర్షికతో శ్రీ వళ్ళియప్ప కొందరు ప్రముఖులను గురించి ఆసక్తి గొలిపే కొన్ని సంఘటనలు తెలియజేశారు.

ఈ సందర్భంలో శ్రీ యం. వి. వెంకట్రామ్ అనే రచయిత చేసిన కృషిని ప్రస్తావించాలి. గాంధీజీ, బాలగంగాధర తిలక్, గోఖలే. వీరసావర్కర్, రామలింగస్వామి, శివాజి మొదలైన ప్రముఖుల్ని గురించి 'నాట్టుక్కు ఉళైత్త

నల్లవర్' (దేశంకోసం శ్రమించిన మహనీయులు) అనే శీర్షికకింద సుమారు 50 పుస్తకాలు వ్రాశారు. ఇవన్నీ సచిత్రకంగా, ఒకే సైజులో ముద్రితము లయినవి. అలాగే, తి. సు. కలియపెరుమాళ్ అనే మరొక రచయిత 'అఱివియల్ అఱిజర్' అనే శీర్షిక కింద సుమారు 20 పుస్తకాలు ప్రకటించారు. విజ్ఞాన శాస్త్రవేత్తల జీవిత విశేషాలు ఈ శీర్షిక కింద వెలువడిన పుస్తకాలలోని ప్రధాన విషయం.

శ్రీయుతులు నాగముత్తయ్య వ్రాసిన కుళన్దైక్కవిత్తైగళ్ (పిల్లల కవితలు), రా. అయ్యాస్వామి సంకలించిన కుళన్దైగళుక్కు నాడోడిప్పాడల్‌గళ్ (పిల్లల జానపద గీతాలు), తంబి శ్రీనివాసన్ వ్రాసిన 'పుత్తకం తయార్' (పుస్తకం తయారయింది), త. నా. సేనాపతి అనువదించిన బొమ్మై తిరుడన్ (బొమ్మ దొంగ-రవీంద్రుని కథలు) మొదలైన పుస్తకాలు కూడా సంభావించదగినవి. రా. అయ్యాస్వామి పిల్లల్ని ఉద్దేశించి మనోహరమైన శైలిలో రామకథను రచించారు. ఇలా వివిధ ప్రక్రియలలోనూ ఎన్నెన్నో చక్కని రచనలు వెలువడినవి.

తమిళ బాలసాహిత్యాభివృద్ధికి రచయితలూ, పత్రికలే కాక పళనియప్పా బ్రదర్స్, పారినిలైయం, క్రైస్తవ సాహిత్య సంఘం (సి. యల్. యస్.), కలైమగళ్ కార్యాలయం. శైవసిద్ధాంత పుస్తక ప్రకాశక సంఘం మొదలైన ప్రసిద్ధ గ్రంథ ప్రకాశకులు కూడా గణనీయమైన కృషి కావిస్తున్నారు

ఈ సందర్భంలో మదరాసులోని దక్షిణ భాషా పుస్తక సంస్థవారు తమిళ బాలవాఙ్మయ వికాసమునకు చేసిన కృషిని అభినందించడం సముచితం. మంచి పుస్తకాలు ప్రకటించడమేకాక, పిల్లల పుస్తకాల పోటీలు కూడా నిర్వహించారు పోటీలలో నెగ్గిన పుస్తకాలను ఇతర దక్షిణాది భాషలలోకి అనువదింపచేశారు. తమిళంనుంచి తెలుగులోకి వచ్చిన కొన్ని పిల్లల పుస్తకాలు ఉదాహరించడం అప్రస్తుతం కాదనుకుంటాను.

అబ్దుల్ ఖాదర్ (వళరుం చుడర్) ఆకాశ దీపం; అను: మధురాంతకం రాజారాం, నవల.

కల్వి గోపాలకృష్ణన్ (కనవు ఉలగిల్ కుళందై గళ్) స్వప్నలోకంలో పిల్లలు; అను : సభాపతి, నవల.

పరక్కుం పాప్పా (పేపరు పాపాయి!) అను : టి. వి. రంగాచార్యులు. నవల.

వళి కాట్టియ ఉత్తమర్ (దారి చూపిన తాత గాంధీ!) అను: చల్లా రాధాకృష్ణశర్మ. జీవిత చరిత్ర.

(మణి యెన్న) టైమెంతయిందీ?; అను: చల్లా రాధాకృష్ణ శర్మ. విజ్ఞానం.

రాజాగోపాలాచారి సి. (కర్పనై క్కాడు) రాజాజీ కట్టుకథలు; అను : టి. వి. రంగాచార్యులు.

వళ్ళియప్ప, అళ, (మణిక్కు మణి) చిట్టికి చిరుగంట; అను: చల్లా రాధాకృష్ణశర్మ, నవల.

(మిరుగంగళుడన్ మూన్రు మణి) మృగాలతో మూడు గంటలు; అను ; మధురాంతకం రాజారాం, విజ్ఞానం.

శబరి రాజన్, యం. యల్. (మన్తిర విద్దై) కడుపులో గారడీ; అను: చల్లా రాధాకృష్ణశర్మ, విజ్ఞానం.

కథల పుస్తకాలు, పిల్లలకోసం ఉద్దేశించబడిన జానపద గేయాలు, తమిళ మహాపురుషుల జీవిత చరిత్రలు మొదలైనవి తమిళంలోంచి తెలుగులోకి ఇంకా ఎక్కువగా వెలువడవలసిన అవసరం ఉన్నది. బాల బాలికలలో కనుక ఇతర భాషలను గురించీ, ఇతర ప్రాంతములను గురించీ సదవగాహన ఏర్పడినట్లయితే, జాతీయ సమైక్యభావం వారిలో చిన్న వయస్సులోనే ఏర్పడుతుంది. అది వారి జీవిత సౌఖ్యానికే కాక దేశశ్రేయస్సుకి దారి తీస్తుంది

# చిరుతొండనంబి కథ

అరవైముగ్గురు నాయన్మారుల (శివభక్తుల) కథలలో తెలుగువారిని బహుధా ఆకర్షించిన వాటిలో చిరుతొండనంబి కథ ప్రముఖమైనది. మహాకవి పాల్కురికి సోమనాథుని నాటికే యీ కథ బహుళ ప్రచారంలో ఉన్నట్లు తెలియ వస్తున్నది. ఆయన వెలయించిన బసవపురాణంలోని యీ క్రింది పంక్తులు అందుకు ప్రబల సాక్ష్యం.

...... ..... ..... ...... ధరణీలోపలను
గరమర్థి నూరూర సిరియాళు చరిత
మేటి యై చను భక్త కూటువలందుఁ
బాటలుగాఁ గట్టి పాడెదువారు
ప్రస్తు తోక్తుల గద్య పద్య కావ్యముల
విస్తారముగ జేసి వినుతించువారు
నట్లుగాక సాంగభాషాంగ క్రియాంగ
పలునాటకంబుల నటియించువారు
మును మాడి వీరు వారన నేల? కూడి
కనుగొన రోళ్ళ రోకళ్ళ బాడెదువారు—

చిరుతొండనంబి కథ భక్త సంఘాలలో ప్రస్తుతింపబడేది. ఊహూర ప్రచారంలో ఉండేది. గద్యపద్య కావ్యాలలో అవతరించింది. ఆ కమ్మని కథకు నాటకాలు కట్టి ప్రదర్శించేవారు. అంత ప్రసిద్ధికెక్కిన కథ అది. కాని మన దురదృష్టం పాల్కురికి సోమనాథునికి ముందు సంతరించబడిన సిరియాళుని చరిత్ర యేదీ నేటికి లభ్యం కాలేదు. పై పెచ్చు ఆ మహాకవి 18 పంక్తులలో చెప్పిన చిరుతొండనంబి కథ శ్రీనాథాది కవులకు మాతృక అయింది. కథ అంతట కూడా చిరుతొండనంబిని సిరియాళుడని వ్యవహరించినాడు. శివసాయుజ్యం పొందిన తర్వాత, శివుడు ఆ భక్తవరేణ్యుణ్ణి చిరుతొండా! అని సంబోధించినట్లు సోమనాథుని కథనం.

సోమనాథుడు అభివర్ణించిన సిరియాళుడు వైశ్యుడు, కాంచీపుర నివాసి. సిరియాళుని భార్య పేరు సంగళవ్వ. నామాంతరం తిరువెంగాణి నంగ. అతని కుమారుడు సీరాళుడు. సిరియాళుడు ప్రదర్శించిన భక్తి నిరుపమానం; ప్రభాత స్మరణీయం. కన్నకడుపనే మమకారం కూడా పూర్తిగా చంపుకుని అతనిని ఇంటికి వచ్చిన అతిథికి నైవేద్యంగా సమర్పించిన పరమభక్తుడు సిరియాళుడు. కాని కథాంతంలో కొంచెం అహంకారయుతుడుగా చిత్రించ బడ్డాడు.

కైలాసం చేరుకున్న తర్వాత సిరియాళుడు ప్రమథగణమును చూచి, నావలె కన్నకుమారుని శివునికి సమర్పించి ఆ తర్వాత తిరిగి పొందిన భక్తుడు మరొకడు లేడు—అని తనలో తా ననుకుంటాడు; కొంచెం గర్వం కూడా ఆవహిస్తుంది. కవి మాటలలో చెప్పాలంటే, "ఎంతయుఁ గ్రొవ్వి తా నహంకరించి తలపంగ" ఈ విషయాన్ని శివుడు పసిగట్టాడు. మందహాసం చేసి సిరియాళుణ్ణి భూలోకానికి తీసుకువచ్చి, నిమ్మవ్వ అనే భక్తురాలి వద్ద నిలబడతాడు శివుడు.

శ్రీనాథకవి సార్వభౌముడు పాల్కురికి సోమనాధుని అనుసరించి చిరుతొండ నంబి కథను 212 గద్యపద్యాలలో హరవిలాస కావ్యంలో పరమ రమణీయంగా చిత్రించాడు. హరవిలాసం శ్రీనాథుని కృతిరత్న మని పండితులు కొందరు సంభావించిన విషయం విజ్ఞులకు తెలిసిందే. కాని శ్రీనాథుడు చిరుతొండ నంబిని సిరియాళుడని పేర్కొనకపోవడం గమనించదగిన అంశం. అలాగే, ఆ కవిరాజు మాయాజంగముడు (శివుడు), జోగిత (పార్వతి) మొదలైన పాత్రలు సృష్టించాడు. చిరతొండనంబి భక్తిని పరీక్షించే నిమిత్తం శివుడు జంగమవేషంలో సీరాళునివద్దకు వెళ్ళి "నీతండ్రి దుర్మార్గుడు; లేకపోతే ఎవరైనా కన్నకుమారుని చంపుకునేందుకు అంగీకరిస్తారా" అని అంటాడు, ముక్కుపచ్చలారని ఆ బాలుని అభిప్రాయం తెలుసుకోవాలని. కాని అతడు జంగమ వేషధారి మాటలను పెడచెవిని పెడతాడు. శ్రీనాధుని కధాకథనం ప్రకారం చిరుతొండడే కాక అతని కుటుంబంలోని వారంతా నిశ్చల భక్తిభావభరితు లని వ్యక్త మవుతుంది. కాని కథకు, పౌరాణిక వాతావరణం కల్పించబడింది. పూర్వజన్మలో చిరుతొండడు తుంబురుడు; సీరాళుడు, కుమారస్వామి; తిరువెంగనాచి గంధర్వ స్త్రీ; దాసి చంద్రిక ఒక అప్సరస. కొన్ని కారణాలవల్ల వారు భూలోకంలో ప్రభవించినట్లు ఆ కవిరాజు పేర్కొన్నాడు. ఈ

పౌరాణిక వాతావరణ కల్పన అనవసరం. అది లేకుండానే కథ అందరినీ అలరిస్తుంది.

తరువాతి కాలంలో గరికిపాటి తమ్మయ్య, చిత్తారు గంగాధరుడు, వాలె కోటయ్య ప్రభృతులు చిరుతొండనంబి కథను కావ్యాలుగా, యక్షగానాలుగా తీర్చిదిద్దారు.

ఇక అరవై ముగ్గురు నాయన్మారుల కథలను అభివర్ణించే రసవత్కావ్య మైన తమిళ కావ్యం పెరియపురాణములో (పెద్దపురాణము) చిత్రితమైన చిరుతొండ నంబి కథను స్థూలంగా పరిశీలిద్దాము.

పెరియపురాణం ప్రకారం చిరుతొండనంబి చోళదేశంలోని తిరుచ్చెంగాట్టం గుడి అనే ఒక గ్రామంలో మహామాత్రు(త్యు)ల వంశంలో ప్రభవించాడు. వీరు బ్రాహ్మణులని ప్రతీతి. అసలు పేరు పరంజ్యోతి. ఆయన వేదాధ్యయన సంప న్నుడు. ఆయుర్వేదంలో కూడా నిష్ణాతుడు. ఆ నాళ్లలో పల్లవ నరసింహవర్మ రాజ్యాధికారం చేస్తూ వుండేవాడు. పరంజ్యోతి రాజుకి నర్మసఖుడు. అంతేకాదు, అమాత్యుడు కూడా. ఒకసారి రాజాజ్ఞ శిరసావహించి పరంజ్యోతి చతురంగబల సమేతుడై తరలివెళ్ళి వాతాపిని వశం చేసుకున్నాడు. జయలక్ష్మితోపాటు, అనర్ఘరత్నరాసుల్ని కూడా ఆయన ప్రభువుకి సమర్పించాడు రాజు సంతుష్ట హృదయు డయ్యాడు. అప్పుడు ఇతర మంత్రులు పరంజ్యోతి ప్రముఖవీర యోధుడేకాక ప్రసిద్ధ శివభక్తుడనీ తెలియజేశారు. అది విన్నవెంటనే రాజు మనస్సు శోకార్ణవమయింది. 'అయ్యో! పరమ శివభక్తుడైన పరంజ్యోతిని యుద్ధరంగానికి పంపి ఆయనచేత హింసాకాండ జరిపించి పాపం మూట కట్టుకున్నాను కదా!' అని రాజు ఎంతో పశ్చాత్తాపం చెందాడు, ఆ తర్వాత తన శేష జీవితాన్ని శివపాదసేవలో గడపడానికి నిశ్చయించాడు పరంజ్యోతి.

చిరుతొండనంబికి సంబంధించిన పై వివరాలు బసవపురాణంలో లేవు. కేవలం శివభక్తుడుగా చిత్రించబడ్డాడు; ఆయన యుద్ధ నైపుణ్యం, వివిధ శాస్త్ర వైదుష్యం మొదలైనవి స్పృశించబడలేదు.

పరంజ్యోతి తదాదిగా శివపాదసేవలో అహర్నిశలూ నిమగ్నుడైనాడు. శివభక్తులకు భోజనం పెట్టకుండా ఆయన భుజించేవాడు కాదు. అది ఆయన

దైనందిన ఆచారం. తాను భక్తపాదరేణుపని ఆయన నిశ్చితాభిప్రాయం భక్తులందరిలోనూ తాను కడపటివాడినని కూడా అనుకునేవాడు. కనుకనే పరంజ్యోతికి చిరుతొండడు అనే సార్థకనామం ఏర్పడింది. తొండడు అనగా భక్తుడని అర్థం. చిరు అనగా చిన్న. చివరికి చిరుతొండడనే వ్యవహార నామమే బాగా ప్రచారంలోకి వచ్చింది. అసలుపేరు మరుగున పడిపోయింది,

ఈశ్వరానుగ్రహం వల్ల చిరుతొండనికి సిరాళుడనే కుమారుడు కలిగాడు. అతనికి పైతృకమైన శివభక్తి చిన్ననాటనే అలవడింది; ఉగ్గుతోనే అలవడినట్లు పేర్కొనవచ్చు

ఇలా ఉండగా చిరుతొండని భక్తి కైలాసం దాకా పాకింది. అతని భక్తి భావాన్ని పరీక్షించాలని శివుడు కృతనిశ్చయుడైనాడు. భైరవజంగమ వేషం ధరించి తిరుచ్చెంగాట్టం గుడికి విచ్చేశాడు. చివరికి చిరుతొండని యిల్లు చేరుకున్నాడు. అప్పుడు చిరుతొండడు ఇంట్లో లేడు. భక్తులకోసం ఊళ్ళోకి వెళ్ళాడు, అందువల్ల స్త్రీలు మసిలేచోట తాను మసలననీ, ఉత్తరదేశం తన ఉనికి అనీ భైరవజంగముడు చిరుతొండని భార్యతో చెప్పి, ప్రతిరోజూ చిరుతొండడు వెళ్ళే గుడికి దారితీశాడు.

ఆ తరువాత చిరుతొండడు ఇంటికి వచ్చాడు. అతని ముఖం వాడిపోయి ఉంది, కళకాంతులు లేవు. ఎంత వెదికినా ఒక్క భక్తుడూ ఆనాడు కన్పించ లేదు, భక్తుడు పంక్తిలో లేకపోతే అతడు భుజించడు అప్పుడు భైరవ జంగముడి రాకను గురించి భార్య అతనికి తెలియజేసింది. మేరలేని సంతోషంతో అతడు భైరవుడున్న చోటికి వెళ్ళాడు. తనతోపాటు పంక్తిలో కూర్చుని భోజనం చేయవలసిందిగా ఆయన్ని అర్థించాడు. అందుకు భైరవజంగముడు ఇలా అన్నాడు.

"ఆరు నెలలైనాసరే, పశువుని చంపి తినడం నా కలవాటు. అలా కాని పక్షంలో ఆనాడు పస్తుంటాను. నేను కోరేది మామూలు పశువు కాదు; నర పశువు. పైగా, ఆ పశువు ఏక పుత్రుడై ఉండాలి. బాలుడై ఉండాలి. అతన్ని

తల్లి తండ్రులు సహర్షంగా వధించి వండాలి. ఈ నా కఠిన నియమాన్ని నీవు తీర్చలేవు...."

భైరవ జంగముడు కోరిన యీ హిరణ్యాక్ష వరాలకు చిరుతొండడు సహర్షంగా సమ్మతించాడు. అనంతరం జంగముడు చిరుతొండని ఇంటికి వెళ్ళాడు.

మాట ఇచ్చిన ప్రకారం చిరుతొండని భార్య సీరాళుని వధించి, వండింది, భోజనం ముందు జంగముడూ చిరుతొండడూ కూర్చున్నారు, అప్పుడు "మీ అబ్బాయిని కూడా భోజనానికి పిలవండి" అన్నాడు జంగముడు. చిరుతొండడు తటపటాయించాడు. అయినా జంగముడు విడిచిపెట్టలేదు. అప్పుడు చిరుతొండని భార్య సీరాలా! సీరాలా! అని పిలిచింది. సీరాళుడు నవ్వు మొగంతో పరుగెత్తుకుంటూ వచ్చాడు. అయితే భైరవ జంగముడు అంతర్ధానమయ్యాడు. తర్వాత వృషభవాహనుడైన ఈశ్వరుడు ఆకాశంలో ప్రత్యక్షమై చిరుతొండనికి, అతని కుటుంబ సభ్యులకూ దర్శన మిచ్చాడు. అనంతరం వాళ్ళందరూ శివలోకానికి వెళ్ళారు.

నిశ్చల భక్తి భావం మూర్తీభవించిన చిరుతొండని కథ స్మరణీయం, చిరుతొండని కమ్మని కథ ఆ నాళ్ళలో ప్రజల నోళ్ళలో నలిగిన కథే! వివిధ సాహిత్య ప్రక్రియలలో అందాలు దిద్దుకున్న ఆ అద్భుత కథ, ఆ తరువాతి కాలంలో కూడా తెలుగువారిని అలరించిన దనడానికి శివదేవధీమణి శతకంలోని యీ క్రింది పద్యమును ఉదాహరించడం సమంజసం.

"అరయగఁ బిన్ననాడు సిరి
యాళుఁడనై, యెలప్రాయమందు సుం
దరుఁడను నంబినై, పదను
దప్పిన గుండయగారి చందమై

ధరఁ జరియింపఁ గల్గిన త
థాస్తు, వృథా పరిపాక దు
ష్కర జననం బిదేమిటికి
కాలుపనే శివదేవధీమణీ !"

బాల్యంలో సిరియాళుడుగా, యౌవనంలో సుందరమూర్తిగా, వార్ధకంలో గుండయ్యగా (తిరునీలకంఠ నాయనారు) మానవుడు కనుక మనుగడ సాగించ గలిగితే అది సర్వోత్తమం. అలా సాగని పక్షంలో, ఎందుకీ జన్మ! కాల్చనా? అనగా వ్యర్థ మని శతక కర్త అభిప్రాయం.

# నావలర్ సోమసుందర భారతి

భారతి అనగానే తమిళ నవయుగ ప్రవక్త సుబ్రహ్మణ్య భారతి పేరు స్ఫురణకు వస్తుంది, అయితే తమిళ సాహిత్యంలో సుప్రసిద్ధుడైన మరో భారతి కూడా ఉన్నాడు ఆయన నావలర్ (పండిత) సోమసుందర భారతి. ఆయన 1879, జూలై 27 న జన్మించాడు. ఆయన శత జయంతిని తమిళనాడులో పెక్కు సాహిత్య సంస్థలు జరుపుకున్నాయి.

ఇద్దరు భారతులూ తిరునెల్వేలి జిల్లాలోని ఎట్టయాపురంలో జన్మించారు ఇద్దరికీ తమిళ భాషా సాహిత్యాలంటె ఎనలేని అభిమానం. ఇద్దరూ సమకాలికులు. ఈ సాదృశ్యాలతోపాటు కొన్ని వైదృశ్యాలూ లేకపోలేదు. సుబ్రహ్మణ్య భారతి కవి. సోమసుందర భారతి విమర్శకుడు కవి భారతిది పండితపామర రంజక మైన శైలి. పండిత భారతిది జటిలమైన శైలి; చాలావరకు పండితులకే ఉద్దిష్ట మైనది. కవి భారతి తన 39 వ యేట కాలధర్మం చెందగా, సోమసుందర భారతి తమ 80 వ యేట (1959 లో) మరణించారు

న్యాయవాదిగా సోమసుందర భారతి జీవిత రంగంలో ప్రవేశించారు. పేరుతోపాటు డబ్బు కూడా గడించాడు. ఆ రోజుల్లో ఆయన నెలసరి ఆదాయం 2 వేల రూపాయలని అభిజ్ఞులు చెబుతారు. అయినప్పటికీ, భారతి న్యాయవాద వృత్తికి స్వస్తి చెప్పి, అణ్ణామలై విశ్వవిద్యాలయంలో తమిళ భాషాచార్య పదవిని స్వీకరించారు. ఆయన భాషాభిమానం అటువంటిది! మధురలోని తమిళ సంఘంలో ఆయన సభ్యులు. ఆ సంఘ సభ్యత్వం అందరికీ లభించదు. ఆయన పాండిత్యానికి అది నిదర్శనమన్నా అతిశయోక్తి కాదు. పండితుడే కాక ఆయన జాతీయాభిమాని కూడా. ఓడ నడిపిన తమిళుడుగా పేరుతికెక్కిన వి.ఓ. చిదంబరం పిళ్లై ఆయన మిత్రుడు. జాతీయోద్యమ కార్యకలాపాలలో పాల్గొన్న తన కుటుంబ సభ్యులకు ఆయన ప్రోత్సాహ మిచ్చాడు.

సోమసుందరభారతి బహు గ్రంథకర్త కాకపోయినా, ఆయన వ్రాసినవి మాత్రం అమూల్యములు. అందులోనూ ఆయన వ్యాసాలు మరీ విలువైనవి, అవి పాండిత్య ప్రకర్షకములే కాక పరిశోధనా ఫలితాలు. తిరువళ్ళువరును గురించీ, కైకేయిని గురించీ ఆయన వ్రాసిన వ్యాసాలు అవశ్య పఠనీయాలు.

తమిళ వేదకర్త అయిన తిరువళ్ళువరును గురించి అనుశ్రుతంగా రకరకాల అభిప్రాయాలు వస్తున్నాయి. ఆయన ఒక బ్రాహ్మణ యువకుడికీ ఒక పంచమస్త్రీకి పుట్టినవాడని కొందరు, వళ్ళువ జాతికి చెందినవాడని మరికొందరు, ఆయన జన్మస్థలం మదరాసులోని మైలాపూరనీ—ఇలా అనుకోవడం పరిపాటి అయింది. వీటిని సోమసుందర భారతి సోపపత్తికంగా ఖండించి వళ్ళువర్ అభిజాత్యుడని నిరూపించారు. అంతేకాదు. వళ్ళువర్ జన్మస్థలం కూడల్ నామాంతరం కల మధుర అనీ ఆయన ప్రాచీన తమిళ సాహిత్యం నుంచి ఉదాహరణలు చూపి నిరూపించారు. ఆయన అభిప్రాయంలో తిరుక్కురళ్ స్వతంత్ర రచన.

భారతి రచనలలో విశిష్టమయింది దశరదన్ కుఱైయుం కైకేయి నిఱైయుం (దశరథుని లోపమూ కైకేయి సుగుణమూ). లోకం దృష్టిలో కైకేయి కుటిలమతి; రాముడి వనవాసానికి కారణభూతమైన కఠిన హృదయ. కాని వాల్మీకి, కంబ మహాకవుల రచనల్ని ఆధారంగా చేసుకుని తప్పంతా దశరథుడిదే అని సోమసుందర భారతి సోదాహరణంగా నిరూపించారు. కైకేయి వివాహ సందర్భంలో దశరథుడు కేకయమహారాజుతో ప్రస్తావించిన రాజ్య శుల్క విషయాన్ని గుర్తుచేసి, భరతా! ఈ రాజ్యం నీదే అంటాడు రాముడు (వాల్మీకం, అయోధ్యకాండం) కంబడి దృష్టిలో కైకేయి 'దెయ్వక్కర్పినాళ్.' అనగా ఆమె దివ్యమైన శీలం కలదని భావం. 'ఈ రాజ్యం పుట్టుకతోనే నీకు సంక్రమించింది' అని కంబడి రాముడు కూడా అంటాడు. ఈ రెండు ఆధారాలను ఎత్తి చూపి, దశరథుడి సత్యవాక్పరిపాలనకు భంగం వాటిల్లకుండా వుండాలనే సదుద్దేశంతో కైకేయి వరములు అడిగిందని ఆయన అభిప్రాయపడ్డారు.

ఇక దశరథుడి లోపాలను సోమసుందర భారతి యిలా తెలియజేశారు. వివాహం జరిగిన కొన్నాళ్ళకల్లా భరతుణ్ణి కేకయ రాజువద్దకు పంపించాడు దశరథుడు. అప్పటినుంచి అతను అక్కడే వుంటడంవల్ల, రాముడి మీద దశరథుడికి గల ప్రేమ అగ్గలమయింది. రాజ్యవ్యవహారాలలో రాముణ్ణి పాల్గొనేటట్లు

చేశాడు. తత్ఫలితంగా రాముడు ప్రజాభిమానాన్ని చూరగొనేందుకు నదవకాశం లభించింది. పైగా రాముడికి పట్టాభిషేకం చెయ్యాలన్న తన అభిలాషను దశరథుడు గుప్తంగానే ఉంచాడు. అదీకాక, పట్టాభిషేకం గురించి యితర రాజులకు తెలియజేసిన దశరథుడు కైకేయికి ఆ విషయం తెలియజేయ లేదు.

ఈ సందర్భంగా వాల్మీకి రామాయణం అన్ని విషయాలను అరమరిక లేకుండా తెలియజేసిందనీ, కంబరామాయణం అలా స్పష్టంగా చెప్పలేదనీ సోమసుందర భారతి అభిప్రాయం. అందుకు కారణం కంబకవి కాలపు పరిస్థితులే అని కూడా అని ఆయన అన్నారు. మొత్తం మీద ఆయన పేర్కొన్న అంశాలు ఆసక్తిదాయకంగా ఉన్నాయనడంలో సందేహం లేదు.

సోమసుందర భారతి రెండు కావ్యాలు కూడా వ్రాశారు. మారివాయిల్, తిరునరైయూర్ నంబి మేగవిడుతూదు అనేవి ఆ కావ్యాలు. మారివాయిల్ మేఘసందేశం అనుసరించి సంతరించబడింది మారివాయిల్ అన్న పదబంధం మేఘసందేశానికి సరి అయిన తమిళానువాదం. రెండవ కావ్యంలో అర్జునుడి భార్యా పాండ్యరాజతనయా అయిన చిత్రాంగద విరహవేదన అభివర్ణితం. వివాహానంతరం అర్జునుడు వెళ్ళిపోతాడు. అతనికోసం చిత్రాంగద అహర్నిశలూ ఎదురుచూస్తూ వుంటుంది. ఆమెకు మగ పిల్లవాడు పుడతాడు. ఒక రోజు కన్యాకుమారివద్ద సముద్రస్నానం చేస్తూ, మేఘుడి ద్వారా తన విరహబాధను వ్యక్తం చేస్తుంది చిత్రాంగద. వచన రచనవలె, సోమసుందర భారతి కావ్యరచన కూడా జటిలమైన శైలిలో సాగింది. ఒకటికి రెండుసార్లు చదివితేనే ఆ కావ్యాలు అర్థమవుతాయి. మామూలు పాఠకులకు అవి అంతగా రుచించక పోవచ్చు.

తమిళసాహితీవేత్త, జాతీయాభిమానీ, ప్రముఖ విమర్శకుడూ అయిన నావలర్ సోమసుందర భారతి పాత్ర చిత్రణ కావించిన ప్రథమ తమిళ రచయితగా చిరస్మరణీయుడు!

# తొలి తమిళ - తెలుగు నిఘంటువు

బహుభాషా నిలయమైన మన దేశంలో ద్విభాషా నిఘంటువులకు గల ప్రాధాన్యం గురించి వేరే చెప్పనవసరం లేదు. ఆంగ్లం—తెలుగు, హిందీ-తెలుగు ఇలా ద్విభాషా నిఘంటువులు కొన్ని మనకు ఉన్నవి కాని, హిందీని మినహాయించి రెండు విభిన్న భారతీయ భాషలకు సంబంధించిన నిఘంటువులు మాత్రం పేర్కొనదగినవి లేవనడం సత్యసన్నిహితం. అనువాద కార్యక్రమానికి ద్విభాషా నిఘంటువులు బహుధా ఉపకరిస్తాయి వాటి అవసరం అప్పుడు కొట్టవచ్చినట్టు తెలియవస్తుంది. ఈ దృష్టితో చూస్తే, సుమారు నూటయాభై యేళ్ల క్రితం సంతరించబడిన తొలి తమిళ - తెలుగు నిఘంటుకర్తనూ, ఆయన దూరదృష్టినీ ఎంతైనా కొనియాడవలసి వుంటుంది. కాని ఆ మహనీయుని పేరు తెలియరాకపోవడం నిజంగా మన దురదృష్టం!

ఆంధ్ర విశ్వవిద్యాలయంవారి గ్రంథాలయంలో తాళదళగ్రంథ విభాగంలో ఉన్న ద్రవిడ నిఘంటు శ్రీకోశమే యీ తొలి తమిళ - తెలుగు నిఘంటువు. దీని ఉనికిని నాకు తెలియజేసిన సహృదయులు ఆచార్య తూమాటి దొణప్పగారికి చాలా కృతజ్ఞుణ్ణి.

నిఘంటువులోని మొదటి ఆకులో సగము భాగమూ చివరి ఆకూ లుప్తమైపోవడంవల్ల, నిఘంటుకర్త పేరు తెలియలేదు. కాని నిఘంటువుని శ్రీకోశం అని వ్యవహరించడంవల్ల, ఆయన శ్రీ వైష్ణవుడై ఉండవచ్చుననీ, ఆయన విజయనగరం తత్పరిసరాలకు చెందినవాడై ఉండవచ్చుననీ భావించవచ్చు. వ్రాత స్పష్టంగా చక్కగా ఉంది.

అకారాదిక్రమంలో కూర్చబడిన యీ నిఘంటువులో తమిళ శబ్దములు తెలుగు లిపిలో ఇవ్వబడినవి తమిళోచ్చారణకు ప్రాధాన్యం ఇవ్వలేదు. తమిళులు ఉలకం (లోకం) అని వ్రాసినా, ఉలహం లేక ఉలగం అని ఉచ్చరిస్తారు. నిజానికి ఇది హకారమూ కాదు సకారమూ కాదు. హకార గకారములకు మధ్య ఉన్న ఒక వింత ధ్వని. అలాగే వ్రాతలో ఇన్ధిక అని వ్రాసినా, ఇన్దిర అనే

ఉచ్చరిస్తారు. తెలుగులో ழ కారం లేకపోవడంవల్ల, నిఘంటు కర్త ழ కారాన్ని యథాతథంగా ఉపయోగించాడు. చీత్రం మొదలైన శబ్దాలను తమిళ లిపికి అను గుణంగానే చీఱ్ అం అని లిప్యంతరం చేశాడు. తెలుగు అర్థాలకు ఆనాటి శిష్ట వ్యావహారికం ఉపయోగించాడు. కొన్ని సందర్భాలలో తెలుగు సముచ్చయమైనను కి బదులుగా తమిళ సంప్రదాయానుసారం ఉం వాడబడింది.

ఉదా: ఆకాశముం మేఘముం-ఆకాశమును మేఘమును.

ఇక నిఘంటు కర్త యిచ్చిన కొన్ని తెలుగు అర్థాలను పరిశీ లిద్దాము.

ఏమం అనే మాటకు తమిళంలో రాత్రి, సంతోషం, ఉన్మత్తత, కావలి, తెర, నిధి, బంగారం, విభూతి మొదలైన పెక్కు అర్థాలు ఉండగా, నిఘంటుకర్త ఒక్క కావలి అనే అర్థం మాత్రం ఇచ్చాడు. అం అనగా తమిళంలో అందము, నీరు, అని అర్థాలు. కాని నిఘంటువులో తమిళంలోనే కోలం అనే అర్థం ఇవ్వ బడింది. కోలం అనగా తమిళంలో అందమని అర్థం, ఇటువంటి అర్థాలు అక్క డక్కడా కనిపిస్తాయి.

నిఘంటుకర్త తమిళ భాషాభిజ్ఞుడనడం నిస్సందేహం. అయినా కొన్ని మాటలకు సరి అయిన అర్థాలు ఇచ్చినట్లు చెప్పలేము. ఒక ఉదాహరణ, ఇన్నాప్పు డనే మాటకు దుఃఖము, బాధ అని అర్థాలు. కాని యీ నిఘంవుటులో కోపం అని అర్థం చెప్పబడింది.

పాఠకుల పరిశీలనార్థం నిఘంటు కర్త యిచ్చిన కొన్ని అర్థాలను యథా తథంగా ఉదాహరిస్తున్నాను.

| | | |
|---|---|---|
| అకవుతల్ | = | నశింప చెయ్యడం |
| అం | = | కోలం (అందము) |
| అక్కఱై | = | కార్యం |

ఇంతుళి = ఇంగువ

ఇతల్ = అధరమున్ను పుష్పం యొక్క రేకున్ను

ఇంతిరజాలం = అబద్ధం

ఇంటిరలోకం = పరమపదము

కవల్ = శైథిల్యం

చీట్రం = కోపము చీమడమున్ను

చిట్రరై = వెఱ్ఱివాడున్ను సుందరమైన వండ్లును

తురత్తల్ = తోలడము

తుంపల్ = వస్త్రముం నిద్రైయుం

తువరై = వర్షం

తుఱవి = విడవడమున్ను త్యజించడమున్ను

తూ = పరిశుద్ధత

తూచనం = దూషణం

నారై = ఆచార్యనుం నారాయణపక్షియుం

పులత్తల్ = యడబాయడము

మిక్కై = అధికం

మాలై = సంధ్యాకాలముం మాలికైయుం

వానం = ఆకాశముం మేఘముం పరమాకాశముం

వాదై = బాధ

వెఱుప్పు = కోపము

వెళ్ళిఅవు = మత్స్యవిశేషం

వెఱువియర్ = యేమి లేనివారున్ను దరిద్రులు

వెఱుమై = దారిద్ర్యము లేమిడిన్ని అకించన్యము

వాయాటి = వాచాలకుడున్ను వాగ్విన్ని యేవేళా స్మరణకు వచ్చేవాడు,

మొత్తము మీద ఈ ద్రవిడ నిఘంటువు తమిళ శబ్దములకు గల ముఖ్యమైన కొన్ని అర్థాలు తెలుసుకునేందుకు చాలా ఉపయోగిస్తుంది. మణి ప్రవాళ శైలిలో సంతరించబడిన వైష్ణవ గ్రంథాలను చక్కగా అర్థం చేసుకోవాలనే అభిలాష గలవారిని దృష్టిలో ఉంచుకుని ఈ నిఘంటువుని కూర్చినట్లు పేర్కొనవచ్చు. దీన్ని సంస్కరించి ప్రకటించడం ఎంతైనా అవసరం. ఇదే తొలి తమిళ-తెలుగు నిఘంటువు కావడంవల్ల, ఈ నిఘంటుకర్త ప్రయత్నం ప్రశంసార్హం.